# తూర్పు రేఖలు



రచన:

శ్రీమతి వేదుల శకుంతల



ప్రజా ప్రచురణలు
ఏలూరు (ఆంధ్రప్రదేశ్)

# తూర్పు రేఖలు

## ఇంటిముందు బండి ఆగింది !

నారాయణరావుగారు పేపరు పక్కకి జరిపి కళ్ళజోడు ముక్కుమీదకు జార్చుకుని తలవంచి చూసేరు !

పచ్చని పాదం, పట్టా గొలుసులతో ... కాళ్ళ మెట్టెలతో....బయటికిపెట్టి మెల్లగ కిందికి దిగింది, భవాని.

బండిలోనుంచి పాపని కిందకి దింపి బాబుని చంక నెత్తుకుంటు వస్తాడు —— నారాయణరావుగారు....చటుక్కున లేచి పేపర్ కింద పడేసి——"ఇదిగో ఏమేవ్ ... పెద్దమ్మాయి, పిల్లలు వచ్చారు" అంటూ ఇంటిలోపలికి కేక వేసి గబగబా వీధిలో కెళ్ళారు——

"ఏమమ్మా - ఒక కార్డుముక్క రాస్తే .... స్టేషనకి వచ్చేవాణ్ణిగదా ?"——అంటూ బాబుని భవాని దగ్గర నుంచి తీసుకుని .... బండివాడు పెట్టి, బెడ్డింగ్ తీసుకొస్తూవుంటే, ముందుకు నడిచేరు.

"ఏదీ సమయం సరిపోలేదు ! అప్పటి కప్పుడు అనుకుని బయలుదేరాను." అంది భవాని, చెక్కగేటు తీసుకుని-ఇంటి ఆవరణలోకి అడుగుపెడుతూ .... "అతనూ, అత్తయ్యా పిల్లలూ....బాగున్నారామ్మా ?"——అనడిగేరు నారాయణ రావుగారు——.

"ఆఁ! ఆఁ!—అంతా బాగానే వున్నారు."

అప్పటికే—భర్త అంతక్రితం వేసిన కేకవిని....పెరట్లో బావిగట్టుమీద స్నానంచేసి చీర ఉతుక్కుంటున్న .... జానకమ్మ—ఆదరా బాదరా ఆ తడి చీర చుట్టబెట్టుకుని — "ఏమిటీ? పెద్దమ్మాయి పిల్లలూ వచ్చారా?" — అనుకుంటు — వీధి వరండామీదకి వచ్చి...."ఏమ్మా అంతా కులాసాగా వున్నారా? ఏమిటి అనుకోకుండా ఇంతఅకస్మాత్తుగ వచ్చావ్?"—అని—ఓ పక్క అమ్మాయి వచ్చిందన్న సంతోషం....మరొక పక్క-అనుకోకుండా ఎలా వచ్చిందా? అన్న సంశయం-ఆమెను చుట్టుముట్టేస్తువుంటే-అండిగింది—.

"ఆ!—అంతా కులాసాగానే వున్నారమ్మా!—అని బండివాడు పెట్టిన సామానంతా చూసుకుని....పర్సు తీయబోయింది.

నారాయణరావుగారు వారించి తను డబ్బులిచ్చి పంపించారు.

"అదేమిటీ? బాగా చిక్కిపోయావ్? నల్లబడ్డావు కూడా! పిల్లదానికి ఏమైనా జ్వరమా?—బాబుకి ఒంట్లో బాగుంటోందా? బుగ్గలెంతలా పీక్కుపోయాయో? జానకమ్మ మాతృప్రేమ గంగాప్రవాహంలాగ - ప్రశ్నల రూపంలో ప్రవహిస్తూవుంటే - నారాయణరావుగారు, నవ్వి...."ఇంతకీ వాళ్ళని ఇంట్లోకి రానిస్తావా? ఆడవాళ్ళకి కళ్ళుపెద్దవి పెట్టినా పెట్టక పోయినా....చూసే విధానంలో తేడా పెట్టేడు - భగవంతుడు - వాళ్ళ దృష్టికి ప్రతీది భూతద్దంలో చూసినట్టు - ఉన్నదానికంటే పెద్దగ కనిపిస్తూ

వుంటుంది !- అందులోనూ....కట్టుకున్న భర్త - కన్నపిల్లలు అయితే మరీనూ!-" అనేసరికి భవాని నవ్వింది !

నిజమే నాన్నా ! భగవంతుడు ఈ పక్షపాతం ఎందుకు చూపించేడో కానీ - పురుషుడి కంటే స్త్రీ ఎక్కువ బాధలు పడడానికి కారణం అదే ! ఆమె దృష్టిలో గోరంతలు .... కొండంతలుగా కనిపించి .... మనశ్శాంతి లేకుండా చేస్తున్నాయి!" "ఆమాటా నిజమే! అందుకు నిదర్శనం మీ అమ్మే !-చూడు ఆ తడి చీరవిప్పి-పొడిబట్ట కట్టుకో- లేకపోతే ఏ జలుబో చేసి జ్వరం తగిలితే- రాక రాక వచ్చిన అమ్మాయి, పనులు అందుకోవలసి వస్తుంది-"మనమిద్దర్ని క్రిందకి దింపిపెట్టి ఇంట్లో పెట్టే ప్రయత్నం చేస్తుండగ - భవాని తనొకవైపు పట్టుకుని - సహాయం చేసింది!

జానకమ్మ హడావిడి పడుతూ .... "పిల్లలకి పాలు పట్టమ్మా-నువ్వు కాస్త కాఫీతాగు-ఎప్పుడనగా తాగేరో.... తిన్నారో"-అంటూ ఇంట్లోకి నడిచింది ! సామాను లోపల పెట్టి, తండ్రి కూతుళ్ళు కబుర్లు చెప్పుకుంటు వుంటే - రైల్లో తిన్న కోవాబిళ్ళలు... పిప్పరమెంటు .... పాకం అరచేతులకి అంటుకుని .... గుప్పెళ్ళు మూసి తెరచినప్పుడల్లా జిగురు జిగురుగా అనిపిస్తున్న పాపకి - వరండాలో నీళ్ళతడి కన్పించింది ! - ఆ తడి అంతకు ముందు జానకమ్మగారి తడిచీర నుంచి కారిన నీళ్ళు ! పాప గబగబా చేతులు రెండు ఆ మడుగులో ముంచింది. ఇంతలో బాబుకూడా పాకుతూ వచ్చి-అక్క చేసిన పని చూసి, తనూ అందులో చేతులు

ముంచి తపతప కొట్టి నీళ్లు చిందుతూవుంటే అక్కని చూసి
కేరింతలు కొట్టేడు.

పెద్దవాళ్లు లోపల గందరగోళంగ అన్ని విషయాలు మాట్లాడుకుంటు పిల్లల్ని వరండాలోనే వదిలేసి, వాళ్ళ ఆటలకి అంతరాయం కల్గించరు-ఆ సమయంలో-చెక్కపెట్టు తీసుకుని-గబగబా లోపలికి వస్తున్న విశాల-ఒక్క క్షణం ఆగి-నిదానంగ పిల్లల్ని చూసి 'ఓ భవాని వదిన వచ్చినట్టుంది!'-అనుకుని మరింత త్వరగా ఇంటిని సమీపించి-బాబుని ఎత్తుకుని-"ఏమ్మా ఇందూ ఎప్పుడు వచ్చారూ?" అని అడుగుతూనే ఇంట్లో కెళ్ళింది. కొత్తమనిషి ఎవరో వెలియక ఇందిర తమ్ముణ్ణి లోపలికి తీసికెళుతూవుంటే తనూ నడిచింది.

వంటింటి గుమ్మానికి రెండు చేతులు ఆనించి అటు తిరిగి నుంచున్న నారాయణరావుగారు కానీ, పీటమీద కూర్చుని కుంపటి విసురుతున్న జానకమ్మగానీ - విశాలని గమనించలేదు .... తలవంచుకుని .... మసులుతున్న నీళ్ళమీదే దృష్టి నిలిపి-తల్లి వేసిన ప్రశ్నలకి జవాబులు చెప్తున్న భవాని....అంతకన్నా చూడలేదు!- అయితే విశాల ఎత్తుకున్న బాబు మాత్రం....కొత్తవాళ్ళదగ్గర అంతసేపు ఆగలేక, ఏడుపు అందుకునే సరికి-అందరు వెనక్కి తిరిగి చూసేరు.

"ఓ విశాలా?!-ఎంతసేపైందమ్మా వచ్చి?"- అన్నారు నారాయణరావుగారు.

"చాలాసేపే అయ్యింది. ఏదీ మా వదిన వచ్చాక అత్తయ్యా నన్ను గమనిస్తుందామరి?"-అని ఓ విసురు భవాని మీదకి విసిరి-ఏడుస్తున్న బాబుని అందించింది!—

"ఊఁ! వచ్చానో లేనో మొదలెట్టేవ్!"-అని నవ్విం
భవాని.

"కాదు మరి?-ఇంక నేనె వర్ని అనగలనూ?-అనా ఎవరు పడతారూ?"-విశాల ఆ మాటలు అంటూ నవ్వినా.. జానకమ్మ బాధగచూసి...."పిచ్చిపిల్ల"!-అనుకుంది. నారాయణ రావుగారు....అక్కడనుంచి తప్పుకుని...."ఊఁ. త్వరగా ఆకా ఏదో కలుపుతే కాస్త అందరు తాగవచ్చును!"- అంటూ భార్య మళ్ళీ కబుర్లలో పడిపోతుందేమో అన్నట్లు హెచ్చరించి-వరండాలోకి వెళ్ళిపోయారు. కాఫీలు కలిపి అందరి ఇచ్చి....పిల్లలిద్దరికీ పాలు పట్టిస్తూ..."ఏమే విశాలా మీ పిన్ని కులాసాగా తిరుగుతోందా?"- అని అడిగిం జానకమ్మ!-.

"ఆ! అన్నట్టు ఆ సంగతి చెప్దామని వచ్చి....వదిని చూసి....కబుర్లలో పడిపోయేను-పిన్నిని ఇందాక పురిటిగద లోకి తీసుకెళ్ళారు....నిన్ను పిల్చుకురమ్మని బాబాయ్ నన్ను పంపేడు...."

"ఓసి నీ అఘాయిత్యమా? ఆ సంగతి ఇప్పుడా చెప్పడం?-నడు నడు....అమ్మా భవానీ-నువ్వూ, పిల్లల స్నానాలు చెయ్యండి....నేనిప్పుడే వస్తాను...."హడావిడిపడుతూ జానకమ్మ లేవబోతుంటే- "మరేం ఫర్వాలేదు అత్తయ్యా పిన్నికిదేమన్నా తొలిచూలా?.... మలిచూలా? ఎంచక్కా అష్టమగర్భం!-ఏటా ఇదే భాగోతం! నామకార్థం నిన్ను పిలవడమే కాని....చెప్పింత మనిషి....మా సుబ్బమ్మత్త....ఇక్క పురుడుపోసి .... బొడ్డుకోసి .... బాలింతరాలికి నడికట్టువే

కూర్చోబెడుతుంది. మంచంమీద!-నువ్వెళ్ళి-ఆ పసిగుడ్డును చూసి-ఎవరి పోలికో....ఏంపేరు పెడితే బాగుంటుందో .... పిన్ని ఎంత అదృష్టవంతురాలో....వగైరాలన్నీ చెప్పడమే కానీ....మరింకే అవసరం వుండదు! అందుచేత తొందరేం లేదు. ఎన్నాళ్ళకో వచ్చింది వదిన! అన్నీ చూసి మెల్లగ రా! నేను వెడతాను...."అని వెళ్ళబోతున్న విశాలని "ఏం పిల్లవే! వచ్చిన వదిన ఎక్కడికి పోతుందే?- నను నేనూ వస్తాను?-అవసరం అప్పుడు రాక....ఆ తర్వాత ఎందుకూ?"- అంటు భవానికి మరొకసారి-ఇప్పుడే వస్తానని చెప్పి .... విశాలతో పాటు వెళ్ళింది జానకమ్మ తర్వాత తండ్రితో మాట్లాడుతు....పిల్లలకి స్నానాలు చేయించి-తనుచేసి వంట ప్రయత్నం చేద్దామనుకుంటు వుండగానే....జానకమ్మ తిరిగి వచ్చింది. "ఎలావుందమ్మా?"- అన్న భవానితో...."విశాల చెప్పింది నిజమే! పురుడు అంతా సవ్యమే! ఆ పసిపిల్ల!- తల్లి పిల్లని ఒళ్ళో పెట్టుకుని కూర్చుంది! - అని నవ్వింది" జానకమ్మ.

o o o

సాయంత్రం ఆరుబయట నీళ్ళు చల్లి మంచాలు వాల్చింది, పనిమనిషి-మంగ జాజి పందిరి క్రింద నుంచిని.... వోణీ నిండా మొగ్గలు నింపుకున్న మాలతి-పైకిగకి వుండి పోయిన మొగ్గల్ని అందుకునేందుకు-పైకి ఎగురుతోంది.

"ఇక చాల్లే మాలతీ! తీగకివున్న మొగ్గలన్నీ తుంపేయకు." అని పిల్చింది భవాని. అక్కవైపు చూసి చిన్నగ

నవ్వి....వచ్చి అక్కపక్కనే మంచంమీద వున్న వె
పళ్ళెంలో....కొంగులో వున్న మొగ్గలన్నీ దులిపింది. అంత
ముందు అందులో వున్న - కనకాంబరాలు .... మరు
కొమ్మలు-సన్నజాజి మొగ్గలతో కలిసి....చిత్రమైన అందాన్ని
సంతరించుకున్నాయి!-దారపువుండ తెచ్చుకుని-అక్కపక్క
కూర్చుని మాల కట్టడం మొదలెట్టింది మాలతి - వీధిగే
దగ్గర ఆడుకుంటున్న పాప-పెరటి వైపు వచ్చి .... వువ్వు
కడుతున్న పిన్నిని చూడగానే.... "పిన్నీ పిన్నీ!-మలేమొ
నాకు రెండు జడల్లోకి ఇంత పెద్దది కావాలి ఇత్తావా ..
ఏం ఇత్తావా మలి?"-గడ్డం పట్టుకుని అడిగి-వంగి పిన్ని ముఖ
లోకి చూసింది.

మాలతి పాప బుగ్గలు ముద్దెట్టుకుని .... "అలాగే లే..
మరి నాకు రెండేసి పూలు అందిస్తూవుండు గబగబా కట్టే
పెట్తాను"-అనగానే "ఓ!"-అంటు హుషారుగ మంచంఎక్కి
కూర్చుని....పరికిణీ పైకి మడుచుకుని....పళ్ళెంలోనుంచి పూ
తీసి అందించడం మొదలు పెట్టింది-.

భవాని కూతుర్ని....చిన్న చెల్లెల్ని చూసి....'ఇద్దరిద్ద
'పూల పిచ్చి'....అనుకుని పూలవైపు చూసింది - 'ఎరుపు
తెలుపు-ఆకుపచ్చ-వెండిపళ్ళెంలో కలిసిపోయి వింతగ శో
స్తున్నాయి! ఇంకా చీకటి పడలేదు గనుక జాజి మొగ్గ
విప్పుకోలేదు!- యవ్వనం రాని బాలికల్లాగ .... వున్న
మొగ్గలు కాస్త పొద్దుజారి దీపాల పెట్టే వేళకి....జలజలమంట
రేకులు విప్పుకునినాపడుచు పిల్లల్లాగ .... సోయగాలు ఒల
పోస్తూ...కులుకుతాయి....తలల్లోదూరి పకపక నవ్వుతాయి!

అయితే ఎంతసేపూ ?- తీసిపారేయగానే ...జవసత్వాలుడిగిన ముసలాళ్ళలా ఒడిలి ఎండిపోతాయి!-ఈమాత్రం భాగ్యానికి ఎందుకింత ఆరాటం? - చక్కగ ఏ దేవుడి ఫోటోకో వేస్తే బాగుండదూ?'-

అని తలపోస్తూండగానే-మాలతి చేతిలో మూరెడు మాల తయారైంది.-కొలత పెట్టి కత్తిరించబోయిన మాల తిని వారించి-"నాకు అంత పెద్దది వద్దు. చిన్నది చాలు. పాప, నువ్వూ పెట్టుకోండి"-అన్నది.-

మాలతి అక్కవైపు అదోలా చూసి...."ఏంటక్కా-? పెద్దది వద్దంటావ్? చిన్నక్క అయితే-ఈ దండంతా ఇచ్చినా తీసేసుకుంటుంది. అంతదాకా ఎందుకు? పాపకి కూడా కావాలిఇంత 'పెద్ద' దండ అవునా పాపా?"-అంటు పాపని అడిగితే- 'అవునన్నట్టు' తలవూపుతున్న కూతుర్ని చూసి నవ్వి-"కావాలన్న వాళ్ళకి ఇయ్యొరాదూ?-నా వంతుకూడా దానికి పెట్టులేగానీ - చిన్నక్క దగ్గర నుంచి ఉత్తరాలు వస్తున్నాయా?"- అనడిగింది.

భవాని ప్రశ్నకి వెంటనే జవాబు చెప్పలేదు మాలతి !

మాలతి పెట్టిన దండ చూసుకుని మురిసి పోతున్న "పాప అమ్మమ్మకి చూపించనా?"-అని మంచం దిగింది. ఊఁ వెళ్ళి చూపించి....ఇవిగో ఈ పూలు అమ్మమ్మకియ్యి"- అని విడిపూలు కొన్ని పాప దోసిట్లో పోసి పంపించింది, మాలతి....

"చిన్నక్క ఉత్తరాల సంగతి అడగకక్కా! దాని దంతా ఒకవింత!-రాసిందంటే - అదేపనిగ వారం వారం యోగక్షేమాలతో రాసేస్తుంది! లేదా ఇక జవాబే వుండదు. క్షేమం కూడా తెలియదు. ఆ మధ్య ఒక కార్డు వచ్చింది. దానిలో నాల్గే ముక్కలు! ... 'నాకు ఒంట్లో బాగులేదు... వెంటనే వస్తున్నాను. బయల్దేరే ముందు .... టెలిగ్రామ్ ఇస్తాను....స్టేషన్‌కి రండి'.... ఇదీ ఆ వుత్తరం. మేమంతా హడిలిపోయాం! ఏ ఉపద్రవమో అని. అమ్మకైతే అసలు అన్నం నీళ్ళు ఎక్కక - నిద్రపోక .... దిగాలుపడి కూర్చుంది. నాన్నగారు కోప్పడేవారు గానీ ఆయన దృష్టంతా వీధివైపే! ఏ వేళప్పుడు టెలిగ్రామ్ వస్తుందో?- అని. అయినా....స్టేషన్‌కి వెళ్ళి తీసుకుని వచ్చే అవకాశం ఎప్పుడూ ఇవ్వని చిన్నక్క--స్టేషన్‌కి రమ్మందంటే .... ఎంత జబ్బో? అని భయం వేయదూ ?- రెండు రోజులు గడిచే టప్పటికి రెండు యుగాలైనంత పనైంది. ఆఖరికి నాన్నగారు బయల్దేరి వెళదామనుకుంటూ వుండగా .... బావ రాసిన వుత్తరం అందింది. - 'అదేదో కోపంలో రాసిందనీ - మీరేమి కంగారు పడకండి. కులాసాగానే వుంది' - ఇది సారాంశం!-నాకెంత ఒళ్ళుమండి పోయిందో!-.

"మళ్ళీ పదిహేనురోజుల తర్వాత నాలుగు పేజీల వుత్తరం రాసింది. ఆ ఉత్తరానికీ మొదటి దానికీ ఏమి సంబంధమే లేదు! అదినాల్గు పంక్తులైతే - ఇది నాలుగు పేజీలు! - పేరు పేరునా అందరి క్షేమాలు అడుగుతూ .... తను కొన్న చీర రంగు....చూసిన సినిమాలు .... వాళ్ళచిన్నా

డబడుచు దుడుకుతనం....అత్తగారి అధికారం....మామగారి అమాయకత్వం....ఆ ఇంటి దుబారాఖర్చులు .... బావగారి మంచితనం....అన్నీ కలిపి ఓ చిన్నకథలా రాసింది!-అంతేకాని మొదటి వుత్తరం సంగతేలేదు....అదేదో సీరియల్ కథలో మధ్య పేజీలు పోయినట్టు....సినిమాలోరీలు తెగితే అతకకుండా చూపించినట్టు-వుంటాయి దాని వుత్తరాలు!!"-

మాలతి ముఖమంతా కోపం, చికాకు అలుముకుంది!-చిన్నచెల్లిలి కోపం చూసి భవాని నవ్వింది -

"మధ్యలో నీ కెందుకు కోపం? బావకి దాన్ని సముదాయించుకునే శక్తి వున్నప్పుడు మీారెందుకే బాధ పడటం?"-.

"సరేలే!-ఆయనగారు సముదాయించుకుంటే - మా కెందుకు కంగారు పుట్టించడం?-అదేం కాదులే....చిన్నక్క కసలు మొదటి నుంచీ పెంకితనమే!- దానికలా సాగుతోంది కాని...అందరూ అలా వుండగలరా?-పుట్టింటికి వచ్చినా.... స్థితిగతులర్థం చేసుకోకుండా .... ఒకటే రాద్ధాంతాలు! .... సిద్ధాంతాలు!- ఛ! అసలు మనసాంప్రదాయాలు చూస్తుంటే చిరాకేస్తోంది అక్కా!-జరిగిన వాటిని సాగించుకోవాలిగాని.... జరగని వాటిని....మొండిగ సాధిస్తానంటే-కోపం రాదూ?-ఛ! నాకైతే అసలు చదువుకుని ఉద్యోగంచేసి నాన్నకి సహాయం చేయాలని వుంది!"-

భవాని మాలతి ముఖంలోకి చూస్తూ-"మాలా! నువ్వింకా చిన్నదానివే-పరిస్థితులు తెలియవు. చిన్నక్కకి

ఏం వత్తిడిలు వున్నాయో వాళ్ళత్తారింట్లో. అందుకే అది అలా అడుగుతుందేమో ?- అనవసరంగ దానిమీద కోపం తెచ్చుకోకు .... చదువుకున్నంత మాత్రంలో ఆడపిల్ల .... ఆడపిల్ల కాకుండా పోతుందా ?-ఉద్యోగం చేసినా .... పెళ్ళి చేసుకోవాలికదా?-అప్పుడు ఎలాంటి పరిస్థితులు ఎదుర్కోవాల్సి వస్తుందో?-అయినా చిన్నక్కైనా.... నేనైనా....కన్న వారి దగ్గర కయ్యాలాడాలిగానీ .... అత్తగారింట్లో చేయలేం గదా?"—అంది.

"ఏం? ఎందుకు చేయకూడదూ?"-

భవాని చెల్లిల్ని చూసి నవ్వి-"ఏమో? మాకు చేత కాలేదు నువ్వు చేద్దుగాని" అంది.

"ఓ ! నాకాభయంలేదు! హక్కున్నచోట అడగటానికి భయం ఎందుకు?- ఏమైనా నేను మాత్రం చిన్నక్కలా పీడించను!"-

"మాలతీ ! చాల్లే-మాటి మాటికి అక్కని అలా అనకు ! నిజానికి దాన్నంటే నన్నూ అన్నట్టే కదా!"-కొంచెం గంభీరంగ అనే సరికి మాలతి కాస్త తగ్గి-

"నిన్నెందు కంటాను ? నీకు దానికి ఎంతో తేడా వుంది!"-

"ఏమిటబ్బా ఆ తేడా?"

"అన్ని పనులు నెత్తిమీద వేసుకుని తెగ చాకిరీలు చేస్తూ ... తీరుబడేనా లేకుండా .... ఆరోగ్యం పాడుచేసుకుంటున్నా....అత్తయ్య నిన్నెప్పుడైనా ఆదరంగ చూసిందా?.. అదే చిన్నక్కైతేనా...."

"నీ ముఖం చాల్లే! మహా గొప్పతేడా కనిపెట్టేసేవ్ గాని వూరుకో"-

ఇంతలో షికారు కెళ్ళివచ్చిన రామం .... ప్రకాశం బాబునెత్తుకొని వచ్చారు.

"ఏమిటక్కా? తేడా పాడా లంటున్నారు ఎవర్ని గురించి?"-

"ఆ ఏం లేదుగాని బాబు బాగా ఏడిపించేడా? కొత్త ఎక్కువ వాడికి!"-భవాని లేచి ప్రకాశం భుజం మీద నిద్రపోతున్న బాబుని అందుకుని....మంచంమీద పడుకో బెట్టి జోకొట్టూవుంటే-" ఆహా! మీ అబ్బాయి మా తిక్క అణిచేడు. మేనల్లుడు కదాఅని ముచ్చటపడి షికారు తీసుకెళితే దారిపొడుగునా ఒకటే ఏడుపు!-ఈ ప్రకాశం ఎత్తుకోబట్టి సరిపోయింది గాని .... లేకపోతే నావల్ల అయ్యేదికాదు!-" మరొక మంచం మీద, నడిచివచ్చిన అలుపు తీర్చుకుంటూ-కూర్చున్నాడు రామం.

మాలతి లేచి ఒళ్ళోపడిన తొడిమలు కొమ్మలు దులుపుకుని-వెండిపళ్ళెం తీసుకుని లోపలికి వెళ్ళింది. ప్రకాశం కూడా నూతి గట్టుమీద కాళ్లు చేతులు కడుక్కుని ఇంట్లో కెళ్ళేడు.

వంటింట్లో లైటువేసి....బొట్టుపెట్టి వెళ్ళింది జానకమ్మ.

రామం....భవానీ కబుర్లో పడ్డారు.

ఎన్నో విషయాలు దొర్లి పోయాక...

"అయితే....అక్కయ్యా! బావ...." అని సంశయంగ ఆగిపోయేడు రామం.

"ఊఁ—బావ?"....చెప్పరా?...." అని నవ్వింది.

"అహఁ ఏం లేదు - అప్పటికి ఇప్పటికి ఒకలాగే వున్నాడా?-

"అంటే? ఓ ఆదా? ఆఁ! ఆఁ! అదే ఒడ్డు... పొడుగు....రంగు....రూపు....అంతా అలాగే వున్నారు. పంచ కట్టు.. లాల్చీ .... పైమీద కండువా., ఉదయం పొలం పనులు....సాయంత్రం లైబ్రరీ పుస్తకాలు........"

"అబ్బబ్బ! నీకంతా హాస్యం!"

"అదేమిట్రా? ఇప్పుడు నే చెప్పిన విషయాల్లో హాస్యం ఎక్కడుంది? అవన్నీ నిజమేగా?"-

"చాల్లే! నేనడిగింది ఆ వివరాలా? నీకు తెలియక నే అడుగుతున్నావా?-అన్ని బాధలు మనసులో అదిమిపెట్టు కుని....నవ్వేస్తూ....మాట్లాడం....ఎలా అలవాటు చేసుకున్నా వక్కయ్యా?!"-రామం అడిగిన తీరులో జాలి....గమనించినా భవాని-చిన్నగ నవ్వేసింది.

"ఒరే రామం! నీకు అక్కంటే చాల ప్రేమవుండొ చ్చును. మంచిదే-కానీ-మీ బావకి కూడా వాళ్ళ అమ్మా.... నాన్నా....వాళ్ళమీద ప్రేమ వుండదా?-వాళ్ళని సుఖపెట్టా లనీ .... తాను కష్టపడినా ఫర్వాలేదనీ .... అనుకోటంలో తప్పేమిటిరా?"-

"నిజమే .... కానీ కష్టానికైనా ఒక హద్దుండాలి గదా?-"

"అది మన నిర్ణయంలో వుంటుంది!"-

"వూరుకో అక్కా!-ఏమిటి నిర్ణయం? తను, తన సుఖం....తనని నమ్ముకున్న భార్యా బిడ్డల సుఖం చూడక్కర్లేదా?- ఎంతకాలం అలా గొడ్లలా చాకిరీలు చేస్తూ-వాళ్ళ మెప్పు ఎప్పటికైనా పొందక పోతామా....అని ఆశ పడుతు .... జీవితాంతం ఇలా బండల్లా బ్రతకటమేనా నిర్ణయం?"-ఆవేశంగా మాట్లాడుతున్నా రామాన్ని కొన్ని నిముషాలు మౌనంగ చూసి- "రామం!"-అని మెల్లగ పిల్చింది:

"సుఖంఅంటే కొలమానం ఏమిట్రా?-బండల్లా... గొడ్లలా .... అనుకోకుండా, తృప్తిగ హాయిగ వున్నామని ఎందుకనుకోగూడదు ?- చూడు చిన్నక్కని మీరు ఎలా అనుకుంటున్నారో .... దానికింకా పెంకితనం పోలేదని దాని గొడవ దాందే కాని ఇంకోళ్ళని గమనించదనీ-ఇందాక మాలతి విసుక్కుంది! ఒకవేళ నేనూ అలాగే వుంటే మీరుననూ్నా అలాగే విమర్శించే వారేమో....ఆహాఁ ఆగాగు .... నన్ను చెప్పనీయ్ .... ఉంటే సహించలేరు .... లేకపోతే సానుభూతి చూపించటం .... ఇదిలోకం పోకడ!- అందుకని-విమర్శలకి గురిఅవ్వడం కంటే-పోనీ పాపం అనే జాలే నయం!-అలా చూస్తావేం నేనేం చిత్రంగ మాట్లాడుతున్నానా?- లేదే?!-నువ్వు ఇంకా చిన్నవాడివి కనుక అర్థం చేసుకోలేక పోతున్నావు!-జీవితాలు ఇష్టం వచ్చినట్టు మారిపోవురా! ఎంతటి వాళ్ళైనా సమయం వచ్చేదాకా ఆగవలసిందే!-ఎదురీదే ధైర్యం....తెగింపునాకు లేవు!- అందుచేత

ఇంక ఆ విషయాలు వదిలేయ్!-ఇంక నీ చదువుసంగతి చెప్పు ఎలా చదువుతున్నావో...."భవాని ఆవిధంగ మాట మార్చ డంతో-రామం నిస్సహాయంగ నిట్టూర్చి .... మామూలు గొడవల్లో పడ్డాడు!-

తల్లి భోజనాలకి పిల్చేవరకు - వాళ్ళ సంభాషణ సాగుతూనే వుంది।

# 2

## అందమైన చిన్న డాబా ఇల్లు

చుట్టూ గజంఎత్తు కాంపౌండుగోడ. లోపల రక రకాల పూలమొక్కలు మెట్లతో ప్రారంభమైన వరండాలో పెద్ద'ఆరామ్' కుర్చీలో... వెనక్కి-జార్లబడి కూర్చుని-ఎంత అంటించినా అంటుకోనిచుట్టతో విసుగొచ్చి కళ్ళుమూసుకుని ఆలోచనానిమగ్నులైన'ఆజానుబాహులు'-నర్సింహంగారు.... ఇంట్లోనుంచికాఫీ వాసనఎప్పుడు తగులుతుందా? అని నాసికా రంధ్రాలు పెద్దవిచేసి 'వాచ్' చేస్తున్నారు. మధ్య మధ్య బొద్దుగ పెరిగిన మీసాలును ఒకచేత్తో సవరించుకుంటు ... తను రిటైరైనా.... గతంలో తాహసిల్దార్ నన్నసంగతి గుర్తు తెచ్చుకుంటున్నారు!- పదినిముషాలు అలా యోగ సమా ధిలోవున్నాక- "కాఫీ తీసుకోండి" అని వినిపించటం జరిగింది.

"అక్కడ పెట్టమ్మా"- అన్నారు కోడల్ని -

"శ్రీదేవి" - కాఫీగ్లాసు అక్కడపెట్టి లోపలికి వెళ్ళి పోయింది. నర్సింహంగారు ... పొగలు కక్కుతున్న ఫిల్టర్

కాఫీగ్లాసు చేతిలోకి తీసుకుని - మెల్లగ 'సిప్' చేస్తూ ... కోడల్ని గురించి ఆలోచించటం మొదలెట్టేరు—

"అమ్మాయికి - పొదుపు ఎక్కువ!- పుట్టింట్లో ... ఒబ్బిడిగ, పొందికగ వుంటారంతా!- అందుకే అమ్మాయి దగ్గర జాగ్రత్తవుంది! - తాహసిల్దార్ గా వుండి - అన్ని దర్జాలు, దుబారాలు నేర్చుకున్నాం తప్ప ... రిటైరయ్యే నాటికి కాస్త వెనక వేయాలనే దృష్టిలేకపోయింది...అయినా 'రత్నం'-ఒప్పుకునేదికాదు. భార్యగ తనునల్గురిలో హోదాగా బ్రతకాలని తెగ తాపత్రయపడేది. ఎన్నెన్ని ఆర్భాటాలు చేసేదో ?- ఇంటి ఇల్లాలు - ముందుచూపులేని ఆర్భాటం మనిషి అయితే సంసారాలు ఇలాగేవుంటాయి!- అదేకనుక కోడల్లాగ జాగ్రత్తగల మనిషైతే - ఈరోజున ఎంతవెనకేసి వుండేవాళ్ళమో? పెద్దమ్మాయి పెళ్ళి ... జమీందారీ పెళ్ళిలా చేయించింది రత్నం - ఏమనడానికైనా - నామాట చెల్లనిస్తుందా?- బయట అందరికీ 'నర్సింహం' - అయితే ఇంట్లో 'రత్నం' దగ్గర వట్టి - నరుడే!- అలాసాగింది ! ఇక ఇప్పుడేం మిగిలింది ?- ఇద్దరాడపిల్లల పెళ్ళిళ్ళుచేసి - పెద్ద బ్బాయిని బి. ఏ. చదివించేసరికి రిటైర్ మెంటు వచ్చింది. ఇంకా చిన్నమ్మాయి పెళ్ళి...చిన్నబ్బాయి చదువు మిగిలే వున్నాయి! ఈ ఇల్లుతప్ప - వెనక ఆస్థివమీ లేదు !- అయినా రత్నానికి ఇంకా పాతవాసనలు పోవడం లేదు!- కానీ శ్రీదేవి అలాకాదు. అన్నీ తూచినట్లు ... అవసరం వున్నంత వరకే చేయాలనే తత్వం? అత్తగారు విన్నావినక పోయినా - తను చెప్పదలుచుకున్నది చెప్పేస్తుంది!- కానీ

రత్నం వింటేగా ?.... అందరూ తనమాట వినాలనీ .... తను రిటైర్డ్ తాసిల్దార్ గారి భార్యననీ. రోజుకోసారైనా చెప్పకుండావుండదు. పిచ్చిగానీ సర్వీసునుంచి విరమించేక ఇంకా ఏంగొప్ప?- శ్రీదేవి చదువుకున్న పిల్లగనుక-ఈ పద్ధతులకీ- ఆడంబరాలకీ విసుక్కుని - తనపని తను చేసుకుపోతూనే వుంటుంది!- కాకపోతే - కాస్త .... 'కోపం పాలు'...అదే పోనీ 'తొందరుపాటు ఎక్కువ'!-

కాఫీ తాగటం పూర్తిచేసి గ్లాసు కిందపెట్టేసి .... ఆరిపోయిన చుట్టని - తిరిగి అంటించుకుని - చేతికర్ర తీసుకుని కుర్చీలోనుంచి లేచేసరికి - శ్రీదేవివచ్చి గ్లాసుతీసుకుని లోపలికి వెళ్ళింది!

వెడుతున్న కోడలుపిల్ల 'జాగ్రత్త'ని మరోకమారు మనసులోనే మెచ్చుకుని చెప్పులేసుకుని - షికారుకి బయల్దేరేరు.

o o o

సాయంకాలం ఆఫీసునుంచి ఇంటికివచ్చి - కర్టెన్ పక్కకితీసుకుని గదిలోకెళ్ళిన కృష్ణమూర్తి .... "మీనాన్నగారి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది" అన్నాడు, భార్యతో -

"ఏమని"?- వెనక్కి తిరిగి చూడకుండానే, జడఅల్లుకుంటు తనఎదురుగావున్న అద్దంలో కనిపిస్తున్న ముఖాన్ని ప్రశ్నించింది, శ్రీదేవి.

"అదేమో?- నాకెలా తెలుస్తుంది? చింపిచదివితే దేవి ఆగ్రహానికి గురికావల్సి వస్తుందని ....భయం!"- నవ్వుతూ

అక్కడున్న స్టూల్ మీద కూర్చున్నాడు "ఆ మాత్రం భయం వుండవలసిందే!" చివరిదాకా అల్లినజడ తిరిగివిప్పి ఓబెత్తేడు జుట్టును... దువ్వెనతో నున్నగ దువ్వి చేత్తో వుంగరాలు తిప్పుకుటు ముసిముసిగ నవ్వింది.

"నిజమే భార్యాదాసుడైనవాడూ, భయభక్తులున్నవాడూ, ఐమీన్ భార్యఅంటే భయం వున్నవాడూ .... ఆఫీసర్ అవుతాట్ట ! పోనీ నేనూ ఆఫీసర్ని అవుతానేమో"?–

చివాల్న వెనక్కితిరిగి విసురుగ జడ వీపు మీదకి పడేసుకుంది "అలాంటి ఆశలేమీ పెట్టుకోకండి .... కాని వాటికోసం కలలుకనడం అంత ఆరోగ్యంకాదు!– అలాంటి వాటికి మీ అమ్మగారు, అక్కచెల్లెళ్ళు అలవాటు పడ్డారేమోకానీ – నాకులేదు. మీరు సంపాదిస్తున్న జీతంమీద నాకు తృప్తివుంది: ఇలా జీవితం సాఫీగసాగిపోవాలనే నా ఆశ!– ఆ ఉత్తరం ఇలాఇవ్వండి."

శ్రీదేవి కోపంచూస్తే .... కృష్ణకి సరదా ! ఆమెని ఉడికించి...ఉక్రోషం తెప్పించి ఆమె కోపగించుకుంటే చూసి ముచ్చటపడి .... ఆతర్వాత సముదాయించాలని కోరిక!

జేబులోనుంచి ఉత్తరంతీసి ఇచ్చేడు.

"ఇదే నేమిటీ చింపి చదవడానికి భయపడేలక్షణం?"– అప్పటికే చింపివున్న కవరు చూసి చిరుకోపంతో అడిగింది–

"భయపడవద్దన్నావుగా?"

"ఆమాట అనలేదే?– ఆఫీసర్ కానక్కర్లేదన్నాను?"

"ఓహో!- అయినా నేను నా పేరవుందిగదా అని చింపేను. తీరాచింపేక మరి నాకూ ఓ కాయితంవుంది! అది మాత్రం చదివేసి .. నీ ఉత్తరం కళ్ళుమూసుకుని అందులో పెట్టేసాను. చూసుకో మడతపెట్టి వుందా లేదా?" చిన్నగా నవ్వుతూవంగి బూటు లేసులు విప్పుకుంటున్న భర్తని కోపంగాచూసి - "నిజమే! కవరులో ఉత్తరం మడిచే వుంది సుమా!"- అన్నది.

"చూసేవా మరి నువ్వంటే ఎంతభయమో?"-

"ఆహాఁ నేనంటేనే కాదు. మీ అమ్మనాన్నా మీకు భయమే!"- అని వెక్కిరించింది. అందులోని వ్యంగ్యం కృష్ణకి తెలుసు! - తను తల్లికి ఎదురుచెప్పడని - శ్రీదేవికి కోపం !

"సరేలే ! మీ నాన్నగారు ఏంరాసేరో చదువుకో.... ఏముంటుందిలే-నిన్ను రమ్మని రాసుంటారు. బహుశా మీ అక్కయ్య పిల్లలు వచ్చివుంటారు. అందరు ఒకసారి ఇంట్లో ఉంటే...."

"అబ్బబ్బ! ఆపండి బాబూ! మీరు చదివేరని నాకు తెల్సుగాని....నన్ను స్వయంగా చదువుకోనీయండి!-

కృష్ణ మాట్లాడకుండా బూట్లు విప్పుకుని రెండూ కలిపి పట్టుకుని బయటికి వెళ్ళిపోయేడు-కొంచెం సేపయాక చిన్న ఆడబడుచు గిరిజ హడావిడిగ గదిలోకొచ్చి-"వదినా నా తెల్లగులాబి పూలదండ ఎక్కడ పెట్టావ్?"-అంది.

ఉత్తరం మళ్ళీ మళ్ళీ చదువుకుంటున్న శ్రీదేవి .... ఒకసారి తలతిప్పిచూసి మళ్ళీ చదవడంలో మునిగి పోయింది!- ఆనిర్లక్ష్యానికి ఒళ్ళు మండింది గిరిజకి. "ఏమిటా పొగరు? ఆ మొండితనం?-పూలదండ ఎక్కడ పెట్టావంటే చెప్పవేం? ఆ ఉత్తరం తర్వాత చదువుకోవచ్చును. ఎక్కడికీ పోదు గానీ-నాకు అవతల సినిమా టైమైంది. టికెట్లు దొరకదు! త్వరగా చెప్పు!"- విసురుగా అంది.

"ఉహూ! సినిమాకేం తొందర్లేదుకానీ .... ఉండు నన్ను ఉత్తరం చదువుకోనీయ్!" అంతకంటె విసురుగా చెప్పింది.

"ఏమిటీ? సినిమాకి తొందరలేదా? ఎప్పుడూ వచ్చే ఆ వెధవ వుత్తరానికేనా తొందర?"-

"గిరిజా ?! - నోటికి వచ్చినట్టు అనేయకు .... నాకు వచ్చింది వెధవవుత్తరం అనుకుంటే....నువ్వు చూసేది వెధవ సినిమా అవదూ?"-

"మరి ఏం? నా పూలదండ ఎక్కడ పెట్టావో చెప్ప మంటే....వినిపించుకోవేం?...." ఇంతలోనే, టేబుల్ మీద గాజు గ్లాసులో పూలదండ కనిపించేసరికి-"పోనీలే నువ్వేం చెప్పక్కర్లేదు అంటు"-గ్లాసులో దండతీసి-దానికున్న నీళ్ళు విసురుగ విదిల్చి తల్లోపెట్టుకుంటు బయటికి వెళ్ళిపోయింది.

నీళ్ళచుక్కలు మీదపడేసరికి-శ్రీదేవికి నిలువెల్లా.... కోపం పొంగిపోయింది! అత్తగార్ని....ఆడబడుచుల్ని....మామ గార్ని-అందర్ని మనస్సులో ఒక్కపూవున తిట్టుకుంది-

సరిగ్గా ఆసమయంలో .... కృష్ణ - లుంగీకోసం గదిలోకి వచ్చాడు...."ఏ దేనికీ అలా వున్నావ్?"-అని దగ్గర కొచ్చే సరికి-"ఏం లేదు - నేను రేపు మా ఫ్రెండింటికి వెళతాను .... టికెట్టు సంగతి చూడండి"-అంటూనే భర్త మాట వినిపించు కోకుండా-బయటికి వెళ్ళిపోయింది....

చిన్నగ నిట్టూర్చి .... కుర్చీలో కూర్చుండిపోయాడు కృష్ణ.

'పెద్దమ్మాయి పిల్లలు వచ్చారు గనుక .... శ్రీదేవిని కూడా పంపవలసిందని-అందరు కలిసి కొన్నాళ్ళు సరదాగా వుంటారని...మామగారు .... తనకి .... భార్యకి రాసేరు .... అయినా .... 'దేవీ నువ్వెళ్ళకు నేనుండలేనని చెప్పాలను కున్నాడు. ఈ సత్యభామకి ఇప్పుడే అలక వచ్చింది .... ఇంక ఏం చెప్పినా...వినదు. సామరస్యంగ వున్నప్పుడు....కొంతలో కొంతైనా వింటుంది...ఏదైనా తేడా వచ్చిందా? ఇక అంతే!- ఎలా ఈమెతో జీవితం సాగించడం ?-

'కాని శ్రీదేవి అభిప్రాయాలు....ఆదర్శాలు మంచివే! డబ్బంటే జాగ్రత్త వుంది! ఉన్న దానిలోనే .... గుట్టుగ .... హాయిగ సంసారాలు చెయ్యాలని ఓ గట్టి దృక్పథం వుంది!- ఎంత మెచ్చుకోదగ్గ గుణం!?-అయితే .... పుట్టింటి నుంచీ దర్జాలకి హంగులకి అలవాటుపడిన అమ్మ....ఈ పద్ధతులకి పూర్తిగ ఒప్పుకోదు అక్కయ్యలూ అంతే!- అందుకని ఏదో గొడవ వస్తూనే వుంటుంది!- తనేదైనా సర్ది చెప్పబోయినా.... మీరెప్పుడూ ఒకటే! మీ అందరి గుణాలు అంతే!- అని చిందులు తొక్కుతుందే గాని - అర్థం చేసుకోదు !-

కాఫీపట్టుకొచ్చి.. "చూడండి మీ చెల్లెమ్మ మాటలు! సినిమా ముఖ్యంట! నా ఉత్తరం తొందర లేదుట....రాత్రి చదువుకోవచ్చట!- ఈ నెలలో ఈ సినిమా ఎన్నోదో గుర్తుందా ?-ఆరోది! తెల్సిందా?" అంటూ ముఖం దగ్గరగా వచ్చి - గట్టిగ చెప్పింది -

"నిజంగానా ?"-అన్నాడు, నిజంగానే తెలియనట్లు- ఆశ్చర్యంగ ముఖంపెట్టి-

"అక్కడికి మీకు తెలియనట్టు"-కోపంగ చూసింది.

నవ్వి- "మరైతే - ఎందుకంత గట్టిగ చెప్తావ ?" - అన్నాడు గ్లాసు అందుకుంటు.

"తెలివి తక్కువ మొద్దుని గనుక !- మీ చెల్లిని మీరు ముద్దుగానే సమర్థిస్తారని తెలుసుకోలేక !"-

"చాల్లే! సంతోషించాం! నీకు ఇప్పుడు ఏం చెప్పినా వినవుగానీ....ఆ సంగతి వదిలేయ్ !- ఇంతకీ నువ్వు ఇప్పుడు మీ పుట్టింటికి వెళ్ళాలా ? ఎలా దేవీ?- నాకెలాగో వుంటుంది!- వెళ్ళకు - వీల్లేదని రాసేస్తాను .... సరేనా ?"- లాలనగ అడుగుతూంటే- శ్రీదేవికి-నవ్వువచ్చింది.-

ఇంతలో అత్తగారు ఎందుకో పిలవటంతో....బయటికి వెళ్ళింది!- కాఫీ తాగుతూ....'శ్రీదేవిని ఎలా మాన్పించాలా ప్రయాణం ? అని ఆలోచిస్తూ ... ఆమెపట్ల తనకున్న ప్రేమానురాగాలకి - కించెత్తు ఆశ్చర్యపోయేడు !- రాత్రి డాబామీద .... చాపవేసుకొని కొబ్బరి ఆకుల సందునుంచి కనిపిస్తున్న చంద్రుణ్ణి....చూస్తూ....ఎదురుచూస్తున్నాడుకృష్ణ.

శ్రీదేవి వక్కపొడి తీసుకుని వచ్చింది..

"కూర్చో దేవీ!- నీతో చాలా విషయాలు మాట్లాడాలి." అన్నాడు మార్దవం ధ్వనిస్తున్న గొంతుతో...

కూర్చుంది.... నెమ్మదిగ.... సౌమ్యంగ మొదలెట్టేడు.

"దేవీ నా జీవితం నీతో కలిసి సాగడం .... నిజంగ నా అదృష్టం!- పొగడుతున్నా ననుకోకు. యదార్థమే చెప్తున్నాను....ఎందుకంటే....సామాన్యంగ సంసార పక్షంగవుండి.... సుఖపడటం వేరు....లేని వాటికోసం ఆరాటపడుతు....ఉన్న దానికంటే-ఎక్కువ డాబులు చూపిస్తూ...సుఖపడుతున్నా మనుకునే భ్రమలో వుండటం వేరు!- ఈ రెండో రకం మనుష్యులు .... మావాళ్ళు అంటే అమ్మ, అక్కలు .... చెల్లాయి....తమ్ముడు!-నేనూ, నాన్న....వాళ్ళకి కొంచెం విరుద్ధంగ వుండటంవల్ల-ఎన్ని రకాలబాధలు పడుతున్నామో.... నీకు తెలియదు!- నీగురించి నాన్న నాతో చాలా సార్లు అన్నారు....'కోడలుపిల్ల గుణం మీ అమ్మకి వుంటే ఎంత బాగుండునురా అని'... ఆమాట అమ్మదగ్గర అనే ధైర్యం.... లేదనుకో ....'ఫలానా వారంటే-అబ్బో వాళ్ళకేంతక్కువ?'- అనుకోవాలని అమ్మ ఉద్దేశ్యం!- కానీ అనుకునే దానికంటే తక్కువ స్థితిలో వున్నామని తెలియదు! లేకపోతే .... బియస్సీలో క్లాసు తెచ్చుకుని కూడా.... ఎమ్. ఏ. చదువలేక పోయాను!- ఎందుకనుకుంటున్నావ్?- అప్పటి పరిస్థితుల్లో.... నేను ఉద్యోగంలో చేరితేగాని వీలులేకపోయింది!- నాన్నగారు రిటైరన్ అయ్యేరు. అక్కయ్యలిద్దరికీ .... ఇంజనీర్లనీ,

డాక్టర్లనీ - పెద్దపెద్ద కట్నాలిచ్చి పెళ్ళి చేసేరు. మిగిలిన డబ్బు .... ఇల్లు గడవటానికీ - తమ్ముడి చదువుకి .... చెల్లి పెళ్ళికి....సరిపోవాలా?....

'నాన్నగారు ఆఫీసర్ పదవిలో వున్నప్పటికీ - సంపాదించిన దానికంటే-ఖర్చులు ఎక్కువగ వుండేవట! పిల్లల్ని ముద్దుగ హోదాగా పెంచాలని....రకరకాల బట్టలు....నగలు.... అడుగడుక్కీ నౌకర్లు-విందులు వినోదాలు-వేడుకలు.... ప్రతి నిత్యం ఇంట్లో.. శుభకార్యం జరుగుతున్నంత హడావిడి - చేసేవారుట !- చిన్నప్పుడు రాజకుమారిడిలా పెంచి వాళ్ళ ముద్దు ముచ్చట్లు తీర్చుకున్నారు గానీ - నా కిప్పుడు దాని వల్ల ఏం లాభం? ఈ ప్రవేట్ కంపెనీలో ఉద్యోగం చేయాల్సి వచ్చింది. నాన్న తనప లుకుబడి వుపయోగించి నాకు మంచి ఉద్యోగం వేయించలేదని అమ్మకి కోపం!- కాని నాన్నగారు ఆ ఒక్క విషయంలో .... అమ్మమాట విన లేదు!-నాస్వయం శక్తిమీదే-నాజీవితం సాగాలని....నామీద కూడా, అమ్మ ప్రభావం పడకూడదని-ఈ ఉద్యోగంలోనే చేరమన్నారు!-అందుకే నాకు తృప్తిగావుంది! అంతేకాదు. నన్ను అర్థం చేసుకునే భార్య దొరికింది!-అంతకన్నా నాకేం కావాలి ?!

"ఇప్పుడు-అమ్మకి ఇంకా ఎంత ఆశవుందో తెలుసా? గిరిజని ఏ పెద్ద 'బిజినెస్ మాన్'కో ఇచ్చి చేయాలనీ ... అప్పుడు ఈ ఇల్లు...తన నగలు అమ్మేసైనా కట్నం ఇచ్చి గొప్పగ చేయాలనీ .... వుంది! చేయిస్తుంది కూడా! ఆ తర్వాత?.... ఇంక చేయాలన్నా ఏం మిగలదు! అప్పుడు

మనం చెప్పినట్లు వింటుంది!-నువ్వు లక్షణంగ అన్నీ సమకూర్చుకుని బాగుపడుతావ్! నేను నువ్వు....మన పుట్టబోయే పిల్లలు ....''-అని దగ్గరకి తీసుకోబోయేడు. శ్రీదేవి.... మృదువుగ వారించి-''అది సరే! ఇల్లు అమ్మనీయకుండా మీరు మీ నాన్నగారూ ఆపలేరూ? మన తాహతుకు తూగే సంబంధమే చూసి చేయకూడదూ?-'' అన్నది.

''పిచ్చీ! ఇల్లు అమ్మ పేరవుంది! ఆవిడనగలు ఆవిడిష్టం! ఇంక ఆపేదేముంది? పోనిద్దూ...నువ్వు అనవసరంగ కలగ చేసుకుంటే....నల్గురిలో నీ పేరు చెడుతుంది. ఆవిడ చేసేది చెయ్యక మానదు. మనం పట్టించుకోవద్దు. మనం మనసంసారంలో జాగ్రత్త చేసుకుందాం!- నేను నీకు ఏ విషయంలోనూ లోటు రాకుండా చూసుకుంటాను. నీకు ఏం కావాలన్నా నేనున్నానుగా దేవీ!''- ఆప్యాయంగ ముంగురులు సర్ది....లాలించేసరికి....శ్రీదేవి పులకించి పోయింది!- 'అవును! తనకెంత కంటే ఏం కావాలి గనుక?- ఇలాంటి- ప్రేమమూర్తులైన వాళ్లు ఎంతమంది వుంటారూ? తనెంత అదృష్టవంతురాలూ?- డబ్బు లేకపోయినా ఫర్వాలేదు గానీ .... ఈ ప్రేమ లేకపోతే .... బ్రతకటం కష్టం!- పాపం అక్కయ్య....ఎంత ఆస్థి వుంటేనేం? బావ ప్రేమకి నోచుకోలేక....ఎంత మూగవేదన పడుతోందో?- అనుకుంటు కౌగిల్లో ఒదిగిపోయింది!-

అదీ, ఎంతసేపూ?- ఒక రెండు నిముషాలయేసరికి.... క్రింద వీధితలుపు 'టకటక' చప్పుడు వినిపించింది!-

"ఎవరో వచ్చినట్టున్నారు -" అన్న కృష్ణ మాటలు వింటూ నే-చటుక్కున అతని నుంచి విడిపించుకుని".... ఆ ఇంకెవరూ ? చిన్న రాణీగారు, సినీమానుంచి వేంచేసినట్టు న్నారు!-అర్థరాత్రి వరకు ఆడపిల్ల అలా సినీమాలకి షికార్లకి-తిరుగుతూ వుంటే .... మీ నాన్నగారు ఊరుకుంటాగే మండీ?! అంతెంతడబ్బు-ఎందుకు తగలేయడం?- మీరన్నా చెప్పరేం ?- మీ అమ్మగారు మరీ పిల్లనంత గారాబం చేయడం ఏభాగుంది!-ఏమైనా సరే ఇలాంటి స్వతంత్రాలు అంత మంచివికావు....రేపు మీ అమ్మగారితో చెప్పేస్తా...."

"దేవీ!-ఆగు కూచో వెళ్ళకు.... చూస్తూ ఇంతవరకు నేను చెప్పినదంతా అప్పుడే మర్చిపోయేనా ?"- చేయిపట్టుకుని ఆపేడు.

"ఆ! అవును ఎంతైనా వాళ్ళు మీవాళ్ళుకదా ? ఏమీ అననీయరు" నిష్ఠూరంగా అనేసరికి- "అదిగో మళ్ళీ మొదటికే వస్తున్నావా!" అన్నాడు కాస్తబాధగ- దేవి అతనివైపు ఓక్షణం చూసి... "అయితే ఓపనిచేయండి! ఈగొడవల్నించి దూరంగవుండాలంటే ... కొన్నాళ్ళపాటు మాపుట్టింటికి వెళ్ళివస్తాను ఎటూ మానాన్నగారు ....రమ్మని రాసేరుగనుక పంపించండి! ఏం?-" అని రెట్టించేసరికి- "హా! హాతవిధి?"- అని. దేనికోసం ఇంతసేపు ఓపికగ చెప్పాడో.... అదంతా గాల్లోకలసి పోయిందనిపించింది!- కోపంవచ్చింది!

కానీ - కుట్టుడుపూల తెల్లచీర .... జరీచుక్కలున్న నల్లజాకెట్టు - తల్లోమల్లెలు — ఎర్రని కుంకుమబొట్టుక్రింద

మరొక చిన్నిచుక్క - కాటుక దిద్దినకళ్ళు .... కొంచంసహనం పాలు తక్కువైనా .... ఆ చంద్రుడంత అందమైన శ్రీదేవిని చూస్తుంటే .... ఈమె నాభార్యగదా అనే గర్వంతో - పోనీలేపాపం పుట్టింటికి పంపిద్దామనే జాలికూడా కల్గి - "సరేదేవీ"- అనేసేడు అప్రయత్నంగ !

# 3

పుట్టిన మూడేళ్ళకి తల్లిని పోగొట్టుకుని ... పినతండ్రులు .... పినతల్లుల పెంపకంలో- పడింది - విశాల .... తల్లిలేనిపిల్ల ఎంతతేలికో .... విశాలవిషయంలో అక్షరాలా తేటతెల్లమైంది!- బామ్మా ... తాతయ్యావున్నా .... వండివార్చి సంరక్షించేది పిన్నమ్మలే కనుక .... విశాలకి తల్లిలేనిలోటు కొట్టవచ్చినట్టు కనిపించేది. బాగా చిన్నతనంలో .... తెలియని వయస్సులో .... పిన్నమ్మలమీద ... చాడీలుచెప్పేది బామ్మతో .... దాంతో మునలావిడకి, కోడళ్ళకి మాటా మాటా పెరగడం .... విశాలతండ్రికి చికాకనిపించి .... తన పిల్లవల్ల వాళ్ళు కొట్లాడుకోడం నచ్చక .... తనపిల్లనే నాల్గు బాదుకోటం జరిగేది!

కాస్త వయసుపెరిగి ఊహ తెలిసేసరికి .... పరిస్థితులని అర్థంచేసుకుని .... తలవంచుకుని బ్రతకటం నేర్చుకుంది. అప్పుడు విశాలకి పదేళ్ళు నిండాయేమో?- ఈ పదేళ్ళనుంచి విశాలతండ్రి మళ్ళీపెళ్ళైనా చేసుకోకుండా.... వేదాంతిధోరణిలో వుండిపోయేడు! తనకంటు ఇంకా ఒక్క-బాధ్యత

వుందనిపించి - ఆపదేళ్ళ పసివయసులోనే....విశాలకి సంబంధం చూసి .... పెళ్ళి చేసేననిపించేడు!- అప్పుడు బామ్మా, పిన తల్లులు .... చాలాసంతోషించారు. తాత అప్పటికే గతించి పోయేడు.

అమ్మాయి పెళ్ళిచేసేక .... అతను పూర్తిగ సన్యాసి లాగ తయారై .... ఇకపిల్ల అత్తవారింటికి వెళ్తే .... తను కాశీ వెళ్లిపోవాలను కుంటువుండగా .... ఆ అల్లుడు ఘరుగు మిట్టి .... పోయాడన్నవార్త .... అందేసరికి - సచ్చివాడే అయిపోయాడు!- అదృష్టం అందర్ని వరించదు!- అలా విడిచిపెట్టిన కొందర్ని దురదృష్టం ఓదారుస్తుంది!!

విశాలని .... ఓదారుస్తున్న దురదృష్టం ... చిన్న ప్పుడే ఆ పిల్లని ఒళ్ళోకితీసుకుంది!- ఓ అయ్యచేతిలో పెట్టినా ఆ అయ్యచేయి విడిపించి .... మళ్ళీతనే స్వాధీనం చేసుకుంది!-

విశాలతండ్రి చాలారోజులవరకు మనుష్యుల్లో పడ.... లేకపోయేడు. ఆతర్వాత - కూతుర్ని ముసలితల్లికి వప్ప చెప్పి .... ఎందరుచెప్పినా వినకుండా ... సన్యాసుల్లో కలిసి పోయాడు!-

విశాలని బామ్మ సంరక్షించాలో ... బామ్మనివిశాల చూడాలో ... తెలియలేదు కొన్నాళ్ళవరకు!- వృద్ధురా లైన ఆమె బెంగలతో దిగజారిపోయి మంచంఎక్కింది!- పసి తనంలోనే అన్నిరకాల బాధలు అనుభవిస్తున్న విశాల ... భవిష్యత్తేమిటో తెలియక .... తల్లడిల్లిపోయింది! - ఆసమ యంలో .... విశాలకి చిన్నమమ్మ కోడలు ... అంటే చచ్చి

పోయినతల్లికి పిన్నమ్మకోడలైన జానకమ్మ-కొండంత అండగ నిల్చి ... ధైర్యంచెప్పి ... బెంగలు మర్చిపోయేటట్టు ఎన్నో కబుర్లుచెప్పి ... బామ్మని కాస్త కనిపెట్టిచూడు ... పెద్దదైంది, .... అని ఆపిల్లకి ఓబాధ్యత .... ఓ వ్యాపకం చూపెట్టింది!-

ఆనాడు జానకమ్మ ... ధైర్యవచనాలే .... విశాలకి జీవితంలో నిలదొక్కుకునేటట్టు చేసేయి!-పదిహేనేళ్ళ, విశాల బొట్టు, గాజులు... లేకోకుండా .... మాసిపోయినవి - వెలసిపోయిన - చీరలు కట్టుకుంటువుంటే - మంచంలో బామ్మ దీనంగా కళ్ళనీళ్ళు కారుస్తువుండేది - జానకమ్మకి వెర్రిబాధగ ఆవేదనగ వుండి....అంతకన్న వేరుగవుంచేటట్టు చేయలేక... సంఘానికి వెరిచి...మౌనంగా రోదించేది!-

భవాని, రెండేళ్ళు పెద్దది ... అప్పటికే -, మేనరికం చెయ్యడంచేత, అత్తయ్యకి-మామగార్కి సేవలు చేయడానికి అత్తారింటికి వెళ్ళింది!- శ్రీదేవి - సరిగ్గా విశాలవయస్సుదే!- స్కూల్లో చదువుకుంటు వుండేది.- అంతకన్నా చిన్నవాళ్ళయిన రామం మాలతి-ప్రకాశం .... అక్కతో బడికెళ్ళి వస్తూండేవాళ్ళు!-

"అక్కా!- విశాలవదినబొట్టుగాజులు పెట్టుకోదేం?"- అని మాలతిగాని రామంగాని అడిగితే- "దానిమొగుడు లేడుగ?"- అనేది శ్రీదేవి- "అయితే పెట్టుకోకూడదా?"- అనిరామం కళ్ళింతంత చేసుకుని అడిగితే- "ఆసింగినాదం? వాడుచస్తే దీనికేం?- వెదవపెద్దాళ్ళ బుద్ధిలేక .... వెధవ

రూల్స్‌న్ని పెట్టేరు"-అని శ్రీదేవి-తిట్టేది...."పోనీ అక్కా-మనకి మళ్లీ చదువుకో కూడదా?-"అని మళ్ళీ అడిగే వారు- చదువు కుంటే-వాళ్ళింట్లో చాకిరీలు ఎవరు చేస్తారూ?- అయినా దానికి లేనిబాధ మనకెందుకు?- నోరు లేకపోతే వాళ్ళబతుకంతే.-" అనేసి గబగబా నడిచేది.- రామం....మాలతి.... ప్రకాశం .... అక్కతోపాటు పరుగులుపెట్టి - స్కూలు కెళ్ళేవారు-.

ఎన్నోవిషయాల్లో....విశాలని తమతో పోల్చుకుని.... మనలాగ ఇవ్వన్ని చేయకుండా....'ఆ మొగుడు వెధవ ఎందుకు చావాలి?' అని వాదుచస్తే మటుకు ఈ పెద్దాళ్ళంతా ఎందుకు దాన్ని బాగపెట్టాలీ?- అనీ- 'అయినా వాడెవడో ఎక్కడో ఏదో అవుతే-దీనికెందుకు ఈ కట్టడీలన్నీ?-' ఇలా, అనేక ప్రశ్నలు వాళ్ళకి జవాబులు దొరక్క బుర్రలు బద్దలుకొట్టేవి!-

అవన్నీ విశాలకీ తెలుసు'- అయితే ఏంచేయలేక- ఏంచేయాలో తోచక - బామ్మకి....పిన్నమ్మలకీ చాకిరీలు చేస్తూ....కాలంగడిపేది!- బాబాయిలు-పిన్నమ్మలు .... సరసాలాడుకుంటుంటే-పక్కకి జరిగి పెరట్లోకెళ్ళిపోయేది. పువ్వులు మాలకట్టి-పిన్నమ్మలకి-అందించి - వాళ్ళు పెట్టుకుంటే చూసి ఆనందించేది. వాళ్ళు పేరంటాలకీ- శుభకార్యాలకీ వెళితే.... వాళ్ళువచ్చేసరికి వండి వార్చి ...వడ్డించేది - బామ్మకి కావల్సినవన్నీ అందించేది!- ఓ రకమైన యాంత్రిక జీవితానికి అలవాటు పడింది - 'పిచ్చిమొద్దూ!- ఖర్మ కట్టారాసిపెట్టి వుందే? లేకపోతే నిక్షేపంలా-కాపురం చేసుకుంటూ వుండే

దానివి. పిల్లతల్లివై-పురుటి గదుల్లో వుండాల్సినదానివి!'-అంటూ జావగిన్ని పట్టుకొచ్చిన విశాలని -చూసి కళ్ళనీళ్ళు పెట్టుకునేది, ముసలమ్మ.

"ఎందుకుబామ్మా బాధపడతావ్? ఇప్పుడుమాత్రం పురుటిగదుల్లో వుండటంలేదూ? ఏడాదికి రెండుసార్లు-చిన్న పిన్ని, పెద్దపిన్ని పురుళ్ళప్పుడు-నేను ఆగదుల్లోనే వుండటం లేదూ? ఎవరికో వండిపెట్టేకంటే - అయినవాళ్ళకి పెడుతున్నానుగదా? - నేను ఇక్కడ లేకపోతే నిన్ను ఎవరు చూస్తారూ?"- అని నవ్వేది.

"వెఱ్రిముఖమా?- అలాఅనక ఇంకెలా అంటావులే!- ఈడులో వున్నపిల్ల - ఈ దుస్థితిలోవుంటే - ఏటా ఆవరుసన పిల్లల్ని కంటు....పెళ్ళాలతో - కులుకుతూన్న నీ చిన్నాన్నలకి బుద్ధిలేదు. మీ నాన్న ఓ వెఱ్రినాగన్న - ఆస్థి నీపేరరాసి - ఏ లాయర్నో నిర్ణయించిపోక -'అంతావాళ్ళిష్టం'- అని చక్కాపోయేడు. ముసలితల్లిని .... విధవకూతుర్ని - అనాదలుగ వదిలేసి - ముక్కు మూసుకుంటే - ముక్తివస్తుందా? స్వార్థం అనిపించుకుంటుందిగాని - మోక్షంరాదు!- బాధ్యత విస్మరిస్తే, ఏమనిషైనా సుఖపడవచ్చే!- వీళ్ళంతా చేస్తున్నదదే!- నువ్వూ, నీ ప్రాణానికి నేనూ...ఇలా ఏడుస్తున్నాం!"-కళ్ళువత్తుకునేది....

"పోనీలే బామ్మా!- ఇప్పుడు అవన్నీ ఎందుకు?- మళ్ళీజన్మలో మనిద్దరం .... భార్యాభర్తలమై ... హాయిగా పాటలు పాడుకుందాం! అప్పుడు వీళ్ళందర్నీ .... మనఇంట్లో

నాకర్లుగా పెట్టుకుందాం....సరేనా?- ఇంక ఈ జావతాగేయి! చిన్నపిన్నికి ఒళ్ళు నొప్పులుగవుందిట!- కాస్త వేడినీళ్ళు పెట్టి ఒళ్ళురుద్ది నీళ్ళుపొయ్యమంది!- ఆతర్వాత పెద్దపిన్నికి తల చిక్కుతీసి ముడివేయమంది! నేనువేస్తే బాగుంటుందిట!"—— "అని నవ్వుతు చెప్తూంటే బామ్మ .... మంచంలో నీరసంగ నిస్సహాయంగ .... మూల్గేది!——

కానీ....

ప్రభాకరం తీవ్రంగ .... ఆలోచిస్తూ వాళ్ళింటిడాబా మీద పచార్లు చేసేవాడు - ఎదురింటి - పరాంకుశంగారి ఏకైకపుత్రుడు ప్రభాకరం! చాలాకాలం తరువాత ఎన్నో మొక్కుల తరువాత అపురూపంగ పుట్టిన ప్రభాకరం .... ఏవిషయానికీ ఎదురులేకుండా పెరిగేడు ఉన్నఊళ్ళో ఇంటర్ మీడియట్ పూర్తిచేసుకుని - డాక్టర్ కోర్సుకి, హైద్రాబాదులో రూమ్ తీసుకుని వుంటున్నాడు!——

మెడికల్ స్టూడెంట్ ఐన .... ప్రభాకరం....ఈ సంఘ దురాచారాలని లోతుగ .... తీవ్రంగ ఆలోచిస్తూ - అన్నీ అర్థం లేనివిగ .... మనుష్యుల్ని బ్రతికి వుండగానే చంపేవిగ- ఊహిస్తూ - విశాలదుస్థితికి-విరుగుడేమిటా? అని ఒకటే చింత పడ్తుంటాడు. ఆ అబ్బాయి - సెలవలికి ఇంటికి వచ్చాడని తెలిస్తే....వీధివాకిట్లోకి రావడానికే భయపడ్తుంది, విశాల!-

'అతని చూపులు ఎందుకలా వుంటాయి?'——

'నాగురి చేసేదోఆలోచిస్తున్నట్టుఅలానుంచుంటాడేం?

ఏవిధమైన అనుభవాలు .... తెలియని .... అజ్ఞాతవాసంలోవున్న విశాలకి, ప్రభాకరం చిన్నప్పటి ప్రభాకరంగా

కాక .... అతనిలో ఓ కొత్తవ్యక్తిని .... చూసి–భయపడేది!–

o o o

జానకమ్మ....నారాయణరావుగారిది గుట్టయినసంసారం నిండైన మనసులు!!–అయితే–చిన్నప్పుడు....జానకమ్మ అత్తాడ బడుచులతో నానాబాధలు పడింది! తనపడిన కష్టాలు పిల్లలు పడకూడదని అనుకుంది!– కానీ .... ఆమెకోరిక తీరలేదు! ముసలి అత్తగారు .... తనుబ్రతికి వుండగానే మనవరాలి పెళ్ళి చూడాలనీ .... తనకొడుకు, కూతురు వియ్యం పొందాలనీ...పట్టుబట్టి–భవానికి మేనరికం చేయించింది. జానకమ్మ పెద్దాడబడుచు భవానికి అత్తగారైంది!– 'ఆడపిల్లలు లేరునాకు, కూతురుఐనా కోడలైనా, నాచేతికి ఆసరానువ్వే అని'–ఈడేరగానే పిల్లని కాపరానికి తీసుకెళ్ళిపోయింది!– ఆ వేడుకలన్నీ కళ్ళారచూసి .... కన్నుమూసింది, ముసలి అత్తగారు–భవాని– తెల్లవారుఝామున – తొలికోడి కూతకి ముందేలేచి .... గొడ్లకిమేత, ఇంటి పాచిపనులు, ....మరుదులకి చద్దిఅన్నాలు,....మడికట్టుకుని.... మామగార్కి పూజకి అన్నీ అమర్చడం .... ఆతర్వాత అత్తయ్యకి వంటలో సహాయం చేయడం – ఎప్పుడో వంటిగంట దాటేక భోజనంచేయడం.... మధ్యాహ్నంపూట – అప్పడాలు వత్తుకోడం .... పప్పులు విసురుకోడం .... మళ్ళీ సాయంకాలం – ఇళ్లు తుడవటం లాంతర్లు తుడుచుకోటం .... వంటచేయటం .... అందరికీ భోజనాలుపెట్టి – రాత్రిపనులన్నీ ముగించుకుని – అలసిపోయి – అత్తయ్య పక్కనే చాపమీద పడుకుని నిద్రపోతే – ఏఅర్థ

రాత్రో....భర్త భాస్కరం .... 'నాకు మంచినీళ్ళు ఇవ్వాలని తోచలేదా? అనో....నాకు కప్పుకునే దుప్పటీ ఇవ్వలేదేం?'- అనో - 'సంకేతం' - ఇస్తే-నాలికకొరుక్కుని-లేచివెళ్ళేది!-

మళ్ళీ తొలికోడి కూతతో - దినచర్య ప్రారంభం!- ఈ గానుగెద్దు జీవితంలో - ఏడెనిమిదేళ్ళు గిర్రున తిరిగి - పాప .... బాబు పుట్టేరు - ఈ లోపులో .... శ్రీదేవికి పెళ్ళై అత్తారింటికి వెళ్ళింది. విశాల, వాళ్ళ పిన్నమ్మలకి చెరొక మూడు పురుళ్ళకి చాకిరీలు చేసింది! ముసలమ్మ పక్షవాతం వచ్చి పెరట్లో పాకలోకి మకాం మార్చింది!- ప్రభాకరం.... హౌస్‌సర్జన్ పూర్తిఅయి - హైదరాబాదులో ఉద్యోగం చేస్తున్నాడు.

మాలతి ఆ సంవత్సరం ఎస్. ఎస్. ఎల్. సి పరీక్షలు రాస్తే....రామం బియ్యే మొదటిఏడు పూర్తిచేసేడు. ప్రకాశం ఫోర్తుఫారంలో వున్నాడు....

ఎప్పుడూ దేనికిపంపమన్నా పేచీలుపెట్టేఅక్కగారు.... అనుకోకుండా కూతుర్ని పంపిస్తే....నారాయణరావుగారు.... ఎంతో సంతోషించేరు. జానకమ్మకికూడా ఆనందంగా వున్నా....ఏదో కారణం వుండకపోతుందా? అని అంతరాంతరాలలో ఓ చిన్న అనుమానం!—

శ్రీదేవిని కూడా పంపమని చిన్నల్లుడికి ఉత్తరం రాసేరు!- పోనీ వేసంగి సెలవలకి అంతా ఇంట్లో వుంటారనీ-

## 4

“శ్రీవార్ని వదిలి ఎలా రాగల్గేవమ్మా చిన్నవదినా?”- అని విశాల .... శ్రీదేవిని వేళాకోళం చేసింది.

"ఏం చేయను? రమ్మని ఉత్తరం రాసేరు. ఎప్పుడు పడితే అప్పుడు వినేఅల్లుడు మావారేగా?- బావ మేనరికం అయినా కొండెక్కి-కూర్చుని దిగిరానంటాడు. పైసంబంధం అయినా రెండో అల్లుడు ఎలాచెప్తే అలావింటారు....అంతా గంగిరెద్దువాటం!—

పక్కనే కూర్చున్న మాలతికి కోపం వచ్చింది!

"ఏంలాభం?- బావ మంచితనం నువ్వు నిలవనిస్తే గదా?-ఆమధ్య వస్తున్నానంటు బాంబులా రాసేవుఉత్తరం!- ఎంత కంగారు పడ్డామో ఇంట్లో .... మళ్ళీ ఆమాటైనా ఎత్తలేదు, రెండో ఉత్తరంలో!"- నీతో ఆ బావకనుక వేగుతున్నాడుగానీ....లేకపోతేనా?....

"మాలతీ?!-నువ్వు నోరుమూసుకో.... నావిషయంలో నువ్వు కలుగచేసుకోవద్దని ఇదివరకు చెప్పలేదూ?- అన్నిటికి తగుదునమ్మా అని సిద్ధపడకు - ఏంతెలుసు నీకు?- పెద్ద ఆరిందా కబుర్లుచెప్పకు!-" అంటు కసిరి గొంతేసరికి మాలతి ఉడుకుబోతుగ చూసి లేచివెళ్ళబోయింది. విశాల ఆపి కూర్చోబెట్టి - "మాలతీ అక్క-ఏమన్నా అంటే బాధపడకూడదే?!- నేను వదినవరుసకదా అని ఏదో వేళాకోళం చేసేనుగానీ...అసలు-వదినలిద్దరు ఇలా రావడం ఎంత ఆనందంగావుందో? వున్నన్నాళ్ళు సరదాగా వుండక కోపతాపాలేమిటీ?!- అంటూ నచ్చచెప్పింది....

ఉప్మాప్లేట్లు పట్టుకువస్తున్న భవాని వాళ్ళని చూసి చిన్నగ నవ్వి-"వచ్చి ఒకరోజైందో లేదో ... మీా ఇద్దరి మధ్య కీచులాటలు ప్రారంభమయ్యాయా?"-అన్నది..

"ఆ! అసలు మనదే పొరపాటు - మనకై మనం వచ్చినా....రమ్మనగానే వచ్చినా - అలుసు కాదూ?- ఏదో అంతా సరదాగా వుంటారని నాన్నగారు, రాస్తే...పుట్టింటి ఆపేక్ష వదలుకోలేక వచ్చానుగాని....ఆయనసలు వద్దంటూనే వున్నారు!"-శ్రీదేవి ఉక్రోషం చూసి - అంతవరకు ఉసూరు బోతుతనంగ వున్న మాలతి ఫక్కున నవ్వి- 'చూడు పెద్దక్కా- ఇంతకు మునుపే....బావ వస్తే గంగిరెద్దు వాటం.... ఎలా అంటే అలా వింటాడు-ఉత్తరం రాయగానే పంపేడని కోతలు కోసి....ఇప్పుడేమో....బావ వద్దంటుంటే వినకుండా వచ్చేనంటోంది!"-అంది-

అప్పుడుగానీ శ్రీదేవికి తనన్నదేమిటో అర్థమైంది! నవ్వు వచ్చినా ఆపుకుని .... "ఆ! మహా గొప్ప రిసెర్చిలే నోరు మూసుకో!"- అని దబాయించి ఉప్మాప్లేటు అందుకుంది....విశాల, మాలతికి సైగచేసి-శ్రీదేవి .... దబాయింపుని కళ్ళతోటే వెక్కిరించి....నవ్వింది!-

భవాని....శ్రీదేవి....మాలతి....విశాల....అలా కబుర్లు చెప్పుకుంటు-నట్టింటకూర్చుంటే-జానకమ్మకి ఎంతో నిండుగ.... ఆనందంగ వుంది!-అయితే అంత సంతోషంలోనూ....ఓచిన్న లోపం....వెలితి! విశాల! .... వెర్రిపిల్ల!!- శాపగ్రస్థురాల్లా.... ఏఅలంకరణలు లేక....తనపిల్లలముందు....దీనంగ కనిపిస్తుంది!- అలాంటి సమయంలో అకారణంగ .... మనుష్యులందరి మీదా....తెగకోపం వస్తుంది, జానకమ్మకి!- ఏదో ఉప్పెనలా....బాధ ముంచుకువచ్చి.... 'అయినా వెధవ కట్టుబాట్లు- ఆ వెర్రిపిల్ల అసలు మొగుడి ముఖమైనా ఎరుగునా?- ఏదో

కొన్నాళ్ళు సంసారం చేసిందంటే....ఆసంగతి వేరు-ఏమీ అనుభ వించని దానికి ఈ శిక్షేమిటీ?-బ్రతుకంతా ఎలా వుండగల్గు తుంది?-ఆ ముసలిబామ్మా 'ఇవాళా రేపో' అన్నెట్టు వుంది!-ఇక ఆ తర్వాత....దీనికి ఎవరు ఆప్యాయం చూపిస్తారూ?- కట్టడీ లంటే చెప్తారు గానీ.... వెధవకాకుల్లాంటి మనుష్యులు దాని జోలికి రాకుండా వుంటారా?-ఏ అఘాయిత్యం జరిగినా.... మళ్ళీ నల్లురు దీన్నే అంటారు! మంచి వయసులో వున్న పిల్ల!-ఏమిటో భగవంతుడు ఎందుకిలాంటి బాధలు పెడ తాడో?"-అని సంఘానికి వెరుస్తూ .... అన్యాయానికి బలి అవుతున్న విశాలని-ఏ విధమైన న్యాయం చూపించలేక.... సతమతమయింది!- ఏదో జరుగుతే బాగుండును!- కానీ ఎలా?!-జానకమ్మ-సనాతన సాంప్రదాయాలలో .... పెరిగిన, సహృదయురాలు!-కనుక ఏం చెయ్యాలేక-ఎవరో ఏదో చేస్తే బాగుండుననే - అంతర్గతమైన కోరికతో తల్లడిల్లిపోతోంది!

కేవలం మనిషిమీద జాలి వుంటే చాలదనీ....చేయూత నిచ్చి ఒడ్డుకు నడిపించాలనీ....జానకమ్మకి తెలియదు! ఆవిడ పెరిగిన వాతావరణ పరిధిలోనే ఆమె ఆలోచించ గలదు:- స్వయంగ తనేం చెయ్యాలేని అశక్తురాలు!

ఉషామ్మాలో జీడి పప్పులన్నీ ఏరుకుని తినేసి....తన ప్లేట్లో కరివేపాకు, పచ్చిమిరపకాయలు ఏరి- "అమ్మా .... ఇవి నాకొద్దే!- ఇవి నువ్వు తీసుకుని నాకు పప్పులియ్యవే!"- అని పాప తల్లిదగ్గరకెళ్ళింది!..

"ఆహా! ఏం తెలివే? చిన్నప్పుడే ఇంత తెలివివుంటే.... పెద్దయాక ఇక చెప్పఖ్ఖర్లేదు! నువ్వు జీడి పలుకులు

తినేసి....అమ్మకి కరివేపాకు మిరపకాయముక్కలు ఇస్తావా?"- అంటూ మాలతి గదమాయించింది!-

"అది అడిగే వరకు ఇవ్వకపోడం-దాని ప్లేట్లో మిరప కాయ ముక్కలు తినేయక పోవడం నాదే తప్పు మాలతీ !- ఇలారా పాపా తీసుకో!"- అని భవాని పాపకి అన్నీ ఏరి ఇస్తుంటే-

"అంతేలే !- అందరికీ అన్నీ ఇచ్చి.... నువ్వేం మిగ ల్చుకోకపోడం....నీ కలవాటేగా?"-

"ఎవరికిస్తున్నానూ? మా అమ్మాయికేగా?"-

"ఆఁ నేను అడిగినా ఇస్తావు!"-

"ఏదీ అడుగు మరి!"- భవాని నవ్వింది .... "నేనేం చిన్నపిల్లనా?"—— అంటూ మాలతి నవ్వేసింది ! —— "ఆఁ తెల్సింపా మరి?"- భవాని అంటుంటే విశాల నవ్వి - "ఎలా తెలుస్తుంది వదినా?- చిన్నప్పుడు ఏం చేసిందో ఇప్పుడు తెలియదు కదా ? ఇప్పుడు ఏం చెయ్యాలన్నా? పెద్దరికం అడ్డం వస్తుంది"- అన్నది.

అప్పటి వరకు ఉప్మా తినడంలోనే వున్న శ్రీదేవి- "దానికో పెద్దరికం కూడానా?- అన్నీ చిన్నతనపు చేష్టలే!- అమ్మ దగ్గర కూర్చుని బాగా గారాలు నేర్చుకుంది!- వాటా రావడానికి నేను అక్కయ్య లేముగా?"-ఓరగచూస్తూ అనే సరికి తారాజువ్వలా లేవబోయింది మాలతి!- భవాని ఎడం చేత్తో వారించి.... "అలా అంటే ఎలాగే దేవీ?-అది పుట్టక

ముందు....మనిద్దరం చేసిన గారాలన్నీ-దానికి తీరలేదుగా? అందుకు ఇప్పుడు తీర్చుకుంటోంది!"-అన్నది.

"ఆమాటకొస్తే.... మీకు సాగినన్ని ఆటలు నాకు సాగడమే లేదు!"- అని తేల్చింది మాలతి.

"ఓయబ్బ!- మాకేదో రాజభోగాలు వెలగబెట్టి నట్టు"... శ్రీదేవి అందుకునేసరికి-విశాల, తినన్న పేట్లుకింద పెట్టి- "ఆగండి ఆగండి-మీ పోటీలు .... విష్టూరాలు బాగానే ఉన్నాయి కానీ....నా మాటేమిటీ? నా బోటిది ఇక్కడ వుందని తెలిసి కూడా మీరిలా వాదులాడుకోడం బాగు లేదర్రా?!"- అని నవ్వింది!-

అది నిండైన నవ్వుకాదు!"- భవాని జాలిగ చూసింది! మంచినీళ్ళ గ్లాసు పట్టుకొచ్చిన జానకమ్మ- "పిచ్చిపిల్ల ... నువ్వు పరాయిదానివా? నా పిల్లలతోటే నువ్వూనూ!"- అన్నది.

"నిజమే అత్తయ్యా!- అందుకేనాకీఇంట్లో చనువు, ఈ వదినలమీద అధికారం వున్నాయి! ఇంతసేవు ఇక్కడ కూర్చుని ఎందుకు ముచ్చట్లేస్తున్నానూ? మీతో నానున్న అనుబంధం అటువంటిది!"-

ఆ తర్వాత సంభాషణ మారి.... కాఫీలు ముగించి.... నవ్వుతూ .... తుళ్ళుతూ, ఛలోక్తులు సురుకుంటు .... సాయంత్రం దాకా గడిపేసేరు.

మాటల మధ్యలో .... శ్రీదేవి .... విశాలని - హెచ్చ రించి.... 'మీ పిన్నమ్మలకి మరీ-అంత చెయ్యకు!- నీకూ ఆ

ఇంట్లో హక్కుందని తెలుసుకో?- చక్కగ ఓ జతగాజులు- మెళ్ళో గొలుసు చేయించి వేసుకో....మీ పొలం పంటంతా ఏం చేస్తున్నారు మీ బాబాయిలు?- మరీ నోట్లో నాలిక లేనట్టు వుండకు!'- అని సలహాలిచ్చింది!-

'ఇన్నాళ్ళైనా .... నేను ఇవన్నీ ఎందుకు చెప్పలేక పోయానా?'- అనుకుంది జానకమ్మ.

తరానికి తరానికి మధ్య ఎలాంటి బేధంవుందో ... కొద్దిగ అర్థమైంది!-

తనకంటే భవాని .... దానికన్న శ్రీదేవి....అంతకంటే మాలతి .... వ్యక్తిత్వం నిలుపుకునే వాళ్ళలా .... కనిపించ సాగేరు'___

"వస్తానత్తయ్యా .... బామ్మ ఏంచేస్తోందో పాపం?"- అంటూ లేచి వెళ్ళిపోయింది విశాల.

o o o

ఒకవారం తర్వాత విశాలని వాళ్ల బామ్మ ....బాధించ నంత దూరం వెళ్ళిపోయింది! బాబాయిలు....పినతల్లులు .... 'ఇన్నాళ్లకి భగవంతుడు .... ముసలి ప్రాణానికి సుఖందక్కేం చేడు హాయిగ వెళ్ళిపోయింది!-' అనుకున్నారు.

కానీ విశాల?___

తనుకున్న ఒకే ఒక్కతోడు వెళ్ళిపోయింది!

పెరట్లో ఆపాకకేసి చూస్తుంటే ఏదో తెలియనిబాధ! గుండెను పిండుతున్న బాధ! ఆపాకలో ఆమూల నులకమంచం

వెల వెలబోతోంది! .... చేతికర్ర .... స్టూలు దిగాలుపడినట్టు ఓ మూలకి నక్కాయి!

ఇక తెల్లవారు ఝూమునే లేచి బామ్మని బయటికి తీసుకెళ్ళవలసిన పనిలేదు!- బట్టలు మార్పించి .... బార్లీ జావ తాగించే పనిలేదు. అన్నం గుజ్జుగపిసికి- తినిపించేపని అసలే లేదు. తోచనప్పుడు ఆమాటా ఈమాటాచెప్పి నిద్రవుచ్చ ఖర్లేదు....అసలు ఆపాకలోకి వెళ్ళేపనేలేదు!!

మోకాళ్ళ సందున తలపెట్టుకుని....కాళ్ళచుట్టు చేతులు చుట్టుకుని- 'బామ్మా! నేను .... ఈఇంట్లో ఎంతకాలం, ఎలా వుండనూ?- అప్పుడప్పుడు, నీవుచూపించేజాలి,సానుభూతే.... నాకు కొండంత ధైర్యంగవుండేవి!-జానకమ్మత్తయ్య ప్రేమాభిమానాలే నా ఊపిరి! కానీ వాళ్ళింటికి ఇక ఎంతకాలం వెళ్ళగలనూ?- ఇన్నాళ్ళ నా బ్రతుకు వేరు....ఇకమీాదట వేరు!

'రేపో మాపో బాబాయిలు పంచుకుని వేరవుతారు. నా వాటాకూడా పంచినా, ఇంతకాలం నన్ను పోషించినందుకు లెక్కలుకట్టి....ఆవాటా చెల్లుగట్టేస్తారు. ఆతర్వాత ....ఇంటిమధ్యనుంచి.... గోడ .... పెరట్లో తడికెలు....పాకలో అడ్డు-వేసి సామాన్లు పంచుకుంటారు...ఇంతకాలంగా మనస్సులు వేరైనా ... మనుష్యులుమాత్రం తప్పని సరిగా.... నీమీాదవుండే గౌరవంకోసం....కలిసి ఒకఇంట్లో ఒకవంటింట్లో ఒకే పంక్తిలో తిన్నారు. గానీ....ఇకమీాదట ఎవరికివారే!- బావిదగ్గర కూడా అడ్డుగోడలుకట్టి - స్నానాలకి ఏర్పాటు చేసుకుంటారు!-

(6)

'మరినేను ఎక్కడుండాలి?- నాస్థానం ఏమిటి?-ఎవరి వాటాకి చెందుతాను?- బామ్మా-నాన్న నాకింత అన్యాయం ఎందుకు చేయాలి? ఆ పెళ్ళంటు చేయకపోతే ... ఈనాడు ఎవడినో చేసుకుని .... ఎలాగో బ్రతుకేదాన్ని। కానీ ఆదారి కూడా మూసేసేడు నాన్న! హూ! అందరూ అన్యాయమే చేసేరు!- ఏదో క్లాసుచదువుతో ఆగిపోయింది, నాచదువు. ఇక పిన్నమ్మలకి వంటలు చేసిపెడుతూ- బ్రతకటమే।'—

'బామ్మా? నువ్వుఅనేదానివి గుర్తుందినాకు 'పాలు పొయ్యిమీద కాగుతున్నాయి, తీసుకునితాగాలని తెలియదే వెర్రిముఖమా?- నీకూ, ఈఇంట్లో ఆస్తిపాస్తులు వస్తాయి ! నీకూ హక్కుంది అనీ'-.... ఆఖరి క్షణాల్లోకూడా - 'దాని వాటా దానికి రాసేయండి'- అని బాబాయిలదగ్గర అన్నావు కానీ—

'ఈనాడు బాబాయిలు - ఆలోచనలువేరు!- పంటలు పండటానికి చాలా కష్టపడ్డారుట!- నన్ను చిన్నప్పట్నుంచీ.... పెంచి పెద్దచేసేరుట ! అవన్నీ లెక్కలు కట్తున్నారు!- రేపు నన్నూ ఓ వస్తువులాగ-ఎవరో ఒకరు పంచుకుంటారు, చాకిరీ చేస్తే... తిండి గుడ్డాపెట్తారు కాబోలు?!—

విశాల చెంపలమీదనుంచి కన్నీళ్లు జలజలరాలేయి!!

తననెవరూ పలకరించరు!- ఇంటినిండా జనం! ఆ పిన్ని వైపు చుట్టాలు .... ఈ పిన్నివైపు చుట్టాలు!- ముసలమ్మ చచ్చిపోయిందని కాదు .... ఆ తర్వాత వేరింటి కాపరాలకు ఏర్పాట్లు చేసే వేడుకకోసం వచ్చారందరూ।।—

భుక్తాయాసం తీర్చుకుంటు .... విసనకర్రలతో విసురు కుంటు....వరుసైన వాళ్లతో వేళాకోళాలాడుకుంటు....మధ్య వసారాలో చాపలమీద పడి దొర్లుతున్నారు, అందరూ....

విశాల తలతిప్పి చూసింది! 'తను' అనే మనిషి వున్నట్టుకూడా వాళ్లెవరు గమనించినట్టులేదు....

చివాలున లేచి .... జానకమ్మత్తయ్య ఇంటికి బయలు దేరింది! - వీధిమెట్లు దిగబోతూవుంటే - పెద్దపినతల్లి వెపు బంధువు ఒకావిడ - "ఇదిగో ఏమమ్మోయ్ - నీపేరేమిటో గుర్తులేదుకానీ .... ఎండలో ఎక్కడికి బయల్దేరావ్?"- అని నిలదీసింది. వొళ్ళుమండింది విశాలకి—

"ఏట్లోకి"- అంది విసురుగ-

"ఆఁ! ఏట్లోకి కాట్లోకి వెళ్లే అదృష్టాలందరికీ పట్టవ మ్మోయ్! ఇలాంటి అఘాయిత్యపు పనులుచేసి అప్రతిష్ట తీసుకురాకు!- ఆరోజువస్తే ఎవరికైనా తప్పదు! చేసుకున్న ఖర్మ అనుభవించవద్దూ?!- సరేలే సోదిఎందుకుగానీ .... ఏదో మీ బామ్మగదా అనిసీకు దుఃఖంవస్తోందేమో .... మరిముసల్ది గదా ఎన్నాళ్ళుంటుంది?- అయినా పెద్దాళ్ళచావు పెళ్ళితో సమానమన్నారు. దివ్యంగ కొడుకులిద్దరు ఖర్మలన్నీ పూర్తి చేసేరు!- ఇకమీదట నువ్వు బాబయ్యలు....మీ పిన్నమ్మలు చెప్పినట్టువింటు వాళ్లకి పనిపాటల్లో సాయంచేస్తూ .... ఏదో రామాయణమో భారతమో చదువుకుంటూ....ఇంటిపట్టునే వుండాలి!- ఇలా మాటిమాటికి రోడ్లవెంట ఇంటింటికి తిరు గుతే ఏం బాగుంటుంది!- వయస్సులోవున్న పిల్లవి! అరటి

ఆకుమీాద ముల్లుపడినా ముల్లుమీాద ఆకుపడినా .... ఆకుకే నష్టం నష్టం! అంతటితో ఆగుతుందా! వంశానికే అప్రతిష్ట!- మీా పిన్నమ్మల పిల్లలకి పెళ్ళిళ్లుకావాలా .... మీా బాబాయిలు తలఎత్తుకు తిరగాలా!-.... ఇంకా?"

"ఇంతకీ మీారు చెప్పేదేమిటీ?-నన్ను ఇల్లు కదలకూడదని చెప్పడానికేనా ఇంత శ్రమ పడుతున్నారూ?-పర్వాలేదులెండి- ఈ ఊళ్ళో నేను పుట్టినప్పటి నుంచీ పెరుగుతున్నాను! నాసంగతి అందరికీ తెలుసు! వంశానికి అప్రతిష్ట ఏదైనా జరిగితే....అది ఇంతకు ముందే జరిగింది:-బ్రతికివున్న నన్ను చచ్చిన దానిలా చూస్తున్న మా వంశానికి ఇంకా ప్రతిష్టేం మిగిలింది!- వస్తాను. నేను మా జానకమ్మత్తయ్య ఇంటికి వెళుతున్నాను!-" అనేసి "కొంగునిండుగ కప్పుకుని చరచరా ముందుకు నడిచింది .ఆ! ఆ! అమ్మో చూస్తా దానిపొగరుచూసేరా? నేనుచెప్పలే?-". అంటూ ఇంట్లోకి నడిచింది—

o o o

ఎర్రని ఎండలో కాళ్ళు చుర్రుమంటుంటే .... కళ్ళల్లో నీళ్ళు తిరుగుతూవుంటే - నెత్తిమీాదనుంచి చీరచెరగు తిప్పుకుని .... ఆవేదన, ఆరాటం తీర్చుకుందుకు .... రెండుసందుల అవతలవున్న జానకమ్మత్తని ఆసమయంలో కౌగలించుకుని కరువు దీరా ఏడవాలి అని .... ఏడ్పునంతా గొంతులో దాచుకుని....చకచకా నడుస్తోంది—

నారాయణరావుగారు కోపరేటివ్ బ్యాంకిలో పని చేస్తున్నారు.- ఆసమయంలో ఆయనబ్యాంక్‌లో వున్నారు!-

రామం....ప్రకాశం మ్యాటినీకి వెళ్ళారు. శ్రీదేవి, మాలతీ, గదిలో మంచాలేసుకుని పడుకున్నారు .... పాపని పక్కనే పడుకోబెట్టుకుని జానకమ్మ మధ్యవసారాలో చాపమీద నిద్రపోతోంది!

మిగిలింది భవానియే!- ఆమెకి నిద్ర రావటంలేదు. బాబుని గుండెలమీద పడుకోబెట్టుకుని, వీధి వరండాలో వాలుకుర్చీలో కూర్చుని-మౌనంగా ఆలోచిస్తూ చూస్తోంది!-

బాదంచెట్టు క్రింద కీచులాడుకునే తొండల్ని....చెట్టు మీద నోరు తెరుచుకుని కూర్చున్న కాకిని....కొబ్బరి చిప్పని కొరుకుతున్న ఉడుతపిల్లని, .... అన్నింటిని పరధ్యానంగ చూస్తున్న భవాని .... చెక్కగేటు తెరుచుకుని .... వస్తున్న విశాలని .... ఆ రాకలోని తొందరపాటుని గమనించి-కుర్చీలోంచిలేచి .... బాబుని అక్కడేవున్న చాపమీద పడుకోబెట్టింది!....

వరండాలోకి వచ్చి చీరచెరగు తలమీదనుంచితీసి జుట్టు చేత్తో సరిచేసుకుంటు భవానికేసి చూసింది!-

"అత్తయ్య ఏంచేస్తోంది?"

భవాని విశాలని చూస్తూనే గ్రహించింది!- అందుకే భుజంమీద ఆప్యాయంగ చేయివేసి - "అమ్మపడుకుంది - కూచో మంచినీళ్ళు కావాలా?-" అన్నది....

ఎండలో వచ్చిన విశాలకి - భవాని చల్లని పలకరింపుతో - కళ్ళువర్షించేయి!——

"వదినా!"- అంటూ భవానిని కౌగలించుకుని .... ఘొల్లుమంది?... నిముషాలవరకు భవాని విశాల వీపు

నిముసుతూ - "వూరుకో....వూరుకో"....అంది ఉప్పెనలాంటి బాధ తీరేక-భవానిని వదిలి కళ్ళు తుడుచుకుంటు.... "వదినా- ఇంక నాకెవరున్నారు?- ఆఇంట్లో నేనిక వుండలేను!- నాకెందుకో చచ్చిపోవాలని వుంది?-" అన్నది- భవాని చిన్నగ నవ్వి - అలా కుర్చీలో కూచో....మంచినీళ్లు తెస్తాను తర్వాత మాట్లాడుకుందాం" ... అని లోపలకెళ్ళి చల్లటి నీళ్లు గ్లాసునిండా తెచ్చిఇచ్చింది: ముఖం: కళ్ళు కడుక్కొని.... మిగిలినవి తాగేసి గ్లాసుక్రిందపెట్టి మళ్ళీ కుర్చీలో కూర్చు న్నాక - భవాని అక్కడున్న స్టూలు కుర్చీదగ్గర వేసుకుని- కూర్చుంది!- "చూడు విశాలా- నువ్వు ఇందాక అన్నావే.... 'చచ్చిపోవాలనివుంది' .... అని .... నేనుకూడా చాలాసార్లు అలాగే అనుకున్నాను!-"

"వదినా?!! ఏమిటి నువ్వనేది?- నువ్వు అలా అను కోవచ్చా?"——

"ఏం ఎందుకనుకోగూడదూ?-నాకు పెళ్ళై....కాపురం చేసుకుంటు - పిల్లల తల్లిగవుండి - తల్లి తండ్రీ తోబుట్టు వులతో హాయిగ వున్నదాన్నని కదూ?- కానీ నాకుండే బాధలు నాకూవున్నాయి!——

"విశాలా....నేను చాలా చిన్నతనంలోనే కాపరానికి వెళ్ళినసంగతి నీకు తెలుసుకదూ?- మన పెద్దవాళ్లు చేసే పొరపాటుపనులు ఇవే!- కాపరంఅంటే ఏమిటో తెలియని చిన్నవయస్సుల్లో .... కేవలం చాకిరీలకోసమే అన్నట్టుగ - పంపుతారు.- అలాగే వెళ్లేను!- అత్తయ్య ఏంచేయమంటే-

అవి చేసి.... చెప్పకపోయినా - గ్రహించి చేయాల్సినవి చేసి.... ఇంకాఏంచేస్తే బాగుంటుందో .... ఎలా మెప్పుపొందాలా అనే .... యోచిస్తు .... వయస్సుకు మించిన పనులుచేస్తు .... అయినా, అత్తయ్యనుంచి - ఎన్నడూ ఏవిధమైన ప్రశంసలు పొందలేక - ఓ యంత్రంలాగ తయారయి....అనుభవాలతో తలబొప్పి కట్టించుకుని .... ఇద్దరుపిల్లల తల్లిని అయ్యాను!- సమయం వచ్చిందిగనుక నీతో చెప్తున్నాను .... మాఇంట్లో నీకుండే స్వాతంత్రంకూడా....నాఇల్లు అనుకునే అత్తారింట్లో నాకులేదు!- అత్తయ్య ఇచ్చేదాకా....తీసుకోమనేదాకా.... ఏవస్తువు ముట్టుకోకూడదు!- కూరొచ్చకూడదు! మధ్యాహ్నం నడుం వాల్చకూడదు!- పక్కింటివాళ్ళతో పొరపాటునైనా ముచ్చట్లేయకూడదు. పేరంటానికి వెళ్ళినా .... అత్తయ్య వెనకాలే తలవంచుకుని వెళ్ళి ... మళ్ళీ అత్తయ్యకంటె ముందుగ ఇంటికి వచ్చి....ఇంటిపనులు చూడాలి!-

"సరదాగావున్న ఒకరోజున - నోరువిప్పి ఒకపాట పాడేను....అదీ, మాఇంటికి వచ్చిన ఒకావిడ పాడమంటేనే!- ఆవిడ వెళ్ళాక-అత్తయ్య ఆరోజల్లానన్ను సాధించిపోసింది!- మనఇల్లు సంసార్లదనుకున్నావా? సాని కొంపనుకున్నావా? ఏమిటాపాటలు అని-మళ్లీ ఎన్నడూ నేను నోరువిప్పలేదు!- నాన్నగారు....ఎంతో సరదాపడి నాకుసంగీతం చెప్పించారు చిన్నప్పుడు - ఎందుకు?- శుద్ధదండగ!- వంట ఎప్పుడైనా పాడైతే - మా అమ్మదగ్గర్నుంచి అమ్మమ్మవరకు అందర్ని ఆడిపోసుకుని ఆడపిల్లకి వంట నేర్పాలని తెలియదా?- అని

తిట్టిపోసేది!- మామగారు ముక్కోపి! ఆయన ఎదురుగా నుంచుని కొడుకు లే మాట్లాడలేరు!

నేను వీధిముఖం చూడాలంటే పుట్టింటికి వచ్చే టప్పుడు - బండి ఎక్కుతానుగ - అప్పుడు - మళ్ళీ అత్తింటికి వెళ్ళినప్పుడు బండి దిగినప్పుడు-అంతకుతప్ప పేరంటాలకి కూడా - అత్తయ్య వెనకాల కొంగునిండా కప్పుకుని తల వంచుకుని నడవాల్సిందే!- అదీ కాకపోతే పెరటిదోవన - సందుల్లోంచి గొందుల్లోనుంచి తీసుకువెళ్ళేది!- ఫలానా వారి కోడలు తలఎత్తి నడిచిందనీ....వాళ్ళనీ వీళ్ళనీ చూసిందనీ - పేరు రాకూడదుట!

"పగలు నేను, వారు అసలు మాట్లాడుకో కూడదు!- ఇప్పటికీ - ఇద్దరుపిల్లలు పుట్టినా నేనువారితో అత్తయ్య ఎదురుగ మాట్లాడను!- అసలు మాట్లాడుకోవలసిన అవసరం ఏముంటుందనీ?- నాకోసం ఏదైనా కొనాలన్నా - అత్తయ్య చెప్తేతప్ప-ఆయన తేకూడదు....తేరు!- సినిమాలు షికార్లు అసలు లేనేలేవు!- సాయంత్రం కాస్త శుభ్రంగ తయారైతే అయ్యో విధవ పోకళ్ళు - పొద్దుగూకకముందే ఏమిటా శృంగారం? నల్గురూ మసిలే కొంపగానీ - ఇదేమన్నా అంతఃపురం అనుకుంటున్నావా? అంటుంది!- అందుకని నేనసలు సాయంకాలం తలదువ్వుకోడం మానేసేను!-వంటగదిలోనో.... అంట్లగిన్నెలు తోముతూనో గడుపుతాను!- ఆయనకి ఈ గొడవలన్నీ పట్టవు!- ఎంతసేపు తండ్రితో పొలంపనులు చూసుకోడం - తమ్ముళ్ళ చదువు విషయాలు చూడ్డం!

"నేను ఇక్కడికి ఎందుకు వచ్చేనో .... మీకెవ్వరికీ తెలియదుకదూ!- విశాలా నేను ఈమధ్య టైఫాయిడ్ వచ్చి-పుణర్జన్మ ఎత్తినంత పనైంది!- ఆరోజు మామూలుగ .... పనిపాటలు చేస్తూనే .... ఒంట్లో ఏమిటో తేడాగావుందని కాస్సేపు కళ్ళుమూసుకుని కూర్చున్నాను.- జ్వరం తగిలినట్టు తెలిసింది! కానీ అత్తయ్యకి చెప్పేధైర్యంలేదు! నానాగోల చేసి....ఏంఫర్వాలేదంటుంది! అందుకని మళ్లీ మామూలుగ లేచి పనిచేసుకోబోయేను. కాని నా వశంకాలేదు. కళ్లుతిరిగి అక్కడే చాపమీద పడుకున్నాను. మగతగ ఎక్కడోవున్నట్టు అనిపించింది! మాటలుకూడా ఏవో వినిపించాయి! అవన్నీ అత్తయ్యనన్ను తిట్టుతున్నతిట్లని తర్వాత బుర్రకి తెల్సింది!- అత్తింటికోడలు - అలానట్టింట పడుకుంటుందా? ఏదైనా పైత్యంగా వుంటే అల్లంరసమో... మిరియాల కషాయమో తాగాలికాని ... ఇలా షోకరాలు పోతారా? ఇంటెడు పనులు వదిలిపెట్టి - పడుకుంటే నేనుఒకర్తి చేసుకోగలనా?- అయినా నేను ఆనాడే చెప్పాను. మేనరికం వద్దని: మాఅమ్మ వినకుండా-తమ్ముడి కూతురని....ముచ్చటపడి చేసుకోమంది! బోలెడు కట్నంవచ్చే సంబంధాలు వదులుకుని - అయిన వాళ్ళని చేసుకున్నందుకు...నాకు బాగానే కుదిరింది! వాళ్ళ మ్మాఇంతే - వాళ్ళమ్మమ్మా ఇంతేట!?- ఇంతకీ నాఖర్మం. ఎవర్నని ఏం లాభం: వాడొక చవట. పెళ్ళాం కొంగు పట్టుకు తిరుగుతాడే తప్ప...అదుపు ఆజ్ఞలో పెట్టుకోడం రాదు. ఆడదాన్ని పువ్వుల్లో పెట్టినట్టుచూస్తే...అది లొంగు

తుందా?- నాకు పనిపాటలున్న రోజునే- రావాలారోగాలు!- పిలిస్తే పలికే రోగాలుమరి?- అయ్యోయ్యో నేరుపప్పు నాన బోసేను .... వడియాలు పెట్దామని .... ఇంకేం వడియాలు? మాయదారి రోగాలు.. అన్నీ వేషాలు! గిర గిర తిరిగి బొంగరంలా పనులు చేసుకోవాలిగానీ? పడకేస్తే కుదురు తుందా? ఇదే పరాయి సంబంధం అయితే-పడుకుంటుందా?- కావాల్సినవాళ్ళకే కళ్లు నెత్తికెక్కుతాయి!- కూతుర్లా చేసిపెట్టుందను కున్నానుగాని ... ఇలా మొరాయిస్తుందని తెలుసా?—

"అంటూ ఒక తేదండకం చదివేస్తువుంటే పౌరుషం వచ్చి - గభాల్న లేచేను. కాని గోడకు కొట్టుకుని మళ్ళీ పడి పోయేను!- ఆతర్వాత ఏంజరిగిందో నాకు తెలియదు!- తెలివి వచ్చేసరికి మంచంమీద పడుకునిఉన్నాను. ఆయన పక్కనే నిల్చుని - 'మంచినీళ్ళు' కావాలా? అని అడిగేరు. తాగి మళ్ళీ పడుకున్నాను. మర్నాడుగాని తెలివిరాలేదు!- మామూలుగ లేచి మంచం దిగబోయేను...కాని ఆయన వద్దని - నీకుబాగా జ్వరంవుంది లేవకు డాక్టర్ గారు లేవ వద్దన్నారు - అంటే - మళ్లీ పడుకున్నాను. లోపల ఎక్కడో అత్తయ్య సణుగుడు వినబడుతూనేవుంది!- ఆద్వారం టైఫా యిడ్ అని .... డాక్టర్ చెప్పి .... జాగ్రత్తలు చెప్పేతప్ప అత్తయ్యనోరు మూతపడలేదు!- తగ్గి పథ్యం తినేనాటికి నారూపునేనే నమ్మలేక పోయాను!—

"అత్తయ్య....నేనింకాపనులు చేయటంలేదని చాటుగ మాటలు విసురుతూనేవుంది.- ఆ సాయంత్రం .... డాక్టర్

గారు కచ్చితంగ చెప్పారు-ఒక నెలరోజుల వరకు అమ్మాయి విశ్రాంతి తీసుకోవాలి....ఏపనీ చేయకూడదు అని!- అసలహా అత్తయ్యకి నచ్చలేదు!- కాని వారుమాత్రం నాయూపు చూసి-ఇంత కాలంగ తల్లితండ్రుల మీదవుండే భయభక్తుల్ని కొద్దిగ వెనక్కి-నెట్టి - డాక్టర్ గార్కి- ఇంటిపరిస్థితి నంతా వివరించి .... స్వయంగా డాక్టర్ గారే దగ్గరవుండి - బండి ఎక్కే దాకా....నిలబడేటట్టు-ఏర్పాటు చేసేరు!- అందుకనే .... నేను ఉత్తరం రాయకుండా....ఆ వ్యవధి లేకుండా వచ్చాను. నేను రాగానే అమ్మ....చిక్కి-పోయావనీ....పిల్లలుకూడా చిక్కి-పోయారనీ - ఆప్యాయం చూపింది!- మాతృహృదయం కనుక....ఆవిడ ఆరాటపడింది కానీ-నాన్నగారు అంతవివరంగ అడగలేదు!- ఆడవాళ్ళకి మగవాళ్ళకి అదే తేడా!-

"విశాలా! అక్కడి గొడవలన్నీ - వచ్చినప్పుడల్లా చెప్పుకుని వీళ్ళని బాధపెట్టు - నేనూ....వాళ్ళూ ఏడవడం ఎందుకు?- ఎప్పుడో .... భరించలేకపోతే .... అక్కడే ఓ పెద్ద బావివుంది....అందులో ఏరాత్రో దూకుతే....అందరికీ సుఖం ఒకసారిఏడ్చి వూరుకుంటారు .... అలాఅని ఎన్నోసార్లు అనుకున్నాను!- కానీ-చెయ్యలేక పోయాను. ఎందుకో తెలుసా?- చచ్చి సాధించేది ఏమిటీ?!- నాపిల్లలకి దూరమై.... వాళ్లు.... నీలాగే నానాబాధలు పడితే-నేను చచ్చేటలాభం?- అమ్మా నాన్నా... క్రుంగిపోతారు....నాతరువాత చెల్లెళ్ళకి....తమ్ముళ్ళకి ఈ సంఘంలో ఎలాంటినిందలు వస్తాయో?- మనిషిచచ్చేక.... తనవాళ్ళకైనా లాభంలేకపోతే....ఇంకెందుకు చావటం?——

"అందుకని....బతికివుండే .... ఎప్పటికైనా మంచిరోజు రాకపోతుందా?- అని చూస్తున్నాను... ఒక్కొక్కప్పుడు ... అనుకోకుండా ఏమూరోప్పి రావచ్చు .... తీరా చచ్చిపోతే అప్పుడు అంతా అనుకోరూ....?"- పేలవంగానే నవ్వినా ఎంతో నిదానంగ....గతం గుర్తుచేసుకుంటు చెప్పుకొచ్చిన భవాని....స్వానుభవాలన్నీ ....ఏకాగ్రతతో వింటున్నవిశాల.... అనుకోకుండా పక్కకి తిరిగిచూసి "అత్తయ్యా"!! అని కంగారు పడింది. భవాని చప్పున తలతిప్పిచూసి "అమ్మా!" అని లేచివెళ్ళింది!—

ఎప్పుడు లేచిందో జానకమ్మ....భవానిచెప్తున్న స్వీయ కథంతా....ఇదివరకు విన్నదే అయినా ....విశాలతో....ఇంకా లోతుగ చెప్తున్నదంతా .... విన్నది. కూతురు....చచ్చిపోదా మనుకున్న నిర్ణయం....దాని ప్రభావం వెల్లడి చేస్తున్నప్పుడు- ఆగలేక వెక్కి వెక్కి ఏడ్చేసింది!- వీధితలుపును ఆని నిల్చుని....చెంపలమీదుగ కారుతున్న కన్నీళ్ళతో వెక్కిళ్లు పడుతున్న తల్లిని భవాని కౌగలించుకుని "నువ్వెప్పుడు లేచావమ్మా?" అంటుంటే విశాల అత్తయ్య కన్నీళ్ళు తుడుస్తూ.... "ఏమిటత్తయ్యా? భవానివదిన నూరుకేననున్న ఓదార్చడానికి ఓ చక్కనికథ చెప్తోందికానీ అదంతా నిజమా ఏమిటీ?-" అంటు నవ్వింది!—

జానకమ్మ నిట్టూర్చి కళ్లు తుడుచుకుని - "విశాలా.... భవాని బాధలు నే నెరిగినవేనే? ఆ అత్తతల్లి నాకు అత్తగారే!- నేను ఈ మేనరికం వద్దని ఏడ్చేనమ్మా!- ఆడదాని మాటకి విలువనియ్యడం అనే ఆ మంచిరోజులు అప్పుడే

వస్తాయా?- నామాట కాదని....గడ్డిపోచకంటే విలువలేనట్టు- మీ మామయ్య - అమ్మాయిని వాళ్ళచేతుల్లో పెట్టేరు!- ఆనాడే భవాని జీవితం ఆరళ్ళపాలైపోయింది!- దాని కన్నీళ్లు నాకన్నీళ్ళు....ఒకళ్ళకొకళ్ళం తుడుచుకుంటు .... సాధ్యమైనంత వరకు గుట్టుగ - మీమామయ్యకి తెలియనీయకుండా .... ఓదార్చుకుంటున్నాం!- లేకపోతే - మీ మామయ్య ఒంటి కాలిమీద - అక్కయ్యమీద యుద్ధానికి వెళ్లి .... మరొక నాల్గు సమిధలు అంటించి .... దాని అత్తారింట్లో దానిస్థానం మరీ గడ్డుగచేసి వస్తారు!- వాళ్ళ మామగారసలే కోపదారి మనిషి!- ఏ అల్లరి జరిగినా అమ్మాయిని అసలేపంపరు! ఆ కాస్త పుట్టింటి ఆశకూడా లేకుండా అవుతుంది, దానికి!- మీ మామయ్య ఏమో పట్టుదల మనిషి!- పిల్లని బాధలు పెట్టే....కాపరానికే ముప్పుతెస్తారు!- విడాకులు - కోర్టులు అంటు అమ్మాయికి ఆస్తిలో వాటావచ్చేటట్టు చేస్తానంటారు తప్ప - ఆడదానికి ఆస్థేనా కావలిసింది?!- ఇన్నాళ్ళ సంసారంలో - ఆ మొగుడితోటి అనుభవాలన్నీ చెరిపేసుకోడమేనా?- ఇక జన్మంతా - అలా మొండిగ బతికటమేనా?! ఈ ఉపద్రవాలన్నీ తెలుసుకాబట్టే - నోరు మూసుకుని మూగబాధ అనుభవిస్తున్నాం!- కానీ - అమ్మాయికి అంత జబ్బు చేస్తే....ఒక్క ఉత్తరంముక్కైనా రాయలేదువాళ్ళు- ఇంటికి వచ్చాక - మూసి చిక్కిపోయిందని .... నల్లబడిందని అనుకున్నానే గాని - కన్నకుమారుడు - మంచమెక్కి - ఇంటికివచ్చిందని తెలియలేదు!- పోనీ అదేనా ఇన్నాళ్ళు - నాకు చెప్పలేదు!- దాని అత్తవారూ రాయలేదు!- బతికి

వుండి నేను కన్నతల్లిగ ఏంచేయలేక పోతున్నానని ఏడుస్తున్నా నమ్మా! చేతనైనపని ఇదొక్కటే!!-" అని కళ్ళొత్తుకుంది!-
"ఊరుకో అమ్మా! ఇప్పుడు హాయిగ వున్నానుకదా?-ఇవ్వన్నీ నాన్నగారికిచెప్పి గొడవచేయకు!- చెల్లాయిలకి - తమ్ముళ్ళకి కూడా చెప్పకు!- వాళ్ళంతా తొందర మనుష్యులు!- నేనసలు నోరుజారేను!- ఇదిగో ఈ విశాలవద్ను, బెంగలు, చూసి - ఆగలేక - తొందరపడి అన్నీ చెప్పాను .... కష్టాలు అందరికీ వుంటాయి! అయితే అన్నీ తెలో రకం! ప్రతి మనిషికి ఏదో బాధ లేకుండా ఎవరున్నారూ?- పదండి మనం ఇలానిల్చుని ఏడుస్తూ చెప్పుకుంటుంటే - ఎవరైనా చూసినా బాగుండదు. శ్రీదేవి, మాలతి లేచేస్తారు .... పద! అలా కూర్చుని వేరే ఏమైనా చెప్పుకుందాం!-" అంటూ భవాని- వరండాలోకి నడిచింది - విశాల అత్తయ్యచేయి నిముగుతూ వుంటే-" వెళ్ళమ్మా అలా కూర్చోండి - కాస్త కాఫీచేసి తెస్తాను!- "అనేసి ఇంట్లోకి వెళ్ళింది!- కాఫీలు తాగుతు ముగ్గురు....కూర్చున్నప్పుడు .... విశాల, మధ్యాహ్నం తను ఇంటినుంచి వస్తున్నప్పుడు - ఆవిడెవరో అన్నమాటలు చెప్తూనవ్వింది!-

సరిగ్గా, ఆ సమయంలో శ్రీదేవి లేచివచ్చి- "అయ్యో మీరప్పుడే కాఫీలు తాగుతున్నారా? మమ్మల్ని లేపకూడ దరా? "అంటూ-" ఏమిటే విశాలా ఏదో చెప్తున్నావ్?- మీబామ్మ లేనుకదా అని అందరునిన్ను .... హేలిక చేస్తు న్నారా?- నోరుమూసుకుని కూర్చోకే మొద్దా?- డొక్క

చీల్చేస్తానని చెప్పు!-" అనిఆవలిస్తు చీరకుచ్చెళ్లు సరిచేసుకుని బాబు పక్కనే చాపమీద కూర్చుంది!-

"ఎవరూ? నువ్వా? వాళ్ళడొక్క చీలుస్తానని చెప్పాలా?-" అని భవాని నవ్వింది.

"దానికి చేతకాకపోతే నేనే చేస్తానాపని!-"

"సరేలే -మీవారు పరిగెత్తుకొచ్చి లాక్కెళ్ళరూ?" అంది విశాల.

"అంతా ఆయనిష్టమే?-"

"ఊహూ కొన్ని నీ ఇష్టాలున్నా యన్నమాట!?"

"ఆహా!- అందుకే మాఇంట్లో నేను అనదల్చు కున్నది....చేయదల్చుకున్నది జంకుగొంకు లేకుండా చేసే స్తాను!- ఆ తర్వాత ఏంజరిగినా నాకేం బాధలేదు!-"

"మరి మీఆయన ఊరుకుంటాడే?-" అని తల్లి అడిగే సరికి- "ఎందుకు ఊరుకోరమ్మా?- ఒకవేళ నచ్చదనుకో... నాకు నచ్చచెప్పటానికి తంటాలు పడతారు - కోపం వస్తుం దనుకో....కాస్సేపు బిగదీసుకుని అలిగి కూర్చుని - మళ్ళీనేను ఏకాఫీయో తీసుకెళ్ళే సరికి - కోపంసంగతి మర్చిపోతారు!-" అని శ్రీదేవి చెప్తుంటే - జానకమ్మ ఆశ్చర్యంగ - భవాని గమ్మత్తుగ - విశాల వింతగ చూస్తూవిన్నారు!

"అవునూ? ఇంతకీ నాకు కాఫీఏదీ?-" అనటంతో జానకమ్మలేచి లో పలికి వెళ్ళింది!- ఇంతలో మాలతికూడా లేచి రావడంతో కబుర్లు గొడవలు ఎక్కువై - పాపబాబు నిద్రల్లోంచి లేచారు!—

సాయంత్రం వరకు కులాసాగా కాలక్షేపం చేసి - అప్పుడు ఇల్లు గుర్తు వచ్చిన దానిలా హడావిడిగ లేచి-ఇంటికి బయల్దేరింది విశాల!

# 5

పరాంకుశంగారికి ఆరోగ్యం బాగుండటం లేదని, ప్రభాకరం హైద్రాబాదునుంచి వచ్చాడు. తనతో కూడా హైద్రాబాదు తీసుకెళుతానని అంటే....పరాంకుశంగారు.... ఒప్పుకోలేదు! నాకిక్కడ చాలాపనులున్నాయి - అదీకాక స్వంతఊరు వదలి నేనెక్కడికీ రాను. నువ్వేకొన్నాళ్ళు సెలవు పెట్టి ఇక్కడవుండి నాకువైద్యం చేయమన్నారు!-ప్రభాకరం ఆ ప్రకారమే ఒక నెలరోజులు సెలవుపెట్టి - ఇంట్లోవు న్నాడు!- అతను వచ్చిన వారంరోజులకే ఎదురింట్లో మున లమ్మ పై లోకాలకెళ్ళింది! - ఈ పదిరోజులనుంచీ-ఆఇంట్లో హడావిడి, ఆర్భాటాలు చూస్తూనేవున్నాడు!—

సాయంకాలం డాబాఎక్కి పచార్లుచేస్తు నవల ఏదో చదువుకుంటున్నాడు!- దూరంగ వీధిమలుపు తిరిగి వస్తున్న విశాల కన్పించింది! పుస్తకంమూసి పిట్టగోడ దగ్గరనుంచి చూస్తున్నాడు!—

తలదించుకుని ... గబగబా వస్తున్నవిశాల ఇల్లు సమీపించగానే - తలఎత్తి మెట్లు ఎక్కబోయింది.

"ఆగు!-" అని గర్జించేడు పెద్దబాబయ్య.

హఠాత్తుగ అడుగునిలిపి ఆగిపోయింది విశాల.

"ఎప్పుడు వెళ్ళేవు? ఎక్కడికి వెళ్ళేవు?- ఏంచేసేవ్ ?-"

ఒకనిముషం బాబయ్య ముఖంలోకిచూచి తలవంచు కుని - "ఎప్పుడూ ఎక్కడికి వెళ్ళి ఏంచేస్తానో అదే చెసేను!" అన్నది.

"నోరుముయ్యి!- ఒళ్ళు దగ్గరపెట్టుకుని మాట్లాడు - ఇన్నాళ్ళలా ఇకమీాదట సాగదు!- ఆ ముసలావిడ ముఖం చూసి ఊరుకున్నానుగానీ - నీతిరుగుళ్ళకి అర్థం వుందా?!- ముండమోపి లక్షణాలేంలేవు!- అన్నీ జులాయి తిరుగుళ్ళే- చిన్నప్పట్నుంచీ నీకాలు ఇంట్లో నిలవగ నేనుచూడలేదు. అన్నయ్య కూతురుగదాఅని ఇంతకాలం సహించేను- వాడి దారినవాడు పోయేడు!....మీాఅమ్మ ముందే వెళ్ళిపోయింది!- నీ బ్రతుకుభారం మామీాదపడి నానాబాధలు పడుతున్నాం, నేనూ చిన్నబాబాయ్!- ఇదే మాపిల్లైతే - నరికి పోగు లెట్టును!- అచ్చుబోసిన ఆంబోతులా మధ్యాహ్నం ఎండలో- ఆవరుసన పోయి ఇప్పుడా రావటం?- ఇంటినిండా ఈవరుస చుట్టాలుంటే -పరాయి ఇంటనువ్వు పెత్తనాలకి పోతావా?- ఎంత నామోషీగా వుంది మాకు?- నిన్ను అడుగడుగున కనిపెట్టుకుని కూర్చోవాలా? చిన్ననాడు మీానాన్న ఆపెళ్ళి చేయకపోయినా బాగుండేది!- వాడుకాస్తా చచ్చి ... నువ్వు మాప్రాణానికి- చుట్టుకున్నావ్! లేకపోతేఏ వెధవకో అంటగట్టి నిన్ను అత్తారింట్లో పారేద్దును!- ఆదారీలేకుండా అయింది!- ఇకమీాదట ఇల్లుకదిలి బయటికి అడుగుపెట్టావంటే - మళ్ళీ ఈ ఇంట్లో కాలుపెట్టడానికి వీలుండదు జాగ్రత్త!- "ఏక బిగిని దులపరించేస్తూవుంటే ... ఇంట్లో అందరూ వేడుక

చూస్తున్నట్టు వరండాలోకి వచ్చారు. పిల్లలందరు నిల్చొని వుంటే.... పెద్దవాళ్లు తలొకమాటా విసురుతూ.... "అమ్మా వయస్సుపిల్ల ఇలాగేనా వుండటం?- రేపేదైనా జరిగితే...."- ఆవిడ మాటని మధ్యలోనే అందుకుని

"ఎందుకు జరగదూ?-మధ్యాహ్నం ఆపిల్ల.... ఎలాంటి సమాధానం చెప్పిందో తెలుసా? 'తనని అందరూ చచ్చిన దానిలా చూస్తున్నారు! వంశానికి ఏం ప్రతిష్ఠ మిగిలింది?'- అంది - కనుక ప్రతిష్ఠ తెచ్చే పనేదైనా చేసే తీరుతుంది!- అమ్మో నా కూతురు లాంటిదని ఏదో హితవు చెప్పబోయేను కానీ....అదెక్కడః-" అంటూ మధ్యాహ్నం విశాలని అడ్డుకున్న పెద్దముత్తైదువు చేతులు ఝాడించేసింది!- అసలు ఈ దాడికి సూత్రధారిణి ఆవిడే!-

"ఆ, ఆ, ఇలాంటి వాళ్లు అంతకన్నా ఏంచేస్తారు!-" అని ఒకావిడ దీర్ఘంతీసింది!- చిన్నబాబాయి వచ్చి .... ఏదో నల్లురితో బాటు తనూ ఓతిట్టు తిట్టేసి....ఇకనుంచీ ఇంటిపట్టున వుండటం నేర్చుకోవే - ఇక ఇంట్లోకి ఫో....మీ పిన్నేదో పనికోసం పిల్చింది, ఇందాకా .... వెళ్ళు! వెళ్ళి ఆపనేదో చెయ్యి!-" అని దయతో కూడినతీర్పు వినిపించేడు, విశాలకి, కాళ్ళక్రింద భూమి దిగబడి .... అందులో తను కూరుకుపోయి మళ్ళీ భూమి మామూలుగ అయిపోతే బాగుండునని పించింది!- గుండెఇంకా కొట్టుకుంటూనేవుందేం? అను కుంది!- చెవులు....కళ్ళుల పనిచెయ్యకుండా వుంటేనో అను కుంది! ఇంకా చాలా అనుకుంది!- కానీ ఏదీ జరగలేదు!-

"నడు లోపలికి, ఎందుకా నిలబడటం?'' అని పెద్ద పిన్నివచ్చి అరిస్తే - బొమ్మలా కదిలి ఇంట్లోకి వెళ్ళింది!-

ఎదురు డాబామీద నిల్చుని చూస్తున్న ప్రభాకరం గుప్పెళ్లు బిగించి....పళ్లుపిండుకున్నాడు!- విశాలని తన చిన్నప్పట్నుంచీ ఎరుగును!- ఆ అమ్మాయి ప్రవర్తన ఎలాంటిదో తెలుసు!- కేవలం ఆమె బాల్యవితంతువు కావడంచేత .... నిందలు వేస్తున్నారే తప్ప కారణమేమీ కనిపించదు-

అభిమానవతి....పౌరుష వంతురాలైన పిల్ల .... ఆత్మహత్య చేసుకుందుకు ఎ తపదును మాటలు వాడాలో .... అవన్నీ ఇప్పుడువాళ్లు ఉపయోగించేరు!- డాక్టర్లు మనిషి రోగాల్ని కుదిర్చి....బలికట్టానికి .... శాయశక్తులా....ప్రయత్నిస్తారు! ఈరాక్షసులు - లేనినిందలు ఆపాదించి .... మనిషిని అవమాన భారంతో .... క్రుంగి చచ్చిపోయేటట్టు చేస్తున్నారు!- కళ్ళతో చూస్తూ .... చెవులతో వింటూ నేనెలా వూరుకోగలనూ? ఈరోజు విశాల మనస్సు ఎంతలా దుఃఖిస్తుందో....ఆదుఃఖంలో ఏంచేస్తుందో-ఊహించడం కష్టం ——

'ఛ! ఛ! ఆ అమ్మాయి జీవితం ఏంకాబోతుందీ?-' ప్రభాకరం ఆందోళనగ .... ఆవేదనతో పచార్లు చేస్తూనే వున్నాడు .... క్రమంగా చీకటిపడింది - దీపాలు వెలిగాయి! ప్రభాకరం ఓదృఢ నిశ్చయంతో .... ఎడంచేతిలో కుడిచేతి పిడికిలి ఆనించి .... సాలోచనగ తలపంకించి - డాబాదిగేడు!-

ం ం ం

రాత్రి చాలా గడిచిపోయింది! మారంగ రైలుస్టేషన్‌లో .... రాత్రి రెండుగంటలరైలు రావడానికి గంట

కొట్టారు!- ఒక గంట తరువాత - అగ్రైలువచ్చి వెళ్ళడం.... ప్రయాణీకుల హడావిడి తగ్గడం .... మళ్ళీ ఊరంతా ప్రశాంతంగవుంది!—

తలనిండా....కొంగుచుట్టుకుని... ఊరికి చివరగ మామిడి తోటవైపుగ ఓ మానవాకారంచాలాతొందర తొందరగ.... వెళ్లుతోంది .... ఆమె విశాల పెద్దచెరువువైపు వెళ్తోంది!- రెండుమెట్లు దిగి రెండుచేతులూ జోడించి .... మౌనంగా నిల బడి- మెల్లగ మూడోమెట్టుమీద కాలు పెట్టబోతూ వుండగ- వెనకనుంచి ప్రభాకరం - విశాల భుజం పట్టుకున్నాడు!—

కెవ్వున అరవబోయి - అరుపు సరిగా రాక భయంతో వణికి వెనక్కి చూసింది!- చీకట్లో సరిగా తెలియక - "బాబాయ్"- అంది గుండెలదురుతు.

"కాదు....నేను విశాలా....ప్రభాకరాన్ని!-" అన్నాడు డాక్టర్ ప్రభాకరం.

"ఎవరూ? ప్రభాకరం?!! మీరు .... మీరు ఇక్కడికి ఎందుకుః!- నన్నెందుకు పట్టుకున్నారూ?"- గొంతు తడారి పోతూవుంటే ... నాలుక పిడచకట్టుకుపోతూ .... స్పృహతప్పు తున్నట్టు .... జారిపడవబోయింది!—

ప్రభాకరం .... విశాలని గట్టిగ పట్టుకుని ....మెట్లపైకి తీసుకొచ్చి కూర్చోబెట్టేడు. గబగబా దోసెడు నీళ్లుతీసికొచ్చి ముఖానికి కొట్టి - పక్కనే కూర్చుని "విశాలా భయపడకు!- నేను నీకు స్నేహపాత్రుణ్ణి - చెడువు చేసేవాణ్ణికాదు'- చచ్చి

పోదామని వచ్చావుగానీ - చచ్చి సాధించేది ఏమిటీ?- అయినా ఆత్మహత్య పిరికివాళ్ళు చేసుకోవాలి! నువ్వా?-" లాలనగ వీపు నిమిరేడు—

విశాల విచిత్రంగా చూసింది!—

"ఇవన్నీ మీకెలా తెలుసు?"- అనిమాత్రం అనగల్గింది!- ఎన్నో అడగాలనుకున్నా పెదవులు వణుకుతున్నాయి....నాలిక మొద్దుబారి పోయినట్లైంది!- భయంతో మనిషినిర్జీవంగ అయిపోయింది!—

ప్రభాకరం చిన్నగ నవ్వి- "నాకన్నీ తెలుసు విశాలా! నేను బుద్దెరిగి నప్పటినుంచీ - నిన్ను చూస్తూనే వున్నాను గదా!- నీ జీవితం ఎంత ముళ్ళపొదలా తయారైందో - నువ్వు ఆ ముళ్ళల్లో ఎలానలిగిపోతున్నావో....నాకు తెలుసు! - తెలుసుండీ ఏంచేయలేని పరిస్థితి నాది!- ఏవిధంగ నీకు సహాయం చేయగలను?- అందుకే అన్నీ చూస్తూ, వింటూ, మూగంగ నిలబడిపోయేను!- ఈరోజుకుండా సాయంత్రం .... మీవాళ్ళంతా నీమీద రాక్షసమూకలా, మూకవుమ్మడిగా విరుచుకుపడ్డం చూసేను. వాళ్ళన్న మాటలు విన్నాను!- నాకు నిలువెల్లా .... పొంగిన కోపాన్ని ఎలా నిగ్రహించుకున్నానో....నాకే తెలియదు! అయితే ఎప్పటిలా ఈరోజు సహించుకుని ఊరుకోలేక పోయాను!- నువ్విలాంటిప్రయత్నం ఏదో చేస్తావనే ఊహించాను!- అందుకే ఈ రాత్రి నిద్ర పోకుండా డాబామీదే- మీ ఇంటికి కాపుకాస్తూ చూస్తూన్నాను - నువ్వు మీసందులోనుంచి రావడం గమనించి

డాబాదిగి నిన్ను వెంబడిస్తూ వచ్చాను....నా ఊహ సరియైనదే!- లేకపోతే ఈపాటికి ఓ నిండు ప్రాణం....నీళ్ళపాలయ్యేది!-

అప్పటికి కాస్త తేరుకోగల్గిన విశాల- "అదిసరే! నాగురించి మీకెందుకు ఇంతశ్రద్ధ?!- నేను బతికి బాగుపడే దేమున్నదీ?!- చచ్చిపోతే ఎవరికి నష్టం? అనవసరంగ నామీద మీరు నిగ్రహం వేసి - నాప్రయత్నాన్ని ఆపి-ఇప్పుడు త్రిశంకుస్వర్గం చేసేరు నాజీవితం!- మళ్ళీ ఇంటికి వెళితే ఎవరైనా చూస్తే .... లేస్తే .... నడిరోడ్డుమీద కుక్క-కన్నా హీనంగా తరిమి....వెళ్ళగొట్టారు! ....నేనిక ఎలా బతకాలి?-" అంటూ రెండుచేతుల్లో ముఖం పెట్టుకుని - పెల్లుబుకిన దుఃఖాన్ని బిగిపట్టుకుంటు కూర్చుంది.

"బాధపడకు విశాలా!- వాళ్ళని గురించి నువ్వు భయపడాల్సిన పనిలేదు!- డాక్టర్ గనేను నాబాధ్యత నెర వేర్చుకోవాలను కున్నాను!- నెరవేర్చాను. ఒకమనిషి ఆత్మ హత్యా ప్రయత్నం చేస్తుందని ఊహించి....అదినిజం కాబో తున్నప్పుడు కూడా....చూస్తూ వూరుకోగలనా?- సాటిమనిషి ఎవరైనా వూరుకోలేరు!- ఆమాటకొస్తే - మీ శాబాయి లైనా వూరుకోరు!- రక్షించి....మళ్ళీ జీవితాంతం శిక్షిస్తూ వుంటారు!- ఒకవేళ నువ్వు వాళ్ళు చూడకుండా ఏదైనా చేస్తే ....అది వేరేసంగతి'- నేను .... రోజు ఎన్నో కేసులు చూస్తాను. ప్రతివాళ్ళకీ ధైర్యం చెప్పి బాధావిముక్తుల్ని చేసి .... మృత్యు ముఖంలో వాళ్ళనికూడా .... బయటికి లాక్కు-రావటానికి ....అహోరాత్రులు పోరాడుతాను -అది నా వృత్తి ధర్మం!!- ఇది నా మానవతా ధర్మం! ఒక

స్త్రీ .... ఏ తప్పు చేయకుండా....శిక్ష అనుభవిస్తు .... ఆఖరికి ఆత్మహత్యకి కూడా సిద్ధపడిందంటే-ఆ ఇల్లు -ఆ మనుష్యులు-రాక్షసులు!- నేను సాక్ష్యం నిలబడి - కేసు పెట్టగలను -కానీ మళ్ళీ నీస్థానం ఏమిటీ?- నీకు జరిగే మేలు ఏమిటీ?!- అందుకే అలా చేయదల్చుకోలేదు!- నువ్వు ఇప్పుడు ఇంటికి వెళ్ళ నవసరం లేదు! ఎటూ ఇల్లువిడిచి బయటికి వచ్చావు!-అదృష్టవశాత్తు బ్రతికేవు!- లేకపోతే....

"హాయిగ చచ్చి వుండేదాన్ని!-" అంది తలెత్తి చూసి.—

నవ్వాడు ప్రభాకరం- ఇప్పుడూ అంతే అనుకో( విశాల లేదు చచ్చిపోయింది!-"

"బాగుంది - రాయిలా కనబడుతూవుంటే ఇంకెలా అనుకుంటారు?"—

"అదే చెప్తున్నది!-" అని ఆగి- "విశాలా - ఈనరక జీవితానికి ఈరోజుతో స్వస్తిచెప్పే!యి- ఇంకో గంటలో హైద్రాబాదు వెళ్ళే బండివుంది! స్టేషన్‌కి తీసుకెళుతాను, టికెట్ కొని ఇస్తాను. తిన్నగా హైద్రాబాదు వెళ్ళి -నాఅడ్రస్ కాగితంతో నాఇంటికి వెళ్ళు-నేనునీకు దగ్గర బంధువునని .... నర్సుట్రైనింగ్‌కి వచ్చావనీ - నిన్ను నేనే పంపించాననీ చెప్పు!- నేను పదిహేనురోజుల్లో వస్తాను - నువ్వు నేను వచ్చేవరకు నాఇంట్లో నిరభ్యంతరంగ వుండవచ్చును. తరువాత - నేను వచ్చాక నిన్ను హాస్టల్‌లో చేర్చి ట్రైనింగ్‌లో చేర్పిస్తాను. రెండేళ్ళు నువ్వు శ్రమపడితే - నీజీవితానికో

అర్థం....పరమార్థం కనిపిస్తాయి!- చెప్పు ఆదారి మంచిదా!- లేక ఇలా అనామకమైన జీవితంలా ముగించుకుంటావా?- ఆలోచించు విశాలా? ఎంతోమంది అభాగ్యులు అనాథలు.... రోగపీడితులు....చేయూతలేక అల్లాడి పోతున్నారు! వారికి సేవచేసి - ధైర్యం చెప్పి .... జాలి కరుణ చూపించలేవా?!- ఇంతకాలం ఇక్కడ నిరర్థకమైన చాకిరీలు చేసేవు; దానివల్ల కించెత్తైనా నీకు ఆనందంగానీ .... మెప్పుగానీ లభించేయా?!- న్యాయంగ నీకు రావాల్సిన ఆస్థికూడా .... వాళ్ళు ఇచ్చేట్టు లేరని .... మా అమ్మ చెప్పింది!- పోనీయ్ వెధవాస్థి! ఇక ముందు - ఓ చక్కనిబాట....అందరి మెప్పులు పొందుతూ- దీనజనుల సేవచేస్తూ .... వాళ్ళు కృతజ్ఞతా భావంతో చూస్తుంటే-నీకెంత తృప్తి? ఎంతహాయి?- అలా ఆదారిలో నడిచి వెళుతూవుంటే . దూరంగ వెలుగు .... తూర్పున భానోదయ సమయాన కనిపించే వెలుగు .... కన్పిస్తున్నట్టుండదూ?- చెప్పు విశాల ? ఆజీవితం నీకొద్దా?- పోనీయ్ ఆజీవితం కాకపోతే....ఏ సెంటర్లోనో అంటే(స్త్రీ) జనాభ్యుదయా నిలయాల్లో .... చేర్పిస్తాను. నీకు నచ్చినవిద్య నేర్చుకుని....నీకాళ్ళమీద నువ్వు నిలబడవచ్చును!- ఏమంటావ్? అది వద్దంటావా!- ఇలాగే ఈ నీళ్ళల్లో మునిగి చచ్చిపోతావా?- అయితే నేను వెళ్ళిపోతాను" .... అని లేచేడు!—

"ఆగండి!-" అని తనూలేచి నిలబడింది!-

ఒకవేళ బాబాయిలికి తెలిసి హైదాబాదు వచ్చి అల్లరిచేస్తే...."అని సంశయిస్తున్న విశాలనుచూసి "పిచ్చి అమ్మాయి! నీవు మైనార్టీతీరిన పిల్లవి! నీఇష్టంలేకుండా నిన్ను

వ్వరూ దేనికీ బలవంతం చెయలేరు!- అయినా నువ్వు ఇప్పుడు విశాలవికాదు - సుశీలవి!!- ఇకమీద ఆ పేరుతోనే జీవించాలి!- అని భుజంపై చేయి వేయబోయి ఆగి- "నడుత్వరగా స్టేషన్ చేరేలోపులో ఎవరూ చూడకూడదు"- అని త్వరగా మెట్లు ఎక్కి- గట్టుమీదకి నడిచేడు .... అప్రయత్నంగానే అయినా మనస్ఫూర్తిగానే విశాలకూడా గట్టుమీదకి నడిచింది!-

స్టేషన్‌లో రైలు వచ్చేవరకు - నిద్రగన్నేరు చెట్టు నీడలో నిల్చోబెట్టి - టికెట్‌తో పాటు కొంతడబ్బు ....కొన్ని జాగ్రత్తలు చెప్పి .... రైలు రాగానే కూర్చోబెట్టి - మరొకసారి విషయాలన్నీ హెచ్చరించి - రైలు కదలగానే ... "జాగ్రత్త సుశీలా! నేను చెప్పినట్టు చేస్తావు గదూ?"- అన్నాడు...

"అలాగే" అన్నట్టుగ తలవూపింది - విశాల కాదు సుశీల!! రైలు తూర్పుదిక్కుగ కదిలింది! తెల్లవారుతూనే ఆవీధంతా గగ్గోలు మన్నది!

'విశాల లేచిపోయింది!'

'మాయదారి కాలం! మాయదారి బుద్ధులు!!'

'నేనప్పుడే అనుకున్నాను - దాని గుణాలలాంటివే!'

'వయఃసుపొంగు అలాంటిది! ఆ తర్వాతకుక్కబ్రతుకైపోతుంది!'

'అయ్యో! ఈ అప్రతిష్ట ఎలాభరించను బాబో'- 'నాపిల్లలకి పెళ్ళిళ్ళేలా అవుతాయిరో?' రకరకాల ఏడ్పు

లతో - తిట్లతో - దీర్ఘాలతో - తలొకరకంగా నోరు పారే సుకుంటున్నారు!-

బాబాయిలిద్దరూ....బావులు చెరువులు....రైలుకట్టలు దిగుడుబావులు....ముళ్ళపొదలు.... వెదుకుతున్నారు....ఒకవేళ నిన్న సాయంకాలం అన్న మాటలకి అభిమానపడి ఏ ప్రాణ త్యాగమో చేసిందని ... ఎంతైనా రక్తస్పర్శ! అన్న కూతురు!!—

ఇంటిల్లిపాది - ఇంటిముందు ఓతీర్థం జరుగుతున్నంత ఆర్భాటం .... చేస్తున్నారు - పిన్నమ్మల తల్లులు మాత్రం - 'ఆస్థి కలిసింది, ఏ గొడవాలేకుండా' అని చెవులుకొరుక్కుం టున్నారు!—

నారాయణరావుగారింట్లో - ఈవార్త తెలియగానే- జానకమ్మ, భవానీ - 'అయ్యో విశాల ఎంతపనిచేసేవే పిచ్చి తల్లీ! చచ్చిపోయావా?-' అని ఏడ్చేరు. వాళ్ళకి క్రితంరోజు మధ్యాహ్నం సంగతి అంతా గుర్తుకొచ్చింది!—

శ్రీదేవి, మాలతి మటుకు- 'పిచ్చిమొద్దు - ఆస్థి రాబట్టుకుని హాయిగ వుండక ఇలా ఎక్కడకి పోయిందో?' అనుకున్నారు!—

నారాయణరావుగారు - ఆ విశాల అలాంటి పని చెయ్యదు. చచ్చిపోయే వుంటుందనుకుని - బాబాయిలతో పాటు వెదకటానికి బయల్దేరేరు!—

రామం, ప్రకాశం .... నిశబ్దంగ ఆలోచిస్తూ కూర్చు న్నారు!-

ఆరోజు ఎవరింట్లో భోజనాలు చేయలేదు - చాటుగ టిఫెన్లు తిన్నారు, పిన్నమ్మల చుట్టాలు!—

ప్రభాకరం తల్లీ - తండ్రీ- 'పాపం! ఆపిల్ల ఎప్పుడూ చాకిరీలతో సతమతమయ్యింది। పోనీ ఈవిధంగానైనా సుఖ పడింది।-' అనుకున్నారు.

డాక్టర్ గారు భావగర్భితమైన చిరునవ్వొకటి చిలికించి నిమ్మకి నీరెత్తినట్టు కూర్చున్నారు!—

మర్నాటికి అది పాతబడిపోయింది! మూడోరోజుకి అలవాటైపోయింది!- పదిహేనురోజుల తర్వాత ప్రభాకరం ఊరికి వెళ్లేరోజు....అసలు విశాలవిషయం ఎవరూ మాట్లాడు కోటంలేదు!- ఎక్కడో ఏందులోనోపడి చచ్చిందనుకున్నారు!!

కానీ జానకమ్మగారింట్లో .... ఆవిడా కూతుళ్ళు .... ప్రతిపూటా విశాలని తల్చుకుని - కన్నీరు పెట్టున్నారన్న సంగతి ప్రభాకరానికి తెలియదు।—

# 7

యాంత్రికంగ పనులు చేస్తున్నా.... జానకమ్మగారిలో మునపటి ఉత్సాహం .... సంతోషంలేవు! కన్నప్రేమ కంటే పెంచినప్రేమ ఎక్కువ! విశాలని చిన్నప్పట్నుంచీ తన పిల్లలతోపాటు చూసింది!- ఆపిల్ల ఆటపాటలు .... ముద్దు ముచ్చట్లు - 'తల్లిలేకపోడంచేత .... పిన్నమ్మలు .... గంపెడు సంతానంతో విసిగివుండటంచేత'-ఎవరూ పట్టించుకోనేలేదు. జానకమ్మగారు ఒక్కొక్కరోజు విశాలని తమఇంటికి తీసు

కెళ్ళి...శ్రీదేవితోపాటు అన్నంకలిపి పెట్టి...నిద్రవచ్చేది!- ఒకటి రెండు రోజులు అక్కడే వుంచేసుకుని .... తండ్రివచ్చి అడిగినప్పుడు పంపించేది!-

నిన్న మొన్నటి వరకు తమపిల్లలతో .... నట్టింట నవ్వుతూ తుళ్ళుతు తిరిగినపిల్ల....ఈరోజు లేదు!- కనీసం.... శవమైనా దొరకలేదు!- 'అమ్మావిశాలా .... దిక్కుమాలిన దానవై ఈసంఘం కట్టుబాట్లకి బలైపోయావా తల్లీ!- అని ఏడ్చింది!- అలా ఏడుస్తున్న జానకమ్మకి ఓ అనుమానం కల్గింది!- బాధలు ఎక్కువైతే మనిషికి బ్రతుకుమీద నిరాశ కల్గి - అఘాయిత్యం చేస్తారుగదా?- విశాల చూపించిన ఈదారి - రేపు భవానికికూడా ఆధారం అవుతుందా?'- అని వణికిపోయింది. ఎవరూ చూడకుండా .... భవానిచేత 'ఎలాంటిపని చేయనని'- ఒట్టేయించుకుంది:- 'ఎందుకమ్మా భయం? నాకు ఇద్దరు పిల్లలున్నారు!- ప్రాణాధికులైన తల్లీ తండ్రీ తోబుట్టువులు వున్నారు!- ఆపైన నేను అభిమానించే భర్తవున్నారు!- ఇందర్ని వదిలి-వాళ్ళందరికీ దుఃఖం కల్గించి నేను ఎక్కడి వెళతానమ్మా?!- విశాల చేసిందిగదాఅని .... అందరూ ఆపని చేయగలరా?-' అని సమాధాన పర్చింది!-

'మళ్ళీ మరొక రకమైన బాధ!- అసలే జబ్బుపడి వచ్చింది; మళ్ళీ వెళ్ళగానే చాకిరీలు మొదలు!- కాస్త బాగా అన్నీ చేసి ఇప్పుడు పెట్టకపోతే బలంఏదీ?'- అనుకుని కాస్తశ్రద్ధగ మరికాసిన్ని పిండివంటలు చేసిపెట్టడం మొదలు పెట్టింది. 'పిచ్చిఅమ్మ - చావకుండా .... చచ్చేట్టు చాకిరీలు

చేస్తూ బతికివుండాలని .... ఎన్నేసి రకాల వంటలు చేసి పెడుతోందో?-' అనుకుని నవ్వుకుంది.

o o o

అంతర్యాలు తెలియనప్పుడు - అపార్థం చేసుకునే అవకాశంవుంది!-

శ్రీదేవివచ్చి నెల్లాళ్ళు కావస్తోంది!- భవానీ వచ్చేక నెలదాటి రెండోనెల గడుస్తోంది! 'తనూ అత్తింటికి పోవాల్సినపిల్లేగదా? అమ్మకి ఈ పక్షపాతం ఎందుకు?- భవాని అక్కయ్యకి - కొసరి కొసరి తినిపిస్తుంది! రాకరాక వస్తే మటుకు ఇంతఆపేక్ష....ఆదరణ చూపించాలా?- తనుమాత్రం కూతురుకాదా?- రమ్మని రాయగానే వచ్చేనని అలుసా?- ఛ! ఇంక ఉండకూడదు వెళ్ళిపోవాలి!- అనుకుంది.

శ్రీదేవి మనసులోకి ఓ రకమైన అభిప్రాయం చొరబడిందంటే - ఇంక దాన్ని అమలుపరచకుండా, ఆగదు!- అంతా తొందరపాటే !

ఉన్నట్టుండి ఓరోజు "నేను ఇంక వెళతానమ్మా!-" అంది.

"అదేమిటే శ్రీదేవి?. అతను రమ్మని రాయందే తొందర పడుతున్నావేం?"- అన్నారంతా.

"ఆయన రాతలూ ఏమిటీ? ఎన్నాళ్ళని పుట్టింట్లో వుంటాం....పరాయివాళ్ళం!" అంది! నిష్ఠూర్యం ధ్వనించే గొంతుతో!....

జానికమ్మ మనస్సు చివుక్కుమంది!-

"అదేమిటే? .... పరాయిదానివా నాకు?"- ఆవిడ గొంతుజీరబోయింది.

"ఒకయ్య చేతిలో పెట్టాక కారా?"

"అయితే మాత్రం...." అని ఇంకావదో అనబోయిన తల్లిని వారించి ..."ఆలెక్కన పెద్దక్కయ్య పరాయిదేకదా? పోనీ దానితోపాటు వెళుదుగానిలే!-" అంది మాలతి.

"అక్కయ్యతోపాటు నేనువచ్చానా? దాంతో వెళ్ళ డానికి? అయినా నేను వచ్చినప్పుడల్లా అది రాగల్గిందా?-" అని కోపంగచూసి 'అయినా మాలతీ నీకెందుకే?-" అంది.

మాలతి విసురుగలేచి వెళ్ళిపోయింది!

నారాయణరావుగారు కలగచేసుకుని.... "చూడమ్మా.... అతను మంచివాడు! హాయిగ నాల్గురోజులు ఉండి వెళ్ళినా ఏమనుకోడు - అదృష్టవంతురాలివి! అక్కయ్యతోపాటు వెళ్దుగానీ...." అని నచ్చచెప్పబోయేరు!-

"వద్దులెండినాన్నా! మావారి మంచితనాన్ని అలుసు చేసుకుని .... ఇక్కడవుండి నేను ఏంచేయాలి?- సరదాగా వుందామనుకుని వచ్చాను! ఆ విశాల ఆపనే చేయకపోతే- అనుకున్న దానికంటే బాగావున్నట్టే! కానీ మధ్యలో ఆ వెలితి ఒకటి మిగిలిపోయింది! ఇంకచాలు వెళ్ళిపోతాను .... టికెట్ కొని పంపించేయండి!-" అన్నది దృఢంగ!—

ఇంక అంతస్థిరంగ చెప్పాక -వినదని తెలిసింది. "సరే నీఇష్టం!" అన్నారు.

భవాని మౌనంగ వూరుకుంది - ఆమెకి తెలుసు! 'తల్లి తనమీద ప్రత్యేకమైన శ్రద్ధలు తీసుకుంటున్నందుకు .... శ్రీదేవి మనసు నొచ్చుకుని వుంటుంది!- నిజమే మరి!- పుట్టింటికి వచ్చిన ఇద్దరు కూతుళ్ళలో ఒకళ్ళకి బాగాఆదరణ జరిగితే రెండవ వారికి బాధనిపించదా?- అమ్మ ఎంతపొరపాటుచేసింది?- అసలు తను విశాలతో చెప్పినవన్నీ వినడం చేత....ఈ అనర్థకాలన్నీ జరిగేయి!- ప్చ్! తను బయలుదేరి వచ్చినవేళ మంచిదికాదు!- అనుకుంది.

మరునాడు శ్రీదేవి ప్రయాణమై....బండి ఎక్కబోయే ముందు - ఎవరూ గమనించకుండా భవాని ఓ చిన్నచీటి తీసుకుని - నాల్గుపంక్తులురాసి .... శ్రీదేవి చేతిలో కుక్కి - "ఇంటికి వెళ్ళాక చదువుకో....ఇక్కడవద్దు-!" అని చెప్పింది. హేండ్ బేగ్ లో పడేసుకుని .... బండి ఎక్కింది శ్రీదేవి!

జానకమ్మ - కళ్ళొత్తుకుని- "వెళ్ళగానే ఉత్తరం రాయవే" .... అంది

భవాని పాప బాబు .... మాలతి అందరు శ్రీదేవిని బండి ఎక్కించి ఇంట్లోకి వెళ్ళారు.... "ఏమిటో తిక్కపిల్ల!-" అని గొణుక్కుంది జానకమ్మ. ప్లాటుఫారం దాటినరైలు .... క్రమంగ ఊరునుదాటి వేగాన్ని పుంజుకుంది! నారాయణ రావుగారు .... రామం .... నిట్టూర్చి "మొదటినుంచీ దీని స్వభావమేఇంత!" అని సరిపెట్టుకుని - వెనక్కి తిరిగేరు.

రైలు కిటికీలోనుంచి, కనిపించినంతవరకు తండ్రిని తమ్ముణ్ణిచూసి 'తొందర పడ్డానా'?- అనుకుంది శ్రీదేవి!

'అక్కయ్యమీద అనవసరంగ కోప్పడ్డానా' అనికూడా బాధ పడింది! 'అమ్మని పొరపాటుగ అర్థం చేసుకున్నానా? అనీ ఫీలైంది!——

ఎన్ని అనుకున్నా .... రైలు వెనక్కి తిరగదు! అది మానవ స్వభావం లాంటిదికాదు!! స్థిరనిశ్చయం కలవాడి గమనంలాగ .... గమ్యం చేరేదాకా ఆగదు!!!.... వేగంగ ముందుకు దూసుకుపోతున్న రైలులోనుంచి చూస్తున్న శ్రీదేవి కంట్లో బొగ్గు నలుసుపడింది!- లోపలికి తలతప్పుకుని నలుపుకుని .... కర్చీఫ్‌కోసం హేండ్ బాగ్ తెరచి - భవానీ ఇచ్చిన చీటీతీసుకుంది. కన్నుబాగా తుడుచుకుని చీటీ చదవ బోయేసరికి - రెండుసీట్ల అవతల కూర్చున్న మంగతాయారు కనిపించింది!- గభాల్న చీటీ బేగ్‌లోపడేసి మామూలుగ కూర్చుంది:——

మంగతాయారు .... శ్రీదేవిని చూసి పలకరింపుగ నవ్వి - లేచిరాబోయింది. శ్రీదేవి వాళ్ళ త్తారింటికి దగ్గరలో ఉండే మంగతాయారు .... అసలు సిసలైన - అమ్మలక్క!- భుజానికి నాలుక వేలాడతీసుకుని - తిరుగుతుంది!-

ఆమనిషి ఇక్కడ తనతో ప్రయాణంలో కలవడం.... పైగా తనదగ్గరకి రావడం - బొత్తిగ ఇష్టంలేదు శ్రీదేవికి!- కానీ తప్పలేదు ——

ఆవిడ స్థూలకాయాన్ని లేవదీసుకుని .... దారిలో వాళ్ళని తొక్కుకుంటు .... వాళ్ళచేత తిట్లుతింటూ....ట్రంక్

పెట్టెలమీద పడబోయి నిలదొక్కుకుంటు - శ్రీదేవి సీటు చేరుకునేసరికి ఓసర్కస్ జరిగినంత పనైంది!-

శ్రీదేవి పక్కచోటు లేకపోయినా ఎలాగో వీలుచేసు కుని క్రిందవున్న పరుపుచుట్టమీద కూర్చుని- "ఫుట్టింటి నుంచేనా రావటం?- నేను మాబంధువుల ఇంటికి పెళ్ళికి వెళ్ళివస్తున్నాను! అవునుగానీ....నువ్వు ఇప్పుడప్పుడే రావనీ.... మీ అక్కయ్య పిల్లలు వచ్చారనీ .... చెప్పిందే మీఅత్త గారు. పాపం! మీ అక్కయ్య సంసారం అంత సుఖం లేదటగా? పుట్టింటికే పంపరటగా?-" ఆయాసపడుతూఆవిడ అడుగుతూవుంటే - శ్రీదేవి ఒకక్షణం తెల్లబోయి - తేరు కుంది. అరికాలిమంట నెత్తికెక్కింది!- అంతక్రితం ఏ అక్క గారైతే తను - ద్వేషంగ భావించిందో - ఆ అక్కని తన ఎదుట చులకన చేసి - మంగతాయారులాంటి పనిలేని అమ్మ లక్క - వివరాలడగటంతో ఒళ్ళు మండింది!—

"ఓహో! ఇవన్నీ మా అత్తగారు చెప్పారా మంగ మ్మగారూ?- ఇంకా ఏం చెప్పారూ? నేను ఇప్పుడే రావనీ ఆ రెల్లు వుంటాననీ కూడా చెప్పారా?- మా అమ్మమీద నాన్నమీద కూడా చెప్పారా?- అన్నట్టు మా చెల్లెల్ని గురించో?-" అని శ్రీదేవి అడిగేసరికి - మంగతాయారు తడ బడి - "అహహ, అబ్బే నేనూరుకే మీకోడలు 'పుట్టింటి కెళ్ళింది కాబోలు ఏమిటి విశేషం! అని అడిగితే ఆ రెండు ముక్కలు చెప్పిందమ్మా అంతే మరింకేం చెప్పలేదు.-" అంది

“చెప్తారు చెప్తారు! నోట్లో నాలుక వుందుకోని వాళ్ళం తాఏవో చెప్తూనేవుంటారు. నోట్లో నాలుకవున్నా లేన ట్టుండే-మా అక్క-లాంటివాళ్ళు-ఇదిగో ఇలా రైలుపెట్టెల్లో-నడిరోడ్లల్లో .... అందరి నోళ్ళల్లో నానుతూ వుంటారు! చెప్తా నుండండి - ఇంటికి వెళ్ళి అడుగుతాను!”-

“అయ్యో తల్లీ! ఏదో మాటవరుసకి చెప్పాను. నాకెందుకూ-అసలు మీఅత్తగారూ నేనూ ఎప్పుడో గానీ మాట్లాడుకోం! సరేలే - సామాను అక్కడుండి పోయిందమ్మా వస్తా”- అనిలేచి మళ్ళీ అందర్నీతో కుక్కుకుంటూ-కూర్చున్న వాళ్ళ ఒళ్ళోపడుతూ - వెళ్ళింది!-

శ్రీదేవి కోపంగ ముఖంతిప్పుకుని కిటికీవైపు తిరిగి కూర్చుంది.

o o o

సాయంత్రం .... ఆఫీసునుంచి ఇంటికి రాగానే ... గదిలో కనిపించిన శ్రీదేవినిచూసి - కళ్ళింతింత చేసుకుని .... ముప్పిరిగొన్న ఆశ్చర్యంతో చూసేడు, కృష్ణమూర్తి.

“అదేమిటీ దేవీ ఇంత అకస్మాత్తుగ సాక్షాత్కరించావ్?”- అన్నాడు-

రైలుదిగి వచ్చినప్పట్నుంచీ దాచుకున్న కోపం .... ఉక్రోషం .... ఎవరిమీద చూపించలేక అవస్థపడుతున్న శ్రీదేవి - భర్త పలకరింపుతో .... త్రాచుపాములా బుస కొట్టింది!

"ఏం బాధగా వుందా? ఇప్పట్లో రాననుకున్నారా? పుట్టింట్లోనే తిష్టవేస్తాననుకున్నారా?"-

"???"- కృష్ణ నిశ్చేష్టుడై .... నిలబడి పోయాడు.

నెల్లాళ్ళనుంచీ ఎడబాటు .... సహించలేక - వెంటనే రమ్మని రాసే ప్రయత్నంలోవున్న కృష్ణకి-ఇంటికి వచ్చేసరికి భార్య కనిపిస్తే .... సంతోషంతో తలమునకలై పోయాడు. తను ఆశ్చర్యంతో అడిగిన ప్రశ్నకి అదేనాజవాబు ఇచ్చే వరుస? మౌనంగ బూట్లు విప్పుకుంటు కూర్చునేసరికి - శ్రీదేవి చల్లబడిపోయింది!

"ఏం? ఇప్పుడే రాననుకున్నారా?-" అని గోముగ అడిగింది దగ్గరకి వచ్చి -కృష్ణ తలఎత్తిచూసి - 'నిముషంలో ఒకోరంగు ఎలా ఈ భార్యతోవేగడం?' అనుకున్నా-ఇన్నాళ్ల వియోగానంతరం పట్టుదలలు మంచివికావనిపించి - లేచి నుంచుని బూట్లు పక్కకి జరిపి - "దేవీ-ఈఉత్తరం చూడు-" అని జేబులో తను శ్రీదేవికి త్వరగా బయలుదేరి రమ్మని రాసిన వుత్తరం - ఇంకా పోష్టుచెయ్యనిది-తీసిచూపించేడు! చదివి - ప్రేమగ చూసింది!-

"ఊ! అలాచూడకు!- నేనుతపించిపోతున్న క్షణంలో నీవు ప్రత్యక్షమయితే - నేను ఎంత ఆశ్చర్యపోతానూ?- నా ఉత్తరం నాదగ్గరవుండగానే .... నీవు రెక్కలు కట్టుకుని వాలేవని - ఎంత సంతోషంగవుందో తెలుసా?"- దగ్గరకే తీసుకున్నాడు.

శ్రీదేవి కౌగిల్లో ఒదిగిపోయి- "నేనప్పట్టి తొందర పడిపోయానండి!- మా అమ్మావాళ్ళమీద అలిగివచ్చేను. కనీసం మీ ఉత్తరం అందేవరకు ఆగివుంటే-వాళ్ళు బాధపడేవారు కాదు .... చూడండి వచ్చేముందు మాఅక్క- రాసిఇచ్చిన చీటీ!"- అని చూపించి - అక్కడ జరిగినవన్నీ చెప్పింది!-

కృష్ణ చీటీ అందుకుని చదివేడు-

'దేవి - నీవు ఇంతతొందరగా ప్రయాణం ఎందుకు పెట్టుకున్నావో?... నేనుమాత్రం ఒక కారణం ఊహిస్తున్నాను. అమ్మ - కూతుళ్లిద్దరిపట్ల బేధాభిప్రాయాలు చూపించిందని నీవు అనుకుంటున్నావు!- అయితే ఒకటిమాత్రం గ్రహించు మనిషి తనశరీర అవయవాలన్నిటికీ ఒకే రకమైన ప్రాధాన్యత ఇచ్చినట్లే.... తల్లి తన పిల్లలందరికినీ ఒకేరకమైన ప్రేమతో చూస్తున్నది! కానీ-అవయవాలలో ఏ భాగమైనా బలహీన మైనప్పుడు .... దాన్నిగురించి ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకోవాలిగదా?- అమ్మచేసిన పనిఅదే!- పెద్దకూతురైన నేను ... అత్తింట సుఖంగలేనని ... ఆ మధ్య జబ్బుపడి వచ్చాననీ - కాస్త శ్రద్ధతీసుకుని ... అనురాగం పాలు మోతాదు పెంచింది!- ఒకరోజు విశాల మాయింటికి మధ్యాహ్నం వచ్చి ... ఆవేదనతో చచ్చిపోతానని ఏడిస్తే అంటే - నేనుదానికి ధైర్యం చెప్తూ ... నా విషయాలన్నీ చెప్పాను. అమ్మలేచి అవన్నీవింది!- ఆమరుసటిరోజే విశాల మాయమైంది!- ఆభయంతో అమ్మనన్ను కనిపెట్టుకుని సపర్యలు చేసింది!- నీవు అపార్థంచేసుకోకు చెల్లీ!- అర్థం చేసుకుంటావుగదూ?!- నీఅక్క !-'

కృష్ణ - దేవిని దగ్గరకి తీసుకుని - "నిజమే కనీసం నా క్షత్రరం అందేవరకు ఆగవలసింది! పోనీలే .... జరిగి పోయినవి మళ్లీ వెనక్కి తిరగవు!- ముందు జరగబోయే వాటికి జాగ్రత్తగ వుంటేచాలు!- అన్నాడు లాలనగ.

# 8

ఉదయం పదిగంటలకి రోడ్లన్నీ 'యమబిగాజీ' వున్నాయి! స్కూళ్ళకి వెళ్లే చిన్నపిల్లల దగ్గర్నుంచి...కాలేజీలకి వెళ్ళే పడుచుపిల్లలు .... ఆఫీసులకి వెళ్ళే పెద్దవాళ్ళ వరకు అందరికీ తొందరే!- జీవన పోరాటం కోసం అందరూ పరుగులే!- అందులో అదృష్టవంతులు ....దురదృష్టవంతులు! బీద .... గొప్ప .... ముసలి .... పడుచు....అన్ని రకాల జాతుల వారూ వున్నారు!-

సృష్టిలో ఎన్నెన్ని రకాలవింతలు .... విశేషాలు వుంటాయనూ .... అన్నీ చూస్తూ - కిటికి కర్టెన్ పక్కకి జరిపి.... నుంచుని చూస్తోంది విశాల!—

ఆరోజు హైదరాబాదులో రైలుదిగిన విశాల.... రిక్షా కట్టించుకుని ఎడ్రసు కాగితం ప్రకారం....నారాయణ గుడా.... లోవున్న డాక్టర్ గారింటికి బయలు దేరింది!- ఎన్నడూ చూడని రోడ్లు .... మనుష్యులు .... భయం - ఎంతసాహసం చేస్తున్నాననే - ఆశ్చర్యం ....కలగాపులగంగా బుర్రనిండా మారిపోతూవుంటే - రిక్షావాడు సరియైన దారిలోనే తీసుకు వెళుతున్నాడా? అని ఓ అనుమానం .... పీడిస్తూవుంటే - ప్రభాకరం చెప్పిన జాగ్రత్తలు గుర్తుకొచ్చాయి!- 'నువ్వు కొత్తబాపిలా భయపడుతూ కూర్చోకు!- రిక్షావాడు పసి

గక్కో .... ప్రమాదం! చీటీ వాడిచేతికి ఇవ్వకుండా ఫలా నాచోటుకి అని .... అడిగి - సాధ్యమైన త వరకు - రిక్షా వాడు చిన్నకుర్రాడు గాక .... ముసలాడుగ వుండే వాణ్ణి చూసుకుని .... ఎక్కు!'- అని ఆరోజ్జుగో వుండే గుర్తులన్నీ చెప్పాడు!- తనఇంటికి వెళ్ళి కాంపౌడరికి - తను రాసిన ఉత్తరం ఇవ్వమన్నాడు. అదేరోజు తను, ఆ ఊగునుంచి, ట్రంక్ కాల్ చేసి కాంపౌండరితో మాట్లాడుతానని కూడా చెప్పాడు!—

ఆరోజు తనని - ఫోనులోపిల్చి .... 'సుశీలా క్షేమంగ చేరేవా? నేను వచ్చేవరకు .... నిర్భయంగ...నిరభ్యంతరంగ ఆఇల్లు మీస్వంతఇల్లు అనుకున్నంత స్వేచ్ఛగ ఉండమని .... నాల్గుచీరలు .... జాకెట్లు .... కావల్సినవన్నీ .... ఆయాని తీసుకెళ్ళి ... డబ్బు కాంపౌండర్ని అడిగి తీసుకుని ....కొను క్కో—మని చెప్పాడు!—

'ఎలాంటిమనిషి!- ఇలాంటి మనుష్యులు కూడా వుంటారా?- అంతాఏదో ఇంద్రజాలంలా .... విచిత్రంగా మలుపు తిరిగింది తనజీవితం!' అనుకుంది!- ఆ తర్వాత ప్రభాకరం వచ్చాడు ....ఊరివారి ముచ్చట్లు .... నారాయణ రావుగారి ఇంట్లో ఎలా వడ్చినసంగతి....ఆయన ఎంతలా వెదికేనో .... అన్నీచెప్పి .... 'నిజంగా - ఆసమయంలో ఆయనతో అన్నీచెప్పేయాలను కున్నాను!.... ఎలా నిగ్రహిం చుకున్నానో నాకే తెలియదు!- అబ్బ ఒకనిజం దాచిపెట్టి - నటించడం ఎంతకష్టమో అనుభవ పూర్వకంగా తెలిసింది!- అన్నాను .... తనకి దుఃఖం వచ్చింది!- జానకమ్మత్త, భవానీ

వాళ్ళు తనని గురించి ఏమనుకున్నారో?- ఛ! చచ్చిపోతేనే బాగుండేది!- అనుకుంది!—

కానీ ప్రభాకరం....ఎన్నో చెప్పాడు. చావడం తేలిక!- బతికి సాధించి చూపించడం కష్టం!- నువ్వు తేలికదారిని ఎన్నుకుంటున్నావు గానీ .... కష్టమైనా .... ఒక గొప్పపని.... నల్గురికి మేలుచేసేపని .... చేస్తాననటంలేదు!- ఇదే మరొక మనిషైతే - నేను కల్పించుకునే వాడిన్నా? కానీ చిన్నప్పట్నుంచి నిన్ను ఎరుగుదును!- నాలో పేరుకున్న జాలి సానుభూతి .... నిన్ను చచ్చిపోనివ్వకుండా అడ్డుకున్నాయి?- సమస్యలని పరిష్కరించాలంటే చావేనా?- అయితే నీ లాంటి వారందరు బతికివుండకూడదు!- అంతేనా?- చూడునీలాంటి ఎందరో .... జీవితంలో నిలదొక్కుకుని .... తమ బ్రతుకికి-అర్థం తెలుసుకుని - పరమార్థాన్ని సంపాదిస్తున్నారు!—

"ఒక వేళ ఇద్దరుగాని ఒకరుగాని పిల్లలుంటే - ఆ తల్లి వాళ్ళకోసం ఎన్ని బాధలైనా సహించి బతుకుతుందిగదా?- మీ అమ్మకోసం నువ్వు ఎంతఓర్మితో వున్నావు?- అలాంటి అమ్మలు .... దిక్కులేని పసివాళ్ళు .... రోగగ్రస్థులు .... వాళ్ళంతా నీవాళ్ళనుకుని - వాళ్ళకోసం నీవు జీవించాలి సుశీలా!- పదనీకు వాళ్ళందర్నీ చూపిస్తాను!"- అని తీసుకెళ్ళేడు.

ఆసుపత్రిలో తన తోటిడాక్టర్లకి .... ఫ్రండ్స్‌కి .... పరిచయంచేసి .... ఇద్దరు ముగ్గురు నర్సులకి చెప్పి .... వార్డులన్నీ చూపించి .... ఇంటికి తీసుకుని వచ్చాడు.-

ఆ తర్వాత ఓ మంచిరోజు చూసుకుని ట్రైనింగ్ లో చేరింది!___

"ఏమిటి సుశీలా! ఏదో ఆలోచిస్తున్నావ్?-" అన్న డాక్టర్ ప్రభాకరం పిలుపుతో ఉలిక్కిపడి "అబ్బేఏంలేదు. నేను ఇక్కడనుంచి తొందర్లోనే హాస్టల్ లో చేరాలనీ" ........ అని ఆగిపోయింది!-

కుర్చీలో కూర్చుంటు నవ్వేడు! "నాకు తెలుసు. అలాగే చేర్పిస్తాలే!- పదిమందికి మనల్నిగురించి చెప్పుకునే అవకాశం రానీయకూడదు!-"

తను చెప్పదల్చుకున్న భావం ఏమిటో అతనే చెప్పే సరికి కొంచం సిగ్గుపడింది ....

"కూర్చో సుశీలా....నీకు ఇప్పుడప్పుడే అందరి దగ్గరా చనువు ఏర్పడకపోయినా....మరీ అంత బెరుకులేదు కదూ?- ఇంకా క్రమంగా నేర్చుకుంటావులే అన్నీ!- కమలలేదూ .... అదే సన్నగ ఎర్రగవుంటుందే ఆపిల్ల చాలా మంచిది. ఆ తరువాత రోజ్ మేరీ - కాస్త కోపంవున్నా మంచిమనసే!.... డాక్టర్ పద్మిని .... డ్యూటీలో సీరియస్ గ వుంటుందే తప్ప చిన్నపిల్లల మనస్తత్వం!- వాళ్ళంతా క్రమంగ నీకు అర్థమవుతారు .... నీకెప్పుడైనా ఏదైనా అనుమానం వున్నా నేను వున్నాగా?-" అని భరోసా ఇచ్చేడు.

కాస్సేపు కబుర్లు చెప్పుకున్నాక .... ఆయా కాఫీ తీసుకుని వచ్చింది! ఇద్దరు తాగి-ఊరుచూడాలనిబయల్దేరేరు!....

రోజులు గిర్రున తిరుగుతున్నాయి!—

# 9

ఉదయం లేచినదగ్గర్నుంచీ .... ఒకటే తిరుగుతూ పనులు చేస్తోంది భవాని!- కసువు ఊడ్పుల దగ్గర్నుంచి .... గాబుల్లో నీళ్ళునింపి .... కాఫీపనులు ముగించి - పిల్లలు స్నానాలు .... బడికిసాగనంపి .... అత్తయ్య వంటసాయం చేసి .... రోటిదగ్గర కూర్చుంది. గిన్నెడు పప్పురుబ్బి .... మర్నాడు ఇడ్లీకి సిద్ధంచేయాలి!- మధ్యాహ్నం కందిపొడుం విసరమంది అత్తయ్య! విసరాలి....

ఆలోచిస్తూ పనులు చేస్తూనే వుంది, భవాని.

పెద్దమరిదికి ఈమధ్య పెళ్ళై .... పట్నవాసంలో- కాపరం పెట్టేరు! ఆవిడ గ్రాడ్యుయేట్! పైగా బోలెడు కట్నంతో వచ్చింది!!- మరిది ఎమ్. ఎస్. సి ప్యాసై .... ఉద్యోగం చేసుకుంటు .... పట్నం బాబులా వున్నాడు!-

బజారు కెళ్ళిన భాస్కరం .... భవానీ భర్త....ఇంటికి వచ్చేసరికి - తల్లి వంటపూర్తి చేసుకుని .... వెన్న కాస్తోంది!- కమ్మని వాసన ఇల్లంతా ఘుమఘుమ లాడిపోతోంది!- చెప్పులు వీధి సావిడిలో విడిచి కాళ్ళూచేతులు కడుక్కుని.... "ఏమ్మా నెయ్యివాసన బాగావస్తోంది .... వంటైందా?"- అనడిగేడు.

"అవునురా! ప్రసాదుకి .... నెయ్యి బాగా లేకపోతే తినలేడురా!"- అంది.

భాస్కరానికి ఎక్కడో అంతరాంతరాలలో ముల్లులా తగిలింది. నెయ్యి బాగా లేకపోతే ప్రసాదు ఒక్కడేనా తినలేక పోయేది? పోనీ అందరికోసం కాచుతున్నాననకూడదా?- అనుకుని-"ఓహో!"-అనేసి పెరటివైపు నడిచేడు-. రోటిదగ్గర కూర్చుని పప్పు వాయులు రుబ్బుతున్న భవాని కనిపించింది!-

వెనుక వైపుగ కూర్చుని వున్న భవానికి ఎండపొడ తగిలి జాకెట్టు చెమటకి తడిసి - వీపుకి అంటుకుపోయింది!- 'పచ్చని నడుంమీద ... ముత్యాల్లాగ చెమట చుక్కలు మెరుస్తున్నాయి!- ఇంకా స్త ముందుకు వెళ్ళిచూస్తే....ముఖం మీదనుంచి కారిన చెమటకి కుంకుమబొట్టు కరిగి ముక్కు మీదకి కారి చివర .... ఎర్రని రాయిలా కన్పడుతోంది! పప్పుచేత్తో ముంగురులు వెనక్కి తోసుకున్నందు వలన నుదటిమీద అక్కడా అక్కడా పప్పు మరకలు అంటి వున్నాయి!-

భర్తని గమనించి కూడా పనిలోనే లీనమైపోయిన భార్యని...ఓక్షణం గమనించి- "ఇప్పుడా పప్పు ఎందుకు?"- అన్నాడు.

"రేపటి ఇడ్లీలకి!"-తల తిప్పకుండానే చెప్పింది.

"రేపు శనివారం కాదే?"

భవాని రుబ్బడం ఆపి....చిన్నగ నవ్వి- "శనివారం కోసం కాదు. మీ తమ్ముడుకి మరదలకి పొద్దున్నపూట టిఫిన్ అలవాటుట! ఈ రోజు ఉప్మాచేసి పెట్టారు. రేపటికి కోసం ఈ ప్రయత్నం!"-అని మళ్ళీ మొదలెట్టింది.

"ఓహో!"-అనుకుని- "వాళ్ళిద్దరు ఎక్కడికెళ్ళేరు?"- అన్నాడు ఇంట్లో కనిపించలేదేం అనుకుని-.

"మామిడితోట చూడ్డానికి-మామయ్యగారితో కలిసి వెళ్ళేరు!"-

"ఆ!??-నిజమే___"

"అవును! అత్తయ్యే పంపింది!"-

భాస్కరం మళ్ళీ మాట్లాడలేక పోయాడు- 'ఎంత విడ్డూరం!' అనుకుంటూ వెనుదిరిగేడు!-

కోడలు వీధిగడప దాటి బయటికి వెళితే-రాద్ధాంతం చేసే అమ్మ...చదువుకున్న కోడలు .... ఉద్యోగం చేస్తున్న కొడుకుని చూసి-సిద్ధాంతాలు మార్చేసుకుని- నాన్నగారితో పాటే-మామిడి తోటలోకి షికారుకి పంపిస్తుందా?- అదే భవాని ఐతే? అసలు నాన్నగారు ఏలా తీసుకెళ్ళేరు?- కట్నం తెచ్చిన కోడలైతే-అడుగులకిమడుగులు ఒత్తుతారా?- తమ్ముడు ఉద్యోగం చేస్తున్నాడని - వాడిని అపురూపంగ చూస్తు...తనని మామూలుగ చూస్తుందా?-ఎంత భేదం?- వీధి సావిడిలో బల్లపీటమీద కూచుని ... ఆలోచిస్తున్నాడు భాస్కరం- మొన్న వాళ్ళు ఊరినుంచి రాగానే అమ్మ ఎంత సంతోషించింది?- స్నానాలకి తనే స్వయంగ నీళ్ళు అందించి .... తనే కాఫీలు పెట్టి....చెరొక గ్లాసు అందించింది- 'అమ్మా! కాఫీ మాత్రమే ఇచ్చి .... భోజనాలవేళ దాకా నీరసం. వచ్చేలాగ చెయ్యకు కోడల్ని - అదసలే నాజూకు మనిషి. వాళ్ళనాన్నగారు మొన్న మాయింటికి వచ్చినప్పుడు మరీ మరీ చెప్పారుకూడా....బస్తీలో ఏం సుఖం నాయనా.... పల్లెలో పాలుపెరుగు నెయ్యి పళ్ళు.. హాయిగ తినవచ్చును.

సెలవపెట్టి వెళ్ళుతున్నావు గనుక .... కాస్త అమ్మాయి ఆరోగ్యం సంగతి చూడమని చెప్పారు .... అని తమ్ముడు నవ్వుతూనే చెప్పడం - ఆ వెంటనే మరదలు అందుకుని - 'వారి మాటలకేమిలెండి అత్తయ్యా .... ఇది నాకుపరాయి ఇల్లా .... నాకు కావల్సినవి నేను అడిగి తింటాను'- అంటూ చెప్పడం - 'బాగాచెప్పావ్! మన ఇంట్లో మనకి హద్దులు, అడ్డులు, ఏమిటమ్మా?- 'అని ఆప్యాయంగ జీడిపప్పువేసి .... వెన్నగాచిన నెయ్యివేస .... దొడ్లో నిమ్మపండు కోసి రసం పిండి - ఘుమ ఘుమలాడే ఉప్మాచేసి పళ్ళేలు సర్ది - ఇద్దరికీ అందించి .... దగ్గరవుండి మళ్ళీమారు వేసి మరీ తినిపించింది!- ఆ ప్లేటు భవానీ కడిగింది!!

'ఏమిటో తనకప్పుడు - అందులో తప్పు పట్టాల్సిందేమీ కనిపించలేదు. ప్రయాణపు బడలికలో వున్నారు గదా .... 'నాతమ్ముడు నామరదలు' .... అనుకుని సంతోష పడ్డాడుగానీ .... అమ్మ - కొడుకులిద్దరిలో .... కోడళ్ళల్లో.... తేడాపాడాలు చూస్తోందని - స్ఫురించలేదు ....

'లేకపోతే - ఎన్నడైనా .... భవానికి టిఫెన్ చేసి పెట్టిందా?- బయటికి షికారుకి కాదుగదా .... పక్కింటికైనా వెళ్ళనిచ్చిందా?- ఎండలో, వానలో, నేను పొలంపనులు అవీ చూస్తుంటే .... అదేదో నాబాధ్యత ఐనట్టు....చూసిందే గానీ .... ప్రత్యేకమైన ఆదరింపులు ఏమీ చూపించలేదు.... భవానికూడా .... కాపరానికి వచ్చినప్పట్నుంచి తలవంచుకుని అలా గాడిదచాకిరీలు చేస్తున్నా .... నీరసం వస్తుందని

కొంచెం పాలుతాగు అన్నమాటకూడా అనలేదు!-ఛ ....
ఏమిటీ పక్షపాతం!?-' అనుకున్నాడు....

పదకొండు గంటలు దాటేక - మరదలు, తమ్ముడు, ముందర వచ్చారు .... ఆ వెనుక మరొక పావుగంటకి తండ్రీ వచ్చాడు ....

మరదలు చెప్పులు విప్పుకుని నేరుగ ఇంట్లోకెళ్ళి వాల్చివుంచిన మంచంమీద కూర్చుని అలుపు తీర్చుకుంది!- ఆతర్వాత పెరట్లో కాళ్ళూ చేతులు కడుక్కుని భోజనాల వసారాలో పీటమీద కూర్చుని - కబుర్లు మొదలెట్టింది! -

ఆపక్కనే భవాని .... గోడకి ఆనుకుని నిలబడి - నిన్న రాత్రనగా ఎప్పుడో తిన్న తిండికి .... కడుపు నకనకలాడుతూ వుంటే - నీరసంగ, కళ్ళల్లో ప్రాణంలేనట్టు నిలబడి - ఎప్పుడు భోజనాలవుతాయా అన్నట్టుగ చూస్తోంది!

ఉదయం టిఫిన్ తిని - కాఫీతాగి .... మళ్ళీ లైటుగ- హార్లిక్స్ బాటిల్ సూటుకేసులోనుంచి తీసుకుని-కలుపుకుని తాగి-తోటకి షికారుకి వెళ్ళింది! వాళ్ళకేం ఆకలివుంటుంది?- తమ్ముడు వచ్చి అన్నగారితో కాస్సేపు ఏదో మాట్లాడి .... వంటింట్లోకి వెళ్ళేడు- "వంట వంచేసేవమ్మా?-" అని అడుగుతూ .... భార్యకి కొంచెం దూరంలో -తల్లికి దగ్గరగా.... ఓపీట వాల్చుకుని తనూ కూర్చున్నాడు!-

"వంకాయ కారంపెట్టి కూర .... కొబ్బరి పెరుగు పచ్చడీ .... కప్పు .... తోటకూర పులుసు-" తల్లి వంట

కాల్ని గురించి చెప్పేసరికి- "అబ్బో నీకోడలికి పెరుగు పచ్చళ్లు మహాఇష్టం! కదూ సుధా?"- అనడిగేడు....

"మీ అమ్మగారు బాగాచేస్తారు!-" అంటూ అత్త గారివైపు చూసింది కోడలు.

కోడలి మెచ్చుకోలుకి మురిసిపోయిన అత్తగారు .... "వెర్రిపిల్ల - నీమనసు అటువంటిది - పాపం ఒక్క దానివీ చేసుకోలేక పోతున్నట్టున్నావు. కాస్త కందిపొడుం....అప్ప డాలు, వడియాలు పట్టుకెళ్ళండి .... అరటిగెల .... నాల్గు కొబ్బరికాయలు బస్తాలో పట్టుకెళ్ళవచ్చును. ఇక్కడున్న నాల్గురోజులు .... రోజు ఇడ్లీలు వేసిపెడ్తాను .... బొత్తిగ ఎలావున్నావో పూచిక పుల్లలాగ!-" అంటూ ఆప్యేక్షగ కోడలివైపు చూస్తుంటే - భవానికి - ఆసంభాషణ మీద ఆసక్తిచచ్చి .... ఆకలితో కళ్లుతిరుగుతూ .... నిలబడలేక - బయటికి వెళ్ళబోయింది!-

"ఇదిగో భవానీ - మీ మామగారికి- కాస్త మిరియాలపొడుం కొట్టమన్నాను .... కొట్టేవా? రెండురోజు ల్నుంచీ .... గుండెల్లో ఆయాసంగవుండి .... దగ్గువస్తోంది!-" రెండోవాక్యం కొడుకువైపు తిరిగి అన్నది!- "అదేమిటీ? అన్నయ్యా మందు తీసుకురాలేదూ?" అని కొడుకంటే- "పెద్దవాళ్ళకేమైన తేడాకన్పిస్తే - అశ్రద్ధ చేయకూడదు అత్తయ్యా!-" అని కోడలు వంతపాడింది!-

"ఏమిటో నమ్మా! అందరందరే! మీబావకి తీరుబడీ లేదు పనిలేదు మీ మామయ్యా! నిర్లక్ష్యం!-"

భవాని ఇంక అక్కడ నిలవలేక- "పొడుం కొట్టి సీసాలో పెట్టి ఆ అల్మారాలో పెట్టాన త్తయ్యా" అనేసి పెరట్లోకిపోయి బాదంచెట్టు నీడలో మంచం వాల్చుకుని కూర్చుంది!- అసలు ఆసమయంలో అలా పడుకుని నిద్రపోతే బాగుండునన్న కోరికని బలవంతంగ అణుచుకుని- 'అత్తయ్య ఎంత చిత్రంగ మాట్లాడుతుంది?- పెద్దకొడుక్కి- పనిలేకు తీరుబడి లేదా?- లేచిన దగ్గర్నుంచీ - అరకకి కట్టిన ఎద్దులా- దుక్కి- దున్నినట్లు ... ఈ సంసారంలో పడి అన్ని పనులు చేస్తుంటే - వీళ్ళంతా ఇలా కూర్చుని తినగల్గుతున్నారు!- వారేగనుక పనిలేకుండా కూర్చుంటే .... వీళ్ళకి నోట్లోకి ఇన్నేసిరుచులు ఎలావస్తాయి?-' అనుకున్నది.

సరిగ్గా ఆసమయంలో భాస్కరం - వీధివసారాలో నుంచి లేచి .... ఇంట్లోకి వచ్చాడు-వంటింట్లోకి రాబోతే... మరదలు లేచి నిల్చోబోయింది!

"ఓహ్హో సుధా! నువ్విలా మాటిమాటికీ లేచి నిల్చుంటే - మనం మళ్ళీ మనఇంటికివెళ్ళే సరికి డాక్టర్ దగ్గర ట్రీట్మెంటు తీసుకోవాల్సి వస్తుంది. అవన్నీ పల్లెటూరివాళ్ళ చాదస్తాలు!- మాఅన్నయ్యొ వస్తే నువ్వులేవడం మెందుకు ? మీ బ్రదర్స్ వస్తే లేస్తావా?!- అలాంటివన్నీ పిచ్చిమర్యాదలు ... ఆచారాలు!!- మావాళ్ళకేం పనిలేక- ఈసర్కస్ ఫీట్లన్నీ అలవాటు చేసుకున్నారు. లేకపోతే - వాళ్ళుతినే పదార్థాలు అరగవు!- కూర్చో కూర్చో!- అన్నాడు .... ప్రసాదు—

"మరేనమ్మా? ఏమిటీ మీ అన్నయ్య లాంటివాడే ఫర్వాలేదు కూర్చో!" అంది తల్లి.- భాస్కరం ఇక అక్కడ నిలవలేదు .... గబగబా పెరటివైపు వెళ్ళాడు.

నిస్త్రాణగ .... ప్రాణంలేని బొమ్మలా ... భవాని.... ఆ చెట్టుక్రింద మంచంలో కూర్చునివుంటే మునుపెన్నడూ కలగనంత జాలి .... ప్రేమా కల్గేయి, భాస్కరానికి! భర్తను చూసి లేచి చిన్నగ నవ్వింది!- జీవంలేని ఆనవ్వుకు జాలి పడటం తప్ప ఏంచేయాలో తోచలేదు!- కానీ- ఏదో చేయాలి!- ఈ అన్యాయం అరికట్టాలి! అనిమాత్రం గట్టిగా అనుకున్నాడు.—

o o o

మరి కొన్నాళ్ళుండి - ప్రసాదు, సుధా, బండెడు సామాన్లు పాక్ చేయించుకుని వెళ్ళేరు - దానికి భాస్కరం బాధపడలేదుగానీ.... వెళ్లేరోజు, ముందు ఒకరోజు రాత్రి .... ప్రసాదు తండ్రితో అన్నమాటలు ఒళ్లుమండించాయి!—

పంటలు అవీ ఇంకా కొత్తపద్ధతుల్లో .... కొత్తరకం ఎరువులు వేసి....బాగా పండించాలనీ - అన్నయ్య ఇంకా శ్రద్ధ తీసుకుని చేస్తే ... మనకి ఇంకా లాభంవస్తుందనీ - చిన్నతమ్ముడు అగ్రికల్చర్ చదువుతున్నాడు గనుక... వాడు సర్టిఫికెట్ పుచ్చుకుని వచ్చేదాకా .... అన్నయ్య ఓపికపట్టి చేస్తే .... ఆతర్వాత వాడిసలహాని తీసుకుని పండించ వచ్చునని .... ఇంకా ఏమిటోవాడు చెప్తుంటే.... తండ్రి ఊకొట్టి- తనతో కూడా చెప్పడం .... ఎంత బాధకల్గించిందో!—

"ఇంతకాలం తనుచేసినదంతా.... పనికిమాలినదా?-.... కొత్త పద్ధతులున్నాయంటే .... ఒప్పుకోవచ్చును కానీ ... తను శ్రద్ధగ పని చెయ్యాలనటంలో ఏమిటి అర్థం? బయట తను .... ఇంట్లో భవానీ .... బండబారిపోతున్నా .... విలువ లేకుండా పోతోందేం?"- ప్రసాదు .... భార్యతో వచ్చి వెళ్ళినప్పట్నుంచీ .... భాస్కరానికి ఏదో తెరతొలగినట్టు- ఇన్నాళ్ళు తను తెలుసుకోలేనిదేదో .... ఇప్పుడు కొత్తగ తెలుసుకుంటున్నట్టు అనిపించింది!- అంతేకాదు ....మనస్సుని ఎంత సరిపెట్టుకుంటామన్నా వినక - మాటిమాటికి గతాన్ని తిరగతోడుతూ .... పోలికలు .... బేధాలు ... ఎత్తి చూపించటం జరుగుతోంది.

— మరదలు సుధ గ్రాడ్యుయేట్ కావచ్చు కానీ.... భవానీ అందం ముందు తీసికట్టే!- కాపరానికి వచ్చేనాటికి భవానీ పచ్చని పసిమిరంగుతో - తమలపాకులంత సున్నితమైన వేళ్ళతో .... మృదువుగ నాజూకుగ వుండేది. రెండేళ్ళ యేసరికి - చాకిరీలతో - గొడ్లదగ్గర బాగుచేసి .... మినుములు, పెసలు బాగుచేసి .... పప్పులురుబ్బి పచ్చళ్లునూరి- పిండివిసిరి .... చేతులు మోటుగ .... కాళ్లుపగిలి అసహ్యంగ తయారయ్యాయి!- తనకి బాధ అనిపించినా .... 'మరి కోడలు కదా? అలాగే చేయ్యాలి' అనుకున్నాడు!- బారుజడలో రాళ్ళ చామంతిపువ్వు - మెరుస్తూవుంటే ఆడది చూడ ముచ్చటగ అనిపించేది. ఓసారి తలంటుకుని జారుగజడ అల్లుకుని పనిచేస్తుంటే - తల్లిచూసి - అవ్వ! ఆషోకేమిటే?

అనితిట్టి - జడవిప్పి బిగ్రబిగించి కొరడా కర్రలా జడవేసి - ఇంక రేపటిదాకా జడవిప్పక్కర్లేదు. అలా వుండాలి! అని ఆజ్ఞాపిస్తే .... 'అత్తింటికోడలు అలాగే వుండాలికాబోలు' అనుకుని....తనకి అలాబాగు లేకపోయినా ఏమనలేకపోయాడు. స్నోలు, పౌడర్లు, పేరత్తడానికే లేదు - మరిసుధ ప్రతి పూటా రాసుకుందే??! తాంబూలం వేసుకున్నా .... మల్లె పూలు పెట్టుకున్నా .... రాత్రి ఏపదిదాటాకో చెయ్యా వల్సిందే తప్ప .... పగలు పూట ఇంట్లో - పండగనాడైనా సరే .... ఆపనులు చేస్తే - సానివేషాలు .... సంతగోల అని తిట్టేది తల్లి!- తనకి 'బాగున్నాయని' అనిపించే వాటన్నిటికీ తల్లి ఆంక్షలు పెట్టేది. - మరి ఆ ఆంక్షలు ఏవీ సుధకి లేవు! ఆ కట్టడీలు .... సంప్రదాయకపు కట్టుబాట్లు.... అన్నీ భవానీ కేనా?- మామయ్యా ఎన్నోసార్లు పండగలకిరమ్మని పిలిస్తే.... తల్లి .... ఎంతోరగడచేసి .... తండ్రి కోపగించుకుని .... వెళ్ళ నివ్వకుండా చేసేవారు!- మరి ఇప్పుడు తమ్ముడు ప్రసాదు.... నెలకోసారైనా మామగారి దగ్గరికి వెళుతాడు!- తను ఇప్పటికీ మామయ్యా ఇంటికి వెళ్ళలేదు!-

అమ్మమీద .... నాన్నమీద .... కోపం వస్తే .... ఏంచెయ్యాలో తెలియక భవానిమీద చూపించేవాడు.- పాపం! భవానీ ఈ ఇంటికోడలై ఏం బావుకుందీ?- కోపం వచ్చినప్పుడల్లా - వాళ్ళమ్మని కూడా కలిపి- వెధవమేనరికం- అని తిట్టిందితల్లి! పుట్టింట్లో భవాని బాధలువిని....అత్తయ్యా కూడా .... అమ్మనితిట్టి - ఈ 'అయినసంబంధం' మంచిది కాదని తిట్టుకోదూ?- కావల్సిన సంబధాలు చేసుకుని ....

ఈ సాంప్రదాయాలనీ .... కట్టుబాట్లు .... వైధవ్య మూఢ ఆచారాలతో - మనుష్యుల్ని చంపేస్తున్నారు!—

తెలివితక్కువ వాణ్ణిగనుక .... అందుబాటులో వుండే ఆనందాలు, సరదాలు, అన్నీ ఎవరేమనుకుంటారో అనే పిరికితనంతో .... అమాయకత్వంతో .... అందుకోలేక జారవిడుచుకున్నాను!- పెద్దాళ్ళు పెట్టుకున్న ఈ ఆచారాలన్నీ - ఎందుకు? ఏం అర్థంవుందీ? ఒకకోడలికి వుండి మరొక కోడలికి ఎందుకుండవు?—

నోరువుండి, డబ్బువుండి, చదువువుండి, ....ఎదిరించగల ధైర్యంవుంటే - ఏ సంప్రదాయాలు, కట్టుబాట్లు.... మూఢాచారాలు - ఏంబాధించవు .... లేకపోతే .... తనలాగ భవానిలాగ .... మనసు చంపుకుని బతకాలి? అంతేనా? అంతే!—

'కాదు!- నేను ఇకమీద మనిషిలాగ .... అర్థంలేని వాటికి విలువనియ్యకుండా .... నాసంసారంలో, భార్యాపిల్లలతో, హాయిగ వుంటాను - మంచిరోజు చూసుకుని .... రాత్రిచెప్పే 'వయోజనవిద్య' పాఠాలు లైబ్రరీపక్క, పంచాయితీ హాల్లో నేర్చుకుని - పరీక్షలు ప్యాసవుతాను .... ఏ చిన్న ఉద్యోగమో సంపాదించుకుని ....ఆస్థి పంచేసుకుని- భవానితో పిల్లలతో వేరే కాపురం పెట్టుకుంటాను!- అంతే! లేకపోతే అందరు సుఖపడుతూవుంటే .... తనెందుకు పతనం కావాలీ?- ఎన్ని చేసినా సిష్టూరాలేగదా మిగిలేది'- అని ఓ దృఢ నిశ్చయంతో భాస్కరం తృప్తిగ నిట్టూర్చేడు!-

## 10

ముందుగదిలో నాల్గుకుర్చీలు....మధ్యలో చాప.... టేబుల్

మీద ఓ అగరవత్తుల స్టాండ్ .... ముఖాస్పాల్ మీద ఓ ఫ్లవర్ వాజ్ - అలంకరణంతా పూర్తిచేసి - గది గుమ్మం వరకు వెళ్ళి ఓమారు అన్నీసరిగా వున్నాయో లేదో చూసి - కర్టెన్ సరిగ్గావేసి .... నవ్వుకుంది మాలతి....—

'ఏమిటీ పిచ్చి?- ప్రతిసారీ ఇదొక తంతు!- ఇప్పటికిది మూడోసారి. అంతే ఈసారి గనుక సెటిల్ కాకపోతే .... అంతే! ఇంక ఈరిహార్సిల్ వేసేఅవసరంరాదు!- అమ్మకి కూడా చెప్పానుగదా?- ఆవిడ ఒప్పుకోక పోయినా నేను ఒప్పుకోను'- అనుకుంటు ఇంట్లోకెళ్ళింది!—

జానకమ్మగారు వంటింట్లో .... హడావిడి పడుతూనే- "అయిందా? ఊ త్వరగా .... ముఖం కడుక్కుని చీరమార్చుకో .... "అని తొందర చేసేరు—

మాలతి తల్లివైపు చూసి...."అదిసరే నేను చెప్పింది గుర్తుందికదూ? ఇకఇదే ఫైనల్- ఆ తర్వాత మళ్ళీ ఈడ్రామాలు వేయకూడదు!-" అన్నది దృఢంగ.

ఆవిడ నిట్టూర్చి - "సరేలేమ్మా! ఏం బెదిరింపులే తల్లీ!-" అని మళ్ళీ పని హడావిడిలో పడి పోయింది!—

ప్రకాశం సైకిల్ వేసుకుని చెక్కగేటు తోసుకుని వచ్చాడు .... అతనిచేతిలో ఒకపెద్ద ప్యాకెట్ వుంది!- సైకిల్ వరండాలోపెట్టి స్టాండ్ వేసి .... "అమ్మా ఇదిగోనమ్మా స్వీట్లు తెచ్చాను" అన్నాడు—

మాలతి ముఖం కడుక్కుని తువ్వాలుతో తుడుచుకుంటూవచ్చి- "ప్రకాశం! ఒక్కస్వీట్లేనా?- పూలహారాలు

....కూల్ డ్రింక్ లు తేకపోయావు రా?- అమ్మా మీ కసలు .... ఆలోచనలు లేవమ్మా .... చూసి వెళ్ళే వాళ్ళకి - ఈ మర్యాదలు .... మొక్కుబడులు .... లాంఛనాలు ఏమిటమ్మా?"- అన్నది కోపంగ—

"అమ్మా మాలతీ! కాస్త వూరుకో తల్లీ!- ఏదో పెళ్ళి చూపులన్నాక ఓ పద్ధతీ - సంప్రదాయం వుండవూ?- అన్నీ దులపరించేసినట్టు - చేస్తే....వచ్చే వాళ్ళు ఏమనుకుంటారు?- అయినా నువ్వు ఈ ఒక్కసారి నోరు మూసుకోవమ్మా!"- అని కొంత అనునయంగానూ .... కొంత అధికారకంగ చెప్పి వూరుకో బెట్టింది!-

మాలతి గదిలోకి వెళ్ళి - బొట్టు - కాటుక పెట్టుకుని .... జడ అల్లుకుంది. సాదా వాయిల్ చీర తీసుకుని కట్టుకోబోయి - 'పోనీలే ఈ ఒక్కసారి మంచిదే కట్టుకుంటే వదిలి పోతుంది'- అనుకుని - తన పుట్టినరోజున కొనుక్కున్న ... లేతనీలి రంగు బ్రాసో చీర తీసికట్టుకుంది!- అద్దంలో చూసుకుంది.-

మబ్బులు పట్టినప్పుడు ... చిరుగాలివీస్తూ .... మధ్య మధ్య చిన్న చిన్న మెరుపులు - మెరుస్తూ ....వానరాబోయే ముందు .... సూచన లిస్తున్నట్టుంటుంది ఆ చీర -తన కెందుకో అలా అనిపిస్తుంది - ఆ చీర కట్టుకున్నప్పటి అనుభూతి అది!- ఒకొక్క అనుభూతి - చిత్ర విచిత్రంగ వుంటుంది!- అప్పటి సంఘటనని బట్టి బహుశా ఆ అనుభూతులు మిగిలిపోతూ వుండవచ్చును!-

మాలతి ఇంకా పరధ్యానంగ వుండగానే .... బయట నారాయణరావుగారు వాళ్ళని తీసుకొస్తున్న సందడి .... జానకమ్మ హడావిడి వినిపించింది!- ప్రకాశం గదిలోకొచ్చి- "అక్కా- వాళ్లు వచ్చారు!"- అని ఓ వార్నింగ్ లాంటిది విసిరేసి బయటికెళ్ళి పోయాడు--

మాలతి సన్నగ నవ్వింది- 'ప్రేక్షకులు అంతా రాగానే - స్టేజిమీదకి నటులువచ్చినట్టు ఇదీ ఓ నాటకమే!- 'కమిటీ మెంబర్లు అంతాకూర్చుని లోపలికి పిలిస్తే వెళ్ళి జవాబులిచ్చినట్టు ఇదీ ఒక ఇంటర్వ్యూయే!- అనుకుంది!-

నటనైనా....ఇంటర్వ్యూఐనా....నెగ్గితే .... జీవితంలో ఓ గొప్ప మలుపు! లేదా అంతేతానిక- ఇలాంటిప్రదర్శనలు కాకుండా .... ఆఫీసులచుట్టు ప్రదక్షణాలు చేస్తుంది!-

"అమ్మా రా!" అన్న తల్లి పిలుపు అందుకుని బయటికి వెళ్ళింది!,,

పెళ్ళికొడుకు - తండ్రీ - మేనమామ - వచ్చారు....

ఏవేవో అడిగేరు!

ఓపిగ్గా చెప్పింది!

అతనూ అడిగేడు- "మీకు అవకాశం వస్తే .... ఉద్యోగం చేస్తారా?"- అని

తలఎత్తి చూసింది?- 'శేఖర్'- బాగానే కనిపించాడు!---

"అవకాశం వస్తే - కాదు -అవసరంఐతే తప్పకుండా చేస్తాను" అంది నిబ్బరంగ.

"అవసరం అనుకున్నప్పుడు - అవకాశం రావాలని లేదుగా!"- కొంటెగానే అన్నాడు.

"అవకాశం వచ్చినా - అవసరం లేకపోవచ్చును గదా?"- మెట్టుతగ్గలేదు.

నవ్వేడు - ఇంకా ఎవరో నవ్వినట్టే అయ్యింది!-

అప్రయత్నంగానే తలవంచుకుంది!- మరి కాస్సేపటికి ఇంటర్వ్యూ పూర్తిని వెళ్ళవచ్చునని చెప్పాక లేచి వెళ్ళింది!-

మార్కులు ఎన్నివచ్చాయో తెలుసుకోవాలంటే - వారంరోజులు ఆగి ఉత్తరానికై ఎదురు చూడండి అని సెలవు తీసుకున్నారు!-

నారాయణరావుగారు - ఎందుకనో సంతృప్తిగానే వున్నారు!- 'కుదిరేటట్టే వుందని ఈపెళ్ళికాస్తా జరిపించేస్తే.... తర్వాత రిటైరైనా .... ఇంక ఏబాదరబందీలు వుండవు - ప్రకాశం చదువు ఒక్కటే మిగిలివుంటుంది'-అనుకున్నారు!-

జానకమ్మగారు కూడా .... తృప్తిగా నిట్టూర్చేరు - భగవంతుడు చల్లగాచూసి ఈకాస్త శుభకార్యం జరిగిందంటే - రామం ఎమ్. ఏ. ప్యాసై .... ప్రకాశం చదువు పూర్తయే నాటికి - ఏ ఇబ్బందులు వుండవని - అలాజరగాలనీ కోరుకుంది!-

o o o

రామం ఎమ్. ఎ. లో చేరిరూమ్‌తీసుకుని ఫ్రెండ్స్‌తో కలిసి వుంటున్నాడు, హైద్రాబాదులో -ఆరూమ్‌లోముగ్గురు

వుంటున్నారు .... విభిన్న మనస్తత్వాలు కాకపోయినా ముగ్గురూ మూడు రకాలైన కుటుంబాల నుంచి వచ్చేరు గనుక - కొన్ని అభిప్రాయాలలో తేడాలు వచ్చేవి!-అయితే- వారి వయస్సులు - చదువు - వాతావరణం - వార్ని ఒకటిగా చేసింది!-

ఎవరికి వారికి వ్యక్తిగత అభిప్రాయాలున్నా ....కలిసి సినీమాలకి వెళ్ళడం - సిగరెట్లు - షికార్లు - సరదాలు - సంబరాలు - మాత్రం ఒకటిగానే చేసేవారు!-

రామానికి తండ్రి పంపించే డబ్బు చాలటంలేదు!- 'డబ్బు చాలటంలేదు పంపించ గలరని'- ఉత్తరాలు రాసేవాడు!

నారాయణరావుగారు - సిటీలో అబ్బాయి ఏం కష్ట పడుతాడో అని ఉత్తరం రాగానే - ఎలాగో సర్దుబాటు చేసుకుని పంపేవారు!- ఎలాగైనా కొడుకు పరీక్షపాస్సై.... గట్టెక్కాలని - ఆయన ఆశ!-

భోజనం చేసి - వరండాలో నిల్చున్నారు. ఇంక బ్యాంకుకు వెళ్ళాలన్న తొందరలో - గేటు తీసుకుని - పోస్టుమాన్ ఉత్తరం ఇచ్చి వెళ్ళేడు! అది అసలు పెళ్ళివారి దగ్గర్నుంచేమో అనుకున్నారు. కానీ - రామం రాసేడు .... 'తనకి ఆ నెలలో ఏదో ఎస్కర్షన్ ప్రోగ్రాం ఉందని-అర్జెంటుగ ఒక వందరూపాయలు పంపమని-' రాసేడు!- ఉత్తరం మడచి జేబులో పెట్టుకుని - ఆలోచనలో పడ్డాడు నారాయ ణరావుగారు!-

"ఎక్క డినుంచీ వుత్తరం?- పెళ్ళివారిదగ్గర్నుంచేనా?" జానకమ్మగార్కి- లాట్రీడ్రా జరుగుతున్నప్పుడుండే ఆందోళన లాంటిది కల్గింది!-

"కాదు"- అన్నాడు నారాయణరావుగారు.

"మరి?"-

"అబ్బాయి దగ్గర్నుంచి!- వాడికేదో డబ్బు అవసరం వుందని రాసేడు!"

తెల్లబోయి చూసి- "మీరు ఈ నెలలో పంపించలేదా?" అన్నది.

"పంపాను! అయినా ఏదో అవసరం అంటున్నాడు. పోని ఒకసారి నేనే వెళ్ళి చూసివస్తాను!- ఆయన సాలోచనగ అంటుంటే -

"పోని ఆపని చేయండి! అబ్బాయిని చూసినట్టూ అవుతుంది!"-

"అదే ఆలోచిస్తున్నాను. ఇదిగో ఈ పెళ్లివారి వుత్తరం చూసుకున్నాక వెళ్లివస్తాను" అని అయన బ్యాంక్ కి వెళ్లిపోయారు.

జానకమ్మ లోపలికి వెళ్లి-మాలతికిచెప్పింది. అన్నయ్య రాసిన వుత్తరంసంగతి!

"అదేమిటమ్మా? మళ్లీ అంతడబ్బా!-అయినా-ఈమధ్య అన్నయ్య డబ్బువిలువ తెలియకుండా రాస్తున్నాడు."-

"ఏమో మరి?- వాడికెన్ని అవసరాలో?"-

"ఆఁ! పిచ్చిదానివి? అన్ని అవసరాలు తీర్చుకో గలమా? సర్దుకోవాలిగానీ! నాన్నగారు పంపగలరా?!-"

"నాకేం తెలుస్తాయి అవన్నీ!"- అన్నదేగానీ - ఆవిడకి 'మగపిల్లాడికి అవసరాలు వుండవామరి!'- అను కున్నది. ఆ మాట పైకిఅంటే మాలతి - ఒక ఉపన్యాసం ఇస్తుందనీ - ఆడపిల్లలకి అవసరాలు ఉండవా అంటుందనీ - అనలేదు!- ఆవిడలో పాతకాలపు ఛాందసభావాలు- సనాత నాచారాలు ... జీర్ణించుకు పోయాయి!- అందుకే - అప్పు డప్పుడు విశాల గుర్తువచ్చినా .... 'అలాచేయకుండా వుంటే బాగుండేది' - అనుకుంటుంది.

o o o

ఎదురు చూస్తున్న ఉత్తరం ఒకరోజు రానేవచ్చింది:-

'అమ్మాయి అన్నివిధాలా మాకందరికీ నచ్చింది - అయితే?.... కట్నంమాత్రం మీరు ఇస్తానన్నది బొత్తిగ నచ్చలేదు!- ఆడబిడ్డల లాంఛనాలు .... అత్తగారి లాంఛ నాలు అలకపాన్పు-అప్పగింతలు....అన్ని సవ్యంగ జరగాలని మా ఆడవాళ్ళ కోరిక!- ఆ ప్రకారం మీరన్నీ చేసి - కట్నం మే అడిగినట్లు ఎనిమిదివేలూ ఇస్తే .... వెంటనే తాంబూలాలు పుచ్చుకోవచ్చును' అదీసారాంశం!——

ఉత్తరం మాలతిచేతిలోపడింది! చిందులుతొక్కింది!- గంతులువేసి అరిచినంత పనిచేసింది! 'సిగ్గులేదూ?'- నేనా కావాల్సింది - డబ్బా ? అని ఉత్తరం విసిరికొట్టింది!- అన్నీ మౌనంగ విని ఉత్తరం కిందపడగానే జాగ్రత్తగ అందుకుని

దాచింది జానకమ్మ!- నారాయణరావుగారు ఇంట్లో లేరు! రాగానే ఆయనకిచ్చి ఆలోచించుకోవచ్చని ఆవిడఉద్దేశ్యం!!- మాలతితో వాదించి ఒప్పించే ఓపిక ఆవిడకి లేదు!—

సాయంత్రం మాలతి స్నేహితురాలింటికి వెళ్ళగానే ... నారాయణరావుగార్కి- ఉత్తరంఇచ్చి ఉదయం అమ్మాయి కోపంలోచేసిన చేష్టలన్నీ వర్ణించి .... "పిచ్చిపిల్లగానీ! డబ్బు ఖర్చుకాకుండా పెళ్ళెలా అవుతుందీ?- ఆడపిల్ల పెళ్ళంటే అప్పుచెయ్యద్దా?"-అని భార్యచెప్తుంటే- నారాయణరావుగార్కి- ఆలోచన తెగడంలేదు! అప్పైనా ఎంతని చేయగలం? మళ్ళీ తీర్చడమెలాగ? అని ఆయనబాధ!-

పిల్లనచ్చేక-మళ్ళీ ఈ లంకెలెందుకు?- అనుకున్నారు-

ఆ రాత్రిమాలతి - స్పష్టంగ చెప్పేసింది. నేను ఈ సంబంధం చేసుకోను!- అని—

జానకమ్మగారు కేకలేసింది! నారాయణరావుగారు నచ్చచెప్పబోయేరు! కానీ మాలతి గట్టిగానే పట్టుబట్టింది!-

"నాన్నగారూ - ఏమిటి మీారుచెప్తున్నదీ?- ఆడపిల్ల పెళ్ళిచేసి దివాళాతీసినా ఫర్వాలేదనా?-ఆ తర్వాత మళ్ళీ ఆ వియ్యాలవారు .... మిమ్మల్ని -హేళనచెయ్యరా?-ఒక్క- పెళ్ళితో సరిపోతుందా?- పండగలంటారు .... ఆషాడపట్టీలంటారు .... ఇంకా ఆపైన చెప్పేదేముంది?- ఆడపిల్లకి రెండు పురుళ్ళవరకు .... పుట్టింటివారే అన్ని వేడుకలు చేయాలంటారు!- అదిమన లాంఛనమనీ .... సాంప్రదాయమనీ - మన తరతరాలనుంచి వస్తున్న ఆచారమనీ చెప్తారు!-

పెళ్ళితో దివాళా తీసేక .... మిగతావన్నీ ఎలా చేయగలను?- అప్పుడు వాళ్ళు ఎత్తిపొడుపులకీ - సూటిపోటీ మాటలకి - కుళ్ళిపోతూ - ఆడపిల్లని కన్నపాపం ఇలాగే భరించాలి!?- అనుకుంటు జన్మంతా ఏడవాలా?- పది పన్నెండేళ్ళ క్రితం.... భవానీ అక్కయ్య పెళ్ళి - బామ్మ ముచ్చటకోసం చేసేరు- ఆ బామ్మ ఈనాడు లేదు - కానీ భవాని అక్కయ్య ఏంసుఖ పడుతోందో మీకు తెలియదా?- స్వంత అత్తయ్యనవుండీ- అన్నిటికి ఆరళ్ళుపెట్టి ఒక్క ముద్దు ముచ్చట జరగనియ్యలేదని మీరంతా అనుకోలేదూ?- శ్రీదేవి అక్కయ్యని 'సుఖపడు తుందని'- మనకంటే కాస్త పై మెట్టుమీదనున్న సంబంధం చేసేరు!- వాళ్ళేం చేస్తున్నారు?- ఆ వేడుక బాగా చేయలేదనీ ఈ ముచ్చట బాగా జరపలేదనీ - మొన్నమొన్న జరిగిన రాద్ధాంతం .... అలకలు గుర్తులేవూ?- శ్రీదేవి అక్కయ్య, పురుటికివస్తే .... బారసాల వేడుకకోసం - వాళ్ళత్తగారూ- ఆడబిడ్డా - బావగారూ వచ్చారా?- ఆ అత్తగారు ప్రతి దానికీ వంకపెట్టి - మనంవాళ్ళతో సరిపోమని తీసిపారేస్తూ- మనం చేసిన మర్యాదలు చాలవని అలిగి - ఆఖరికి వంద రూపాయలచీరా, రవిక, కూతురికి యాభై రూపాయలచీర, జాకెట్టు - సారెకోసం - మిఠాయి వుండలు - పసుపు కుంకుమ.... సున్నిపిండి - లాంటి జాబితాఅంతా పూర్తిచేసేసరికి శ్రీదేవి అక్కయ్య పురిటి ఖర్చుక్రింద - పాపకిగొలుసు - అక్కా- బావా బట్టలు-అన్నీకలపి పన్నెండు వందలదాకా అయ్యింది!- ఎంతకాలం తీర్చేరు?- పోనీ సంపాదించే కొడుకులున్నారా అంటే? —

"ఇప్పుడేమో అన్నయ్య చదువు ఇంకా పూర్తి కావాలి!- డబ్బు పంపమంటూ వాడు ఒకటే ఉత్తరాలు రాస్తాడు!- ఒక్క చేతిమీద ఎన్ని చేయగలరు?!- ఆడపిల్ల అనగానే - అప్పో సొప్పో చేసి పెళ్ళి చేయాలనుకోకండి!- అవన్నీ - మన వెనకటి పెద్దవాళ్ళు - పనిలేక పెట్టుకున్న రూల్స్!- కాలంతోపాటు మనుష్యులూ, వాళ్ళ ఆచారవ్యవహారాలు మారాలిగానీ - అవే పట్టుకుని వేలాడుతూ.... ముందుకు పోతామంటే ఎలాగ?-

"ఒకప్పుడు బాల్య వివాహాలున్నాయి! మూడేళ్ళకే పెళ్ళి! ఐదేళ్ళకి ఎనిమిదేళ్ళకి పదేళ్ళకి - క్రమంగ 'శారదా ఆక్టుబిల్' పాసు అయ్యేక -ఈడేరిన పిల్లలకి పెళ్ళిచేసే స్థితికి ఎదిగేరు! మరి ఆనాడు ఈడేరిన పిల్ల పెళ్ళికాకుండా ఇంట్లో వుంటే - వెలివేసి - సంఘబహిష్కరణ చేసేవారట గదా?- కానీ ఇప్పుడు ప్రతిఇంట్లో పెళ్ళికాల్సిన ఆడపిల్లలందరూ ఈడేరినవాళ్ళే!- ఆనాడు చాకలిపద్దు రాయడంవస్తే చాలనుకున్నారు!- ఈనాడు ఎంతవరకు చదివించగలిగితే అంతవరకు చదువుకుంటున్నారు!- ఆధునిక పరికరాలతో - సౌఖ్యం అనుభవించడం నేర్చుకున్న మనుష్యులు - అభ్యుదయ పథం - లో ఎందుకు నడవరూ? అవసరాల్ని -పరిస్థితుల్ని- అర్థంచేసుకుని అనుగుణంగ నడుచుకోడంతప్పా?"—

"ఉదయపు ఎండ లేతగవుంటుంది! గొడుగు అవసరం లేదు! అలాగని మిట్టమధ్యాహ్నం ఎండలో - గొడుగు చెప్పులూ లేకుండా వెళ్ళగలరా?- ఈ జీవితం మాత్రం

అలాంటిది కాదా నాన్నా?- నేటియుగంలో - కొడుకులతో సమానంగ కూతుళ్ళనికూడా చదివించి ఉద్యోగాలు చేయిం చటంలేదా?- సంసారంలో నల్గురి ఆసరాతో - సుఖంగ - ఆనందంగ బ్రతకటం తప్పా? తప్పనుకుంటే - నాకు చిన్న ప్పుడే పెళ్ళిచేయాల్సింది!- భవాని అక్కయ్య కూతురు ఇందూకు ఇప్పుడు ఎనిమిదేళ్ళకదా ఇంక పెళ్ళిచేసేయాలి!- చేయగలరా?"

"కొన్నిమాత్రమే ఆచరించి .... మిగిలినవాటికి మళ్ళీ సాంప్రదాయాలతో ముడిపెట్టడం మన బలహీనత .... పిరికి తనం! నల్గురు ఏమనుకుంటారో అనిభయం తప్ప - నిజంగా మనం పాటిస్తున్న ఆచారాలు....పద్ధతులు .... అర్థం తెలుసు కోకుండా చేస్తున్నాం!- నాల్గేళ్ళక్రితం - విశాలని అందరూ ఇలాంటి అర్థంలేని మూఢాచారాలతో సాధిస్తువుంటేనే - అది కనబడకుండా పోయింది! నిజంగాదాన్ని మనమంతా కలసి ఈ సంఘంనుంచి తరిమేసేం! అందుకే అది అలాపారి పోయింది! బతికేవుందో చచ్చిపోయిందో కానీ - మనం నమ్మిన సంప్రదాయం .... సనాతన" ఆచారాలు మటుకు- పచ్చగ కలకల లాడుతున్నాయి!-

"మగపెళ్ళివారనగానే కొండెక్కి-కూర్చుని గొంతెమ్మ కోర్కెలు కోరాలని వుందా?- అసలు శాస్త్రప్రకారం ... స్త్రీధనం వాడితే అధమాధమం - అంటారుగదా? మరి భార్య తెచ్చే కట్నంమీద...సంపాదనమీద....ఆస్థిమీద... పొలంమీద ఎందుకు ఆశపడాలి?!- అప్పుడు శాస్త్రధి క్కారం చేసినట్టుకాదా?—

"నాన్నా మీకు కోపంవచ్చినా బాధకల్గినా .... నాకీ పద్ధతులు నచ్చలేదు నాన్నా!- మన తాహతుకు సరితూగే సంబంధంవస్తే - చెయ్యండి - అంతవరకు తొందరపడి అప్పుల పాలవకండి!"- మాలతి తాను చెప్పదల్చుకున్న దంతా చెప్పేక - ఇంక తండ్రిఎదురుగ నిలవలేక - గబగబా లేచి గదిలోకి వెలింపోయింది!

నారాయణరావుగారు .... మౌనంగ విన్నారు!

జానకమ్మగారుఅవాక్కై-నిలబడి!- "ఔరా ఏం కాలం మాలతి నిన్న మొన్నటిపిల్ల! అప్పుడే ఎన్ని చెప్తోందో చూసేరా?"- అన్నది తేరుకుని - "అసలు ఇదంతా మనంఇచ్చు కున్న అలుసే!"- అనికూడా అన్నది—

సుధీర్ఘంగ ఆలోచిస్తున్న నారాయణరావుగారు - మామూలు స్థితిలోకివచ్చి .... "అలాఅనకు?- అలుసు ఇచ్చినా ఆలోచనాపరిధి అందరికీ పెరగదు!- 'చిన్నపిల్లలు' అని - తల్లితండ్రులు అనుకోడం సహజమేకానీ - వాళ్ళు కూడా వ్యక్తిత్వం సంతరించు కుంటున్నారు! మీ అమ్మలా నువ్వున్నావా? నీలాగ నీపిలలువుండాలని ఎలాఅనుకుంటాం?- భవానికన్న శ్రీదేవి - కొంచం పైమెట్టుఐతే .... మాలతి మరికొన్ని మెట్లు ఎక్కింది!- తలవంచుకుని పోయే స్వభావం భవానిదైతే-తలఎత్తి జవాబుచెప్పే మనస్తత్వం శ్రీదేవిది- జవాబే కాకుండా ....అవసరమనుకుంటే ఎదిరించగల ధైర్యం మాలతికివుంది!- అమ్మాయి చెప్పేదాంట్లో - అతిశయో క్తులు .... అబద్ధాలు ఏమీలేవు!- నిధానంగ ఆలోచిస్తే - అన్నీ నిజమే మరి!- అయినా ఎందుకు చేయలేక పోతున్నా

మంశేం - మాలతి చెప్పినట్టు పిరికితనం-బలహీనతః- వాటిని జయిస్తే!?- ఈనాడు జరిగే దురంతాలు - అన్యాయాలు ఆగిపోతాయి!- చూడు మరీ - పిల్లవచ్చేక....మరొక ముడు నాల్గువేల దగ్గర - వాళ్ళెందుకు వెనక్కి- తగ్గాలి?"- అని ప్రశ్నించేరు.

"వెనక్కి తగ్గిపోయేది మనమే!- ఎలాగో ఒకలాగ సర్దుబాటు చేసుకుని శుభం అనిపిస్తే .... మనబాధ్యత తీరుతుంది కదా?"-

"బాధ్యత తీరడం ముఖ్యంకాదు - అమ్మాయి సుఖపడుతుందా లేదా?- మనం మళ్లీ లేచ్చుకుని నిలబడగలమా? అని ఆలోచించాలి! అమ్మాయి చిన్నదైనా నాకెందుకో దానిమాటల్లో సబబే కనిపిస్తోంది। పోనీలే ఇదీ ఒకందుకు మంచిదే!- మీరు మరొకటి చూసుకోండి అని రాసిపడేస్తాను!"- అన్నారు.

"ఏమిటో మీ తండ్రీకూతుళ్ళ వరుస నాకేం నచ్చలేదని" - జానకమ్మగారు లేచి ఇంట్లోకెళ్ళి పోయింది!-

నారాయణరావుగారు.... మాలతిని పిల్చి...."ఏమ్మా? మేము మీకోరిక తీర్చలేమని రాయనా? మరి అబ్బాయి నీకు" .... అనిఆగి సంశయంగ చూసేరు.

మాలతి నవ్వి-నాకుకావల్సింది సంస్కారం నాన్నా!- కన్నతండ్రి కష్టసుఖాలు ఆలోచించగలను కానీ - రెండు నిముషాలు ముఖంచూసిన మనిషిమీద - మమకారాలు పెంచుకోనుః- బాహ్యస్వరూపం చూసి మోసపోతే ...

రేపు నేనే కష్టపడాల్సి రావచ్చును! నిరభ్యంతరంగ ఈ సంబంధం మాకు వద్దని రాసిపడేయండి!"- అన్నది.

"అలాగేనమ్మా" - అని లేచారు.

o o o

రైలు దిగి శిన్నగా.... రామంరూమ్ వెతుక్కుని వెళ్లే సరికి శ్రమేఅయినా .... అక్కడమాత్రం తలుపు తట్టగానే.... ఓపని కుర్రాడు తలుపు తెరచి .... ఎవరో తెలుసుకుని .... బోలెడంత మర్యాదచేసేడు!- 'నువ్వెవరూ?' అంటే బాబు గార్ల పనికుర్రాణ్ణి అనిచెప్పాడు.

బాత్ రూమ్ చూపించి .... స్నానాకి నీళ్ళుపెట్టి .... కాఫీతీసుకువచ్చి .... టిఫెన్ తీసుకునివచ్చి .... పక్కదులిపి.... కాంప్ కాటుమీద ఇస్త్రీదుప్పటి పరచి .... కాస్సేపు రెస్టు తీసుకోండి సార్ - బాబుగారు వస్తారని చెప్పిబయటికి వెళ్ళి పోయాడు -

వాడు వెళ్లిన కొంతసేపటికి - ఇంటి గలాయన వచ్చి తలుపుతట్టేడు .... నారాయణరావుగారు .... తలుపు తీసి "ఎవరండీ ? ఏంకావాలీ?"- అని అడిగితే - ఆయన చిన్నగ నవ్వి - నేను ఈ ఇంటి యజమానినిలెండి .... మీరూ...."

ఓహో రండి .... నేను రామం వాళ్ళ నాన్నని .... ఓసారి చూసిపోదామనీ ...."-

ఆయన లోపలికి వచ్చి...."అలాగా మంచిపని చేసేరు! నెల నెలా డబ్బు పంపించేయడం కంటే .... ఇలా మధ్యమధ్య వచ్చి .... మంచిచెడ్డలు విచారించడం చాలా అవసరం!-

ఆర్నెల్లనుంచీ నేను అదే అనుకుంటున్నాను .... ఇప్పటికి ఆముగ్గురు అబ్బాయిల్లో ఒకరైన రామం తండ్రిగారు .... మీరు రావడంనాకు చాలా సంతోషంగవుంది!- మిగిలిన వాళ్ళుకూడా ఎప్పటికైనా వస్తె బాగుంటుంది!- వయస్సు లోవున్న పిల్లల్ని అదుపులో పెట్టాలనుకోడం కష్టమే అనుకోండి అయినా తల్లి తండ్రులు చూస్తూ .... వదిలేసుకోలేరుగదా?-" అన్నాడు.

"మీరనేదేమిటో? సరిగ్గాచెప్పండి!-" నారాయణ రావుగార్కి- మనసులో ఏదో జంకుగానే వుంది!

"ఏవుందండీ!- మంచివయస్సు! పోష్టుగ్రాడ్యుయేట్ చదువు!- జీవితంలోవున్న ఆనందాలన్నీ వాళ్ళకే వుండాలనుకోవటం సహజమేనురి!- అయితే మరీవిపరీతమైనప్పుడు భరించడం కష్టంకదా?- వీళ్లుఅసలు క్లాసులుకి అటెండవుతారా?- వారానికి నాల్గుసినీమాలు - రాత్రిపూట గదిలో పేకాట.... సిగరెట్లుకంపు .... తెల్లవారేసరికి కుప్పలు - కుప్పలు పీకలు పడివుంటాయి! ఈగోల గందరగోళం భరించలేక నేను - ఇది సంసార్లకొంప! ఇలాఅయితే గదిఖాళీచేసి పొమ్మన్నాను. అలా కోప్పడి నప్పుడు రెండు మూడు రోజులు వూరుకునే వారు! మళ్లీ మొదలుపెట్టేవారు! ఇలాగ నాల్గుసార్లు జరిగేక- ఇక్కడ లాభంలేదనుకుని - అవతల బజారులోవున్న మరొక బడుద్ధాయి గదికి మార్చుకున్నారు! నివాసం ఇక్కడ .... తైతక్కలు అక్కడ!!- నెలనెలా మనియార్డర్లు అందుకుంటు .... అందరి బాకీలు ఎగేసి .... సినీమాలు - షికార్లు.... జులాయితిరుగుళ్లు!- తల్లితండ్రులు ఏదో కష్టమైనా సరే

అనుకుని డబ్బుపంపిస్తారు. వీళ్ళేమో ఇలా దుర్వినియోగం చేస్తారు!_ మొదట్లో రామం బుద్ధిమంతుళ్ళాగే కనిపించేడు!_ కానీ సహవాసదోషం .... పాడుచేసింది!_ పాపం మీరేమో అబ్బాయి అభివృద్ధిలోకి వస్తాడని ఆశపడుతున్నారు కానీ .... మీరు ఇప్పుడు గనుక మందలించకపోతే _ తర్వాత ఇంకే లాభంలేదు!_ ఇప్పుడు కేవలం సిగరేట్లకి, సినీమాలకే పరిమితంగవుంది వాళ్ళధోరణి!_ కొన్నాళ్ళైతే _ శ్రుతిమించి .... 'మదిరామదువు'లోకి మారినా ఆశ్చర్యంలేదు!_ బహుశా ఇప్పుడు 'మార్నింగ్ షో'కి వెళ్లేరేమో?_ ఇదిగో ఈ పని కుర్రాడు .... పరిగెత్తుకుని వెళ్ళి వార్త అందచేస్తాడు!_ నాల్గు నోటుబుక్కులు పట్టుకుని .... యూనివర్సిటీనుంచే వస్తున్నట్టు వస్తారు!_ బాగా నేర్చుకున్నారులెండి _ మీరు గట్టిగ మందలించి _ బుద్ధిచెప్పండి!...

నేనుఇలా చెప్తున్నానని మరోలా అనుకోకండి ! వస్తా".... అని వెళ్ళిపోయాడు!——

నారాయణరావుగారికి _చేదుమందు మింగినట్టువుంది గొంతుకంతా!_ రామం ఇలాతయారయ్యేడా? ఎన్నిఆశలు వాడిమీద? నాస్థితిగతులు వాడికి తెలియకనా?_ చిన్నప్పటి నుంచీ _ గుట్టుగ సంసారం సాగిస్తు .... ఆ బాంక్ ఉద్యోగం లోనే _ సంసారం లాక్కువస్తూ ....వున్న ఆ కొద్దిపొలంతో_ దానిమీదవచ్చే ఆదాయం జాగ్రత్తచేసి _ పిల్లలకి చదువులు పెళ్ళిళ్ళు చేసుకువస్తూ ....ఎంతనిండుగ బ్రతుకుతున్నానూ?_ ఎన్నడైనా సినీమాలు చూసేనా .... సిగరెట్లు తాగేనా?_ మంచిబట్టలు కుట్టించుకున్నానా? ఎంబాసిడర్ బూట్లు ....

సూట్లు వేసుకున్నానా?- మా రెండుకు వీసుక్షిలా తయారవు తున్నాడూ?.... అలా అనుకుంటున్నప్పుడు - రెండు రోజుల క్రితం - ఇంటిదగ్గర సన్నివేశాలు గుర్తుకొచ్చాయి' జానకి పుస్తకట్టు .... పిల్లల్ని వుండమనడం .... సబబు కాదన్నాను గదా?- అలాంటప్పుడు నేను బతికినట్టు రాము, ప్రకాశం ఎలా బతుకుతారూ? మార్పు సహజం కదా?. కానీ మాలతి మార్పు, ఇంటిమంచికోసం తొందరపడుతూన్నదిగాని స్వార్థపూరితమైంది కాదు!- అలాంటి మంచిమార్పు రామానికి ఎందుకు కలగకూడదూ? గ్రామ్యాకం వచ్చినవాడికి - నేను బోధ చేయాలా?- నన్ను మోసంచేస్తున్న కొడుక్కి- నేను నీతి సూత్రాలు చెప్పినా వింటాడని నమ్మకంలేదు! కనుక నేను ఒకపనిచేస్తే .... ఆ అవును అలాచేస్తాను' అనుకుని - వెంటనే బాగ్ సర్దేసుకుని - బట్టలు వేసుకుని - ఒకచిన్న చీటీమీద- తను రెండురోజులు వుందామని వచ్చాను గానీ ... కడుపు నిండిపోయింది వెళుతున్నానని రాసి - పెట్టాలనుకున్నారు!- ఇంతలో - తలుపు తోసుకుని రామం వచ్చాడు!—

"ఎప్పుడు వచ్చారునాన్నా? ఉత్తరం రాస్తే స్టేషన్‌కి వచ్చేవాణ్ణిగదా?" అంటూ ఏదేదోమాట్లాడేస్తూ .... అడిగినవి అడగనివి అన్నీ చెప్పేస్తు ....డబ్బు ఇబ్బందులు సిటీలో ఎలావుంటాయో?... తనుఎంత జాగ్రత్తగ వున్నా - డబ్బు చాలటం లేదని .... ఏవేవో చెప్పేడు!- అంతేగానీ తల్లిని గురించి .... చెల్లినిగురించి అడగనేలేదు! ప్రకాశం మాటా ఎత్తలేదు!- మళ్ళీ సాయంత్రం వస్తానని చెప్పి .... హోటల్ కెళ్ళి భోజనంచేసి రమ్మనిచెప్పి వెళ్ళిపోయాడు!—

నారాయణరావుగారు .... ముళ్ళమీద వున్నట్టు ఆ ఒక్కరోజూవుండి తెచ్చిన వందరూపాయలు చేతిలో పెట్టి..."జాగ్రత్త నేను చెప్పేది ఏంలేదు-" అని రైలెక్కేరు!-

రైలు సాగినంతసేపూ ఆయన మనసు బాధపడుతూనే వుంది!- రామంలో మునపటి ఆప్యాయత .... అభిమానం కనిపించలేదు. వాడిస్నేహితుల వేషాలుచూస్తె .... బాగా దర్పంగ అయినింటిబిడ్డల్లా కనిపించేరు!- తనువాళ్ళముందు.... రామం పేదతండ్రిగ మిగిలిపోయానా?'- అని బాధపడ్డారు!- కోపమూ వచ్చింది!-ఆకోపంలోనే-జానకమ్మ చేసిఇచ్చిన... మినపసున్నివుండలు .... చేగోడీల పొట్లం ఇవ్వలేక ....రైల్లో అడుక్కునే వాళ్ళకి పంచిపెట్టారు!-

'అవును మరి!- పలావులు....చిప్స్....క్రీం బిస్కట్లు.... కేకులు .... తినే రామానికి - ఈ పాతకాలం పిండివంటలు నామోషీకావచ్చు ననుకుని ... నిట్టూర్చేరు!-

ఇంటికి వచ్చాక .... జానకమ్మగారు .... ఎన్నో అడుగుతూవుంటే .... పొడిపొడిగ సమాధానాలు చెప్పి తప్పించుకున్నారు -

ప్రయాణం అలసటలో వున్నారనుకుంది, జానకమ్మ.

కానీ మాలతికి అనుమానం వచ్చింది. నాన్నగారికి- ఊరికివెళ్ళేముందున్న ఉత్సాహం....వచ్చేసరికి లేదు!- అక్కడ రామం అన్నయ్య కారెక్టర్‌లో ఏదో మార్పువుండి వుంటుంది!- లేకపోతే అంతంతడబ్బు ఎందుకుట!- పాపం నాన్నగారి మనసు దెబ్బతిని వుంటుంది!- అనుకుంది -

రోజులు గడిచిపోతున్నాయి! మాలతినుఫ్లీ పెళ్ళిచూపుల ఏర్పాటు జరగనివ్వలేదు!- ఇంట్లోకూర్చుని ఏంచేయుడానికీ తోచక - సాయంకాలంపూట కొత్తగ పెట్టిన టైపు ఇనిస్టూట్‌కి వెళ్ళి నేర్చుకుంటానంది!- జానకమ్మగారు ఒప్పుకోలేదు! నారాయణరావుగారు ఆలోచనలో పడ్డారు!-

ఈలోపులో - రామానికి డబ్బులుఫ్లీ పంపించవలసి వచ్చింది! నారాయణరావుగారు ఇక ఆలోచించ దలుచుకోలేదు....మగపిల్లాడు బాధ్యతారహితంగా ప్రవర్తిస్తూవుంటే బాధపడటం - ఆడపిల్ల విచక్షణతో ముందుకు సాగుతానంటే - ఆటంకపరచటం - రెండూ చేతకానిపనులే!- సాధ్యమైనంత వరకు డబ్బుపంపడానికి వీలవదని - రామానికి తెలియచేస్తూవుండాలి. మాలతి నేర్చుకుంటానన్న టైపు నేర్చుకోనివ్వాలి!- అనుకున్నారు. ఆరోజు సాయంత్రమే మాలతిని పిల్చి టైపు నేర్చుకోమని ఫీజుకట్టడానికి డబ్బుఇచ్చేరు.

జానకమ్మ మౌనంగ వూరుకుంది!

# 11

వీధి వరండాలో .... అలవాటైన కుర్చీలో పేపర్ చూస్తూ కూర్చున్నారు, నర్సింహంగారు. బయట ఎండ తీక్షణంగవుంది'- అయినా-ఆ ఇంట్లోకి గాలి బాగా వస్తుంది. వారం రోజుల్క్రితం రెండో కూతురు ప్రమీల పిల్లలిద్దర్నీ తీసుకుని .... పుట్టింటికి వచ్చింది! గదిలోపిల్లలు మంచాలమీద పడుకున్నారు. పక్కన స్టాండ్ ఫ్యాన్ 'ర య్'మని తిరుగుతోంది. హాల్లో తల్లికూతుళ్లు బాతాకానీలో పడ్డారు.

పైన సీలింగ్ ఫ్యాన్ డ్యూటీ చేస్తూనేవుంది. శ్రీదేవి లోపల కాఫీపెట్టే ప్రయత్నంలో వుంది.-

క్రితం రోజు సాయంకాలం-కృష్ణ పాపకోసంముచ్చట పడిఓకౌ త్తగానుకొనుక్కొచ్చాడు. శ్రీదేవికిచూపించాడు.... చాలాబాగుంది కనుక సంతోషపడింది. తీరా రేటు తెలుసుకుని - హమ్మయ్యో పద్దెనిమిది, రూపాయలే?- రెండేళ్ళ కుర్రదానికి - ఇంతఖరపెట్టి తేకపోతేనేం?- పట్టుకెళ్లి ఇచ్చేయండి'' అన్నది. కృష్ణకి చాలాకోపం వచ్చింది! మెల్లగ భార్యకి నచ్చచెప్పబోయేడు. - కానీ వినలేదు. 'మీకూ మీ తల్లి గుణాలేఅబ్బాయి!- ఎంతైనా ఆగూటిచిలక కదా?- లేనిపోని డాబులకి దర్జాలకీ పోయి-డబ్బంతాతగలేసుకోడం.... ఆతర్వాత క్రుంగిపోడం!- ఎందుకు చెప్పారునాకు?- మనం జాగ్రత్తగవుందాము .... డబ్బు ఆదాచేద్దాం!- అప్పుడు మా అమ్మ నోరెత్తడానికి వుండదు!.... అని ఊకదంపుడు ఉపన్యాసాలే కానీ .... కార్యాచరణ మాత్రంలేదు!- సరేలెండి మిమ్మల్ని నమ్మడం - నాదే తెలివి తక్కువ!- ఎంతైనా ఆ అమ్మకి కొడుకుకదా?'- అంది-కృష్ణకి ఓర్పు నశించింది - కోపంలో నాల్గు అనేసేడు.-

'అవును - నేను మా అమ్మకి కొడుకుని .... నువ్వు మీ అబ్బకి కూతురివి!- జీవితంఅంతా గిరిగీసుకుని.... కూడబెట్టు!- దాన్ని పొదుపు అనరు!- లోభితనం అంటారు. సరదాలు .... సంతోషాలు .... అన్నీ అణగారి పోయాయిలే!- ఇంక భోజనంకూడా రేపటినుంచి ఒకపూటే తింటే సరి!- బోలెడంత కూడబెట్టవచ్చును! అనుభవించడం కూడా

అందరికీ చేతకాదు!- నిజమే ఏ ఇంటిచిలుక ఆ ఇంటిపాటే పాడుతుంది! మీ బావవాళ్ళకి కావల్సినంత ఆస్థివున్నా.... మీ అక్కయ్యని ఏంసుఖపెడుతున్నారూ?-' అనేసరికి- శ్రీదేవి - కళ్ళల్లో ఎర్రజీరలు తేలేయి! తీక్షణంగచూసి - మాఅక్క పేరు మీ రెత్తటానికి వీలులేదు!- మన గొడవలు మనమధ్యే వుండనీయండి - అవును, నేను మాఇంటి పలుకులే పలుకుతాను!- కూడబెట్టగలగడం కూడా పుట్టుకతో రావాలి!- మానాన్నకి ఆ నేర్పువుంది గనుకనే - ఈనాడు మానాన్న కూతుళ్ళిద్దర్ని - మంచి ఇళ్ళల్లో పడేసి - మా తమ్ముణ్ణి-ఎమ్ ఏ చదివిస్తున్నారు!- తాను నలిగిపోయినా.... తనపిల్లల భవిష్యత్తు, ఉజ్వలంగ ఉండాలనీ .... వాళ్లు సుఖపడాలనీ - మావాళ్ళ ఉద్దేశ్యం! మానాన్నగారి ఆశయాలు ఆమోదనీయమైనవి కనుకనే - మాఅమ్మ ఆయన మాటని వేదంలా పాటిస్తూ సహకరిస్తోంది!- మరి మీఅమ్మ కోరికలు సహజమైనవే అయితే .... మీనాన్నగారు ఎందుకు వ్యతిరేకించేరూ?- మీరూ ఒకప్పుడు నిరసించినవారే!- మళ్ళీబుద్ధి ఇలామారిపోతూ వుంటుంది!' అనేసరికి - కృష్ణ - 'సరేలే నీతో వాదించలేను .... మీఇంటిబుద్ధులు మంచివే అయితే మీ అమ్మగారిలా నువ్వూ నన్ను మన్నించడం నేర్చుకోవాలిగదా?- పోనీలే ఇప్పుడు మళ్లీ విరుచుకుని పడతావు .... నేను వెళ్ళి ఈగాను వాపసు ఇచ్చేస్తాను' .... అనిలేచాడు అక్కర్లేదు వుండనీయండి - మీఅమ్మపోలిక మీరుంచుకోండి-మా అమ్మపోలిక నేనుంచుకుంటాను....కాదని వెళ్ళితే! నామీద ఒట్టు!'- అనివిసురుగా పంతంగాబయటికి వచ్చేసింది

చేసేదిలేక కృష్ణ బయటికి వెళ్లిపోయాడు - కానీ ఒంటరిగా పార్కులో కూర్చున్నప్పుడు - కళ్ళఎదురుగా.... చిరుగులగౌను వేసుకుని - దీనంగ అడుక్కుంటున్న ముష్టిపిల్ల కనబడింది!- పల్లీలు, బటానీలు అమ్ముకునే కుర్రాళ్లు - ఇళ్ళల్లో వీలవక పార్కులకి వచ్చి పాఠాలు చదువుకునే - ఇరుకుబతుకుల, పేదవిద్యార్థులు - గేటుదగ్గర .... చిన్న చిన్న ప్లాస్టిక్ సామాన్లు అమ్మే ముసలమ్మ .... చాలారకాలమంది కనిపించేరు .... కృష్ణ మనస్సు వికలమైంది!

'జీవితం ఎంత చిత్రమైంది? - కళ్లెదుట కనిపించే సత్యాన్ని చాటుచేసుకుని బతికేయాలంటుంది ఈమనస్సు!- పరిస్థితులకి లొంగివుండాలనీ అంటుంది అదేమనస్సు!- అడుగు అడుగునా - ఎగుడు దిగుళ్ళు .... సంఘర్షణలు .... ఉద్రేకాలతో సుళ్ళు తిరుగుతు .... సాగిపోయే ఈ జీవితం- గమ్యం చేరేలోపల .... ఎన్నెన్ని మలుపులో?!-

'ఇందాక అనవసరంగ శ్రీదేవిని నొప్పించేను కానీ - తను చెప్పినదాంట్లో నిజంలేదా?- అంతఖరీదు పెట్టి కొన్న గౌను రోజూవాడుతామా?- దాచిపెట్టుకునే దానికిఎందుకు?- అయినా పాపకి దానిఖరీదుకాని అందాలుగాని తెలుసా? పెద్దాళ్ళ ముచ్చటకోసం - ఖరీదులుపెట్టి కొంటారుగానీ - పెద్దదయాక ఎలాంటిజీవితం అనుభవించాల్సి వస్తుందో?- చిన్నప్పుడు - అమ్మవాళ్లు చేసిన ఆర్భాటాలువల్ల - ఈనాడు నాకేమైనా లాభం కల్గిందా?- నిజం ఆలోచిస్తే - చిన్నప్పుడు ఎలాపెంచినా .... జ్ఞానం తెలిసేక - సంతృప్తిగ వుండేటట్టు

(15)

చూడ్డమే - తల్లితండ్రులధర్మం!- ఏమిటో అన్నీ తెలిసినా.... మళ్లీ పొరపాట్లు చేయకుండా వుండలేం!' అనుకున్నాడు

శ్రీదేవికూడా .... 'అనవసరంగ తొందరపడ్డాను - బొత్తిగ ఆయన సరదాలన్నీ కుదించేస్తున్నాను! చీటికి మాటికీ - వాళ్ళ వాళ్ళని వేలెత్తి చూపిస్తూవుంటే ఎంతకని సహిస్తారు?- ఎంతఆస్థివున్నా భవాని అక్కయ్యకి సుఖం లేదుఅని - అమ్మవాళ్ళూ అనుకోలేదా?- ఉండీ అనుభవించ లేనివాళ్ళకింద లెక్కగదా?- ఏదో వున్నంతలో బాగా వుందామనుకునే ఆయన్ని నేనుఇలా దెప్పిపొడవటం ఏంబా గుంది?- ఛ! వారు ఇంటికి వచ్చాక - నా తొందరపాటుని క్షమించమనాలి' - అనుకుంది.

ఆ సాయంత్రం - అత్తాడబడుచులు - షాపింగ్ కి బయలుదేరి వెళ్లేరు - 'కృష్ణవచ్చాక'-శ్రీదేవి నిమ్మకాయ షరబత్ అందించి .... ఏమండీ .... 'అనేంతలో సన్నజాజుల పొట్లం ఇచ్చి - 'దేవీ....' అని కృష్ణ అందుకున్నాడు ....

అరగంట సేపు ఒకళ్ళ నొకళ్లు క్షమాపణలు .... సమర్థింపులు .... మెచ్చుకోడాలు అయ్యేక - మామగారు, పాప నెత్తుకుని బయటనుంచి వచ్చాక-'అవునుగానీ వీళ్ళంతా ఎక్కడికి వెళ్ళినట్టూ?' అనడిగేడు:—

'ఆ! ఏముందీ?- మీ అక్కయ్యగార్కి- బట్టలుకావా ల్సివచ్చాయి - మీ అమ్మగారిదగ్గర ధనరాసులు మూల్గు తున్నాయిగదా? షాపింగ్ కి బయలుదేరేరు!- అయినా మీ నాన్నగారు ఇలా నోరుమూసుకుని కూర్చోడం నాకు నచ్చ

లేదు- పోనీమీరైనా ఓ మాటనగూడదుటండీ -అనేసరికి - దేవి 'మళ్లీ మర్చిపోతున్నావు....ఆవిషయంలో మనంకల్గచేసు కోవద్దని చెప్పేనుగదా?'- అని గుర్తుచేసేడు- 'ఊ! సరే-' అని - పాపకోసం బయటికి వెళ్ళింది —

రాత్రి వాళ్ళు కొన్నబట్టలు .... వాళ్ళ గొప్పలు ... దర్పాలు వింటుంటే ఒళ్ళుమండిపోయినా .... నోరుమూసుకుంది!—

మళ్లీ ఈరోజు మధ్యాహ్నం .... హాల్లోచేరి నిన్న చెప్పుకోగా మిగిలిపోయినవి - మళ్లీ మొదలెట్టేరు?—

కాఫీ పెట్టున్న శ్రీదేవికి కూడా .... నిన్న మరచిపోయిన కోపం మళ్లీ గుర్తువచ్చింది - పొగలు కక్కుతున్న కాఫీ పట్టుకుని - హాల్లోకివచ్చి అందరికీ అందించి-వరండాలో కూర్చున్న మామగార్కి-కూడా ఇచ్చి - తిరిగి వంటింట్లోకి వెళ్ళబోతూ - పాపపడుకున్న గదిలోకి తొంగిచూసింది!-

ఆడబడుచుగారి పిల్లలిద్దరు-ఎనిమిదేళ్ళ రమ-ఆరేళ్ళ మధుమంచంమీద హాయిగపడుకుని నిద్రబోతున్నారు....కిటికీలోనుంచి గాలిబాగా వస్తోంది. అయినా మంచంపక్క ఫాను గిర్రున తిరుగుతూనే వుంది!- పాప పడుకున్న మంచం మాత్రం కాస్తదూరంగ కిటికీకి పక్కగవుంది. అయినా గాలి తగుల్తూనేవుంది.

శ్రీదేవి మనస్సులో మరుగుతున్న కోపం .... పైకి వచ్చేసింది. గబగబా వెళ్ళి ఫాను ఆవుచేసి-బయటికివచ్చేసింది.

కొంచంసేపయేసరికి -కొంపలంటుకున్నంత కంగారుగ- మధు లేచి కూర్చుని ఏడుపు మొదలుపెట్టేడు - హాల్లో

రత్నమ్మ....ప్రమీలా.... గిరిజా ఒక్క ఉదుటున లేచి పరిగెత్తేరు గదిలోకి 'ఏమైందిరా?'- అని——

ఫాను ఆగిపోయిందని చూపించేడు!- పడుకున్నంత సేపు ఫాను తిరగాల్సిందే వాడికి అది ఈనాటి అలవాటు కాదు!- చిన్నప్పట్నుంచీ వాళ్ళమ్మ చేసిన ముద్దుఅది!-

ఇది బహుశా శ్రీదేవే చేసివుంటుందని వాళ్ళకి అనుమానం వచ్చి పిల్చి అడిగేరు.

"ఔను. గాలివస్తూనే వుందిగదా?"- అంది దృఢంగ.

"అహా! ఆ గాలిచాలని ఈపని చేసేవా!"- అని రత్నమ్మ కసిరింది.

"అనవసరంగ ఫాను ఎందుకని? అయినా నిద్రపోతూ నేవుంటే - ఇంకా ఫానుఎందుకు? నిద్రపట్టక పోతేగానీ?"-

ప్రమీల కలగచేసుకుని- "చూడుమరదలా - మా పిల్లలకి ఫాను నిద్రపోతున్నా, కూచున్నా ఉండాల్సిందే!- కరెంట్ బిల్ మీరివ్వలేకపోతే నేనిస్తానుగానీ - మా అలవాట్లు నువ్వు మార్చాలని ప్రయత్నం చేయకు!"- అంది నిష్ఠూరంగ.

"ఎక్కడికి పోతాయిబుద్ధులు?-" గిరిజ వ్యంగ్యంగ విసిరింది.

"అయినా నీ పెత్తనంఏమిటే?- పుట్టింటికి పిల్లలువస్తే వాళ్ళిష్టం వచ్చినట్టువుండాలి! నువ్వేమిటి చెప్పేది? బిల్లు నేనిస్తాను! నువ్వు నీ మొగుడు ఇవ్వక్కర్లేదు!- అన్నీ దరిద్రపు బుద్ధులు!- ఎన్నడైనా అనుభవించిన ముఖమా ఏమన్నానా?

ఇంకోసారి ఇలాంటి విషయాల్లో కలగచేసుకుంటే వూరుకు నేదిలేదు!-" అని హూంకరించింది అత్త!

శ్రీదేవి ఇకఆగలేక - "అవును నేను ఎలా అనుభవి స్తాను?- మనింట్లో డాక్టర్లు ఇంజనీర్లు ఎవరూ లేరుగ?- ఏదో ఆఫీసులో పనిచేసుకునే క్లర్కులకి వాళ్ళావిడకి - ఏ అనుభ వాలుంటాయి?"- అంది అక్కసుగ?

రత్నమ్మకి తగలవలసిన చోటే తగిలింది దెబ్బ!- తన కొడుకుని పెద్దచదువులు చదివించలేదు! కోడలి ఎత్తిపొడు పుకి నోరుమూసుకుని వుండటం ఆవిడకి అవమానంగ లెక్క!- అందుకే విసవిస వరండాలోకి నడిచి "ఏంచేస్తున్నారూ?- విన్నారా దాని మాటలు?- ఇంట్లో ప్రతిదానికి దీనిగోల ఎక్కువై పోయింది! మెడకి వేస్తే కాలికివేస్తుంది - కాలికి వెస్తే మెడకి! - పుట్టింటికి ఆడబడచువస్తే ఇలాగేనా అల్లరి చేయడం?! అని పితూరీచేసింది!

నర్సింహంగారు అతినిధానంగ పేపర్ పక్కకి జరిపి- ఏవరూ? కోడలా?- పిచ్చిపిల్ల! తెలియదు. ఇంకా చిన్నది కదూ? తెలుసుకుంటుందిలే!" అన్నారు.

"ఏమిటి తెలుసుకునేది? ప్రతిరోజు ప్రతివిషయానికి బీదఅరుపులు... ధర్మపన్నాలు! గుడ్డువచ్చి పిల్లని వెక్కిరించిందిట! ఇదా నాకు చెప్పేది? మీారు ఇలా బెల్లంమొత్తిన రాయిలా కూర్చుంటారుగనుకే-ఇంటికొచ్చిన కోడలు అలా పేట్రేగి పోతుంది!" అని గర్జించే సరికి-ఆయన చిన్నగ నవ్వి- "చూడు రత్నం-ఇప్పుడు నేనేంచేయగలను? సర్వీసులోవుండ

గానే ఇంట్లోవిషయాలు జోక్యం చేసుకోలేదు. ఇంక ఇప్పుడు రిటైర్ అయికూర్చుని- ఎవర్నిఏంఅనగలను?"- అన్నారు.

రత్నమ్మకి అందులో వ్యంగ్యం అర్థమైంది!

"ఉహూ!- సరే అయితే నేనే చూస్తాలెండి!" అనేసి లోపలికి మళ్ళీ విసురుగపోయింది!—

శ్రీదేవి - అక్కడుండకుండా వంటింట్లో కెళ్ళిపోయింది!—

తల్లీకూతుళ్ళు- పిల్లలకి ఫాన్ వేసి-శ్రీదేవిని- వాళ్ళ పుట్టింటివార్ని- తెగదెప్పి అలిసిపోయి- పడుకున్నారు!

o o o

ప్రమీల పిల్లలుమళ్ళీవాళ్ళింటికి వాళ్ళు వెళ్ళేదాకా.... రత్నమ్మ ఏదో ఒకటికొని- శ్రీదేవి మీద పగతీర్చుకుంది!- ఆమె వెళ్ళిన వారం రోజులకి పెద్దకూతురు జయ నలుగురి పిల్లలతో దిగింది!- ఆవిడఅసిస్టెంట్ ఇంజనీరుగారి భార్య!

పక్షపాతం చూపకుండా రత్నమ్మ- పెద్దమ్మాయికి కూడా...అన్నీకొనిపెట్టింది!- బ్యాంక్ కి వెళ్ళి తెచ్చేది- కృష్ణే గనుక, శ్రీదేవికి, ఎంత డబ్బుఖర్చు అవుతుందో తెలిసిపోతూనేవుండేది!- నెల్లాళ్ళయ్యేక- జయ పిల్లలువెళ్ళేక-శ్రీదేవి భర్తకి చెప్పింది!—

ఆడపిల్ల- పుట్టింటికి వస్తే...ఇంత పసుపు కుంకుమ.... చేతనైన చీర రవికల గుడ్డా కోరాలి!- ఆమె వెళ్ళిపోతూంటే 'అయ్యో మళ్ళీ ఎప్పుడు వస్తావమ్మా'? అని అడిగించుకునేట

ట్రుండాలిగనీ- ఇల్లు గుల్ల చేసి- ఇంట్లో వాళ్ళని పీల్చిపిప్పి చేసి- 'అమ్మోయ్ ఇదెప్పుడు పోతుందిరా బాబూ' అనిపించాలా?- వాళ్ళకేం లేదా? డాక్టర్లు...ఇంజనీర్లు ... పైసంపాదనలు!- మరెందుకుట ఈ దేవిరింపులు?- మళ్ళీ వాళ్ళ ఇళ్ళల్లో ఆడబిడ్డలకి పెట్టేటప్పుడు- తెగశాపనార్థాలు- ఏడుపులు! ఛీ ఏం కుతంత్రపుబుద్ధి?- మీ అమ్మగార్ని గమనించేరా? 'కొడుకైనవాడు తన మాటవినాల' అల్లుడైనవాడూ తన మాటేవినాలి!- మరి తన కొడుకైనవాడు మరొకరికి అల్లుడవుతాడుగదా? అప్పుడు అత్తమాట వినవద్దా?!- అమ్మో అలా పనికిరాదు! మామగారు తను చెప్పినట్లు వింటున్నారు గదా? మరి కొడుకు కోడలిమాట వినవద్దా?- ఊహూ అలావల్లకాదు-ఏం రూల్సు ఇవి? ఎంతస్వార్థమో గమనించేరా?- ఎలా దీన్ని పరిష్కరించాలి?- అని ఆవేశంగ అడిగితే- కృష్ణ చిన్నగ నవ్వి- రాత్రి కరిగి పగలు రాదా? తూర్పున రేఖలు కనిపించవా?- అంతవరకు వేచివుండాలి దేవీ?- కానీ ఈలోపులో-ఈ రాత్రి కరిగి పోనీయరాదు!” అంటూ దగ్గరకి తీసుకున్నాడు.

## 12

చలిగాలి రివ్వున వీస్తోంది. దూరంగ మంచు తెరలు కరుగుతూ ... ప్రకృతిఅంతా రాబోతున్న, సూర్యకిరణాల్లో .... వింతగ మెరుస్తోంది!—

మాలతి ఆరోజు, రోజూ కంటే ముందేలేచింది! సంతోషతరంగాలు ఎదనిండా కమ్ముకుని .... గాల్లో తేలిపో

తున్నట్టుంది - క్రితంరోజు సైపు ఇనిస్టిట్యూట్‌లో సార్.... 'నువ్వు పాసైనావమ్మా మాలతీ.... రేపుపేపర్‌లో ఫలితాలు వస్తాయి! హయ్యర్ పాసైనావు గనుక - నీకిష్టమైతే ... హైదాబాదులో మా ఫ్రెండ్ ఒకాయన గ్లాసు ఫ్యాక్టరీలో పనిచేస్తున్నాడు .... అతనితో రికమెండ్ చేయించి .... నీకు ఉద్యోగం ఇప్పిస్తాను'- అన్నారు .... ఇంటికివచ్చి....నాన్నని ఒప్పించేసరికి ఎంత కష్టమైందో?- ఎలాగైతేనేం .... ఒప్పు కున్నారు. కాని అమ్మమాత్రం - ముభావంగ - ఇష్టంలేనట్టు వూరుకుంది!- ఫర్వాలేదు .... కాలంగడుస్తూవుంటే....ఆవిడకే తెలుస్తుంది. అయినా మొదట్లో ప్రతిఘటించినట్లు ఇప్పుడు కలగచేసుకోవటంలేదు. తనకేమీ పట్టనట్టు వూరుకుంటోంది! ఇదికూడ మార్పేకదా?- ఇంకా కొంతకాలం గడుస్తే ... ఆవిడ స్వయంగా ఆమోదం తెలిపేస్థితికి వస్తుంది - ఇంతకీ పేపర్‌కుర్రాడు ఇంకారాడేం?- పాసైనట్టు తెలిసినా .... పేపర్‌లో నెంబర్ చూసుకుంటేగానీ తృప్తిగవుండదు'-

వరండాలోకి వచ్చి .... నారాయణరావుగారికి కాఫీ అందించి-లోపలికి పోబోతూవుంటే....చెవులచుట్టూ మఫ్లర్ చుట్టుకుని - స్వెట్టర్ వేసుకున్న పేపర్ కుర్రాడు సైకిల్ మీద రివ్వునవచ్చి గంటవాయించి చెక్క గేటు మీదనుంచి పేపర్ విసిరి వెళ్ళిపోయేడు-

మాలతి ఒక గెంతులో గేటుదగ్గరకి వెళ్ళి పేపర్ అందుకుని - మడతలు విప్పుతూ వరండాలోకి వచ్చింది..... నెంబర్ చూసుకుని తండ్రికి చూపించింది!- ఆయన నంతో

మంగ తలవూపి- "శ్రమ ఫలించిందమ్మా వెళ్ళి అమ్మకి కూడా చెప్పు"- అన్నారు.

మాలతికి - అప్పుడే హైద్రాబాదులో ఉద్యోగం చేస్తున్నట్టు -జీతం అందుకున్నట్టు-నాన్నకి ఆర్థికంగ సహాయం చేస్తున్నట్టు-ఎన్నెన్నో ఊహాలు....గుండెలు నింపేస్తున్నాయి!

○ ○ ○

యూనివర్సిటీలో .... స్టూడెంట్స్‌కి ఎలక్షన్సు జరుగుతున్నాయి! ప్రెసిడెంట్ ఎన్నికకి ముమ్మరంగ...ప్రచారాలు చేస్తున్నారు, విద్యార్థులు .... పరీక్షలు దగ్గరపడుతున్నాయనీ .... ఫైనలియర్ కదాఅని .... పోస్టు గ్రాడ్యుయేట్సు కాస్త చదువుమీద శ్రద్ధ చూపిస్తున్నారు - రామం రూమ్ మేట్సు .... కమ్‌క్లాస్‌మేట్సు మాత్రం .... చదువుకంటే - ఎలక్షన్సే ముఖ్యమని .... రాత్రింపగళ్ళు ఆగొడవల్లోనే వున్నారు ....

ఈమధ్య రామంలో కొద్దిగమార్పు వచ్చింది!- తండ్రి మునపట్లాగ ఉత్తరం రాసినవెంటనే డబ్బు పంపటం లేదు!- నెలకి ఓసారి మాత్రమే పంపగల్గింది పంపి వూరుకుంటున్నారు .... తను ఇష్టంవచ్చినట్టు జల్సాలు చేయడానికి వీలులేకుండావుంది. అదీగాక ఈ పరీక్షలు గట్టెక్కకపోతే .... ఇన్నాళ్ళచదువు వృధా? అయినా ఇన్నాళ్ళు తను ఏం చదివినట్టు?- వాళ్ళకేం? మళ్ళీ మళ్ళీ చదవగలరు - లేదా ....

డబ్బెట్టి మార్కులు కొనుక్కోగలరు!- కానీ తను ఏస్థితిలో వున్నాడూ?—

క్రితంసారి సెలవలకి వెళ్ళినప్పుడు - చెల్లి మాలతి టైప్ పరీక్షలకి కూర్చుంటోందనీ అదృష్టం కలిసివస్తే - ఉద్యోగం చేయాలని వుందనీ చెప్పింది. అది ఆపనేచేస్తే .... తను పనికిమాలిన వాడికిందే జమ! ఎంతసిగ్గుచేటు?-అందుకే 'అక్కర్లేదులే' అని కసిరి - 'తను ఇకజాగ్రత్తగా వుంటానని తండ్రికిచెప్పి వచ్చాడు!-' కానీ తను ఇంతకుముందు చేసిన బాకీలు ఎలా తీర్చాలో తోచడంలేదు!- ఏమైనా పరీక్షలకి బాగా చదవాలి' .... అనుకుంటు గదిలో లైటువేసుకుని చదువుకుంటున్నాడు - మిత్రులుమటుకు-'తమకేదో అర్జంటు పనులున్నాయని' - వెళ్ళిపోయారు.

ఇంటియజమాని.... రామంలో కల్గిన ఈకాస్తసద్బుద్ధి ఇంతకుమునుపే కల్గివుంటే ఎంతబాగుండేది?- 'చావుతెలివిలా'- ఇప్పుడా ఈబుద్ధికుదరటం - అనుకున్నా - పోనీలే కొంతనయమే అనుకున్నాడు - ఎన్నోసార్లు ఆయన వాళ్ళచేత గదిఖాళీ చేయిద్దామని ప్రయత్నించేడు-కానీ ప్రతిసారీ వాళ్లు రెండు మూడు రూపాయలు పెంచుతు వస్తుంటే - మాట్లాడలేక పోయేడు .... ఇప్పుడు ఆ ఒక్కగదికి ఎనభై రూపాయలు అద్దెకాకుండా .... అడపాతడపా .... ఆయనకి-చేబదుళ్లుకూడా ఇస్తున్నారు!-'డబ్బుమహాత్యం అటువంటిది!-

o o o

రైలాట లాడుకునే చిన్నపిల్లల్లాగ .... ఒకదానివెంట

ఒకబస్సు వెళుతున్నాయి! అన్నీ వస్తూనేవుంటాయి వెళు తూనే వుంటాయి....కానీ 'క్యూ'కి ముగింపులేదు - ముందుకు కదిలి వెళుతూనే వుంటుంది .... వెనకనుంచి మళ్ళీ పెరుగు తూనేవుంది:—

అలాగే బస్సుల్లో దిగేవాళ్లు దిగుతున్నా తోరణాల్లాగ వ్రేలాడేవాళ్లు వ్రేలాడుతూనే వున్నారు—

'మావూళ్ళో -విశాల పిన్నమ్మలకి- ఏటాకాన్పులు'- అనుకున్నానుగానీ-ఈ బస్సుల్లో క్షణం క్షణం మనుష్యులు పుట్తారని తెలియదే'- అనుకుని నవ్వుకుంది మాలతి!—

అరగంటనుంచీ కోఠీలో బస్సుకోసం ఎదురుచూ స్తోంది! చిక్కడపల్లి వెళ్ళాలి!- తనకి ఉద్యోగం ఇప్పించిన- కాంతారావుగారు వాళ్లింట్లోనే ఓగది ఇచ్చారు. తనకేవో కావల్సిన వస్తువులు కొనుక్కుందామని వచ్చింది. అన్నయ్య రూమ్ ఎక్కడో చెప్పారుగానీ - వాడిక్లాస్‌మేట్సు వుంటా రేమో ... ఎప్పుడైనా వెళ్లి చెప్పాలి .... మాట్లాడాలి .... అనుకుంటూ ఆలోచించి....బస్సు ఎప్పటికీ రావడంలేదనివిసు గొచ్చి రిక్షామాట్లాడు కుంటోంది!—

"వహ్వా! బ్యూటీ అంటే ఇదిరా?"- అన్నాడొకడు....

"వూ! ఇంకా సిటీఫామన్సు తెలియనట్టుంది!"- అన్నాడింకోడు.....

అప్రయత్నంగ మూడోవాడు అటుతిరిగి ఎవరో అను కుని మూంసేడు. .... నిశ్చేష్టుడై - నిలబడిపోయేడు -

"ఏం బ్రదర్-నిలుగుడ్లు వేస్తున్నావు? మనసేమైనా"....
అని పక్కవాడుమాట పూర్తిచేయకమునుపే - "షటప్ రా
స్కౌల్ - షి ఈజ్ మై సిస్టర్!"-అని తాగుతున్న సిగరెట్టు
నేలకేసి కొట్టి చరచరా ముందుకుసాగి - "మాలతీ - ఇదే
మిటిలా వచ్చావ్?"- అన్నాడు-

"అన్నాయ్! నువ్వా?- నేనింకా నీరూమ్ వెదికి ఎప్పు
డో రావాలనుకుంటున్నాను!- నేను ఇక్కడ ఉద్యోగంలో
చేరేనురా! వారం రోజులైంది!!"- సంతోషంతో పొంగి
పోతూ అన్నగారి దగ్గరకివచ్చి చెప్పింది. ఈమధ్య అన్న
గార్ని చూసి ఆర్నెల్లుదాటింది. భాతృప్రేమ - మాలతిలో....
ఉబుకింది! ఏదేదోచెప్పాలిఎన్నెన్నోఅడగాలిఅనుకుంటోంది!

"గొప్పపని చేసేవులే! నేనువద్దని చెప్పలేదూ?_
నువ్విప్పుడు ఉద్యోగంచేసి సంపాదించి మమ్మల్ని ఉద్ధరి
స్తావా?- వచ్చేముందు నాకు తెలియచెయ్యాలని నాన్నగా
ర్కితోచలేదా?-" ఉద్రేకంతో గొంతుపెంచేడు.

రిక్షావాడు- "ఏమ్మా కావాల్నా వద్దా?"- అనటంతో
రామంకాస్త తగ్గి-" నక్కోజావ్ భయ్!"- అనేసి నడుఅలా
గార్డెన్ కి పోయి మాట్లాడుకుందా"- అని బస్సుస్టాప్ వైపు
నడిచేడు -

మాలతి ఉత్సాహం అంతా ఒక్కసారి చల్లారి
పోయింది!- క్రమంగ ఆస్థానంలో కోపం ... ఉక్రోషం
చోటుచేసు కుంటున్నాయి!- పెదవులు బిగబట్టుకుంటు -

అన్నగారి వెనకాలే - ఎలాగో బస్సు అందుకుని .... పబ్లిక్ గార్డెన్ దగ్గర దిగింది!-

ం ం ం

"నాలుగుసంవత్సరాల క్రితం భవానీ అక్కయ్య పిల్లలు ఒకసారి మనింటికి వచ్చి వెళ్ళేరు గుర్తుందా అన్నయ్యా!- అప్పుడు నువ్వు -భవానిమీద సానుభూతి చూపించి .... బావ అమాయకుడనీ .... విశాల నోరులేనిదనీ .... అల్లాంటి వాళ్ళంతా .... బాధపడాల్సిందే అనీ .... చాలా చాలా చెప్పేవుకదూ?"-

"అయితే ? అందులో అబద్ధమేముందీ?"-

"అబ్బేలేదు!- అదికాదు నేనుచెప్పేది .... వాళ్ళు ధైర్యంగ పరిస్థితులని ఎదిరించి నిలబడమనేగా నీ సలహా ఆనాడు?-"

"ఈనాడైనా అంతే!"

మాలతి గడ్డిమీద పక్కకిజరిగి కూర్చుని నవ్వింది-

"సలహాయేనా - ఆ ప్రకారం ముందంజవేస్తే ఆమోద మేమైనా చూపిస్తావా?"

"ఎందుకుచూపించనూ?" రామం చిరాగ్గాచూసి - "ఇంతకీ నువ్విలా ఉద్యోగం చేయడానికి - వాళ్ళకీ ఏమిటి సంబంధం?- అన్నాడు.

"అది చెప్దామనేకదా?- వాళ్ళందరికీ ఇచ్చినసలహాయే నేను పాటించేను. నువ్వు ఆమోదం చూపించలేక పోతు

న్నావు!- మెతక తనంతో చాకిరీలు చేస్తూ .... పాతకాలం నాటి ఆచారాలతో సతమతమవుతున్న భవాని అక్కయ్య- తెగువచేసి వాటన్నిటినీ కాదని నవీనభావాలతో బాగుపడా లని కోరుకుంటున్నామా! చిన్నప్పుడే వితంతువై .... పినత ల్లులకి, పినతండ్రులకి నానాసేవలుచేసి, జీవితంలో ఏవిధమైన సుఖం అనుభవిస్తుందన్న ఆశేలేని, విశాల .... మీద జాలి చూపించేమా .... అలాగే కట్నాలగొడవ ఎక్కువై .... బొత్తిగ గొడ్లబేరంలా తయారైతే - ఆడపిల్లజీవితం తలవం చుకున్న బలిపశువులా ఎందుకుకావాలని కూడా ఆలోచించ వద్దా?- దాన్ని ప్రతిఘటించవద్దా?- నేను చేసినపని అదే అన్నయ్యా!- నీచదువుకు నాన్నగారు.... శక్తికిమించి పంపిం చాల్సి వస్తోంది!- మనకేం పెద్ద ఎస్టేట్లులేవు!- నాన్నగారికి కూడా పెద్ద ఆఫీసర్ ఉద్యోగమూకాదు!- గుట్టుగ వస్తున్న జీతంలో - ఆ స్వంతఇంట్లో - అవున్న కొద్ది పొలంతో - నిండుగ - పొల్లుపోకుండా సంసారం లాక్కువస్తున్నారు!- రెండు మూడు సంబంధాలు వస్తె - అన్నీ తాహతుకు మించినవే అయ్యాయి!- అయినాసరే అని - ఇల్లో .... పొలమో అమ్మేసి చెయ్యాలని వాళ్ళ ఉద్దేశ్యం ! నాకది నచ్చలేదు! నీచదువు కాకుండా .... ప్రకాశంచదువు పూర్తి అవకుండా .... వున్నకాస్త ఆధారం అమ్మేసుకుంటే - తర్వాత మీరంతా ఎన్నిఅవస్థలు పడాలో నేను ఊహించ గలను!- అందుకని నేనుపెళ్లికి ఒప్పుకోలేదు!- నాన్నకి ఆర్థి కంగ సహాయపడినా పడకపోయినా .... నాదంటు కొంతసంపా దన దాచుకుంటే-తప్పులేదనుకున్నాను! కానీ నువ్వు హర్షిం

చలేక పోతున్నావు! నువ్వా పాతకాలం భావాలతో - ఆడ పిల్లంటే పెళ్ళిచేసుకుని - అత్తారింట్లో - పడివుండి పిల్లలతల్లి కావాలేగానీ ఇలాస్వేచ్ఛగ - ఉద్యోగం చేయకూడదనే మూఢాచారంలోనే వున్నావు! అవునా?" మాలతి నిలదీసే సరికి - రామం ఏం మాట్లాడలేక పోయాడు!-

చాలాసేపటివరకు ఇద్దరూ మౌనంగా కూర్చున్నాక- "పోనీలే అన్నయ్యా! మాజాతి ఎప్పుడూ అడుగునపడి వుండాల్సిందే కానీ పైకి రాకూడదు! అలాగేనువ్వు కోరు కుంటే-రేపేనేను రిజైన్‌చేసి వెళ్ళిపోతాను! ఇల్లో పొలమో అమ్మేసి పెళ్ళిచేస్తే....అత్తారింటికి వెళ్ళిపోతాను!-" మాలతి గద్గదస్వరం విని రామం క్షణంలో బాధ్యత గుర్తుతెచ్చుకుని- "కాదులే మాలతీ - నువ్వు తొందరపడకు! నేను రేపు మీ ఇంటికి వస్తాను. పది చీకటైతే కొత్తచోట సీకు మళ్ళీకష్టం బస్సుఎక్కిస్తాను"- అన్నాడు.

ఇంటిగుర్తులు చెప్పి - మాలతి బస్సెక్కింది!

o o o

రూమ్‌కొచ్చాక - ఫ్రండ్స్ "సారీ మిస్టర్ రామం మీ సిస్టర్ అని తెలియలేదు"- అంటే ఫర్వాలేదులేరా .... నేను తిటేనుగదా?"- అని ఒకరికొకరు 'మాఫీ' చేసుకు న్నారు. అయితే ఆసంఘటన ఆధారంగ మిగిలిన ఇద్దరు మిత్రులు ... శాస్త్ర రామంతో చాటు మాటుగ వుంటు న్నారు. రామం కూడా .... వాళ్ళతో మునుపటంత ఫ్రీగ తిరగలేక చదువుమీదనే దృష్టి కేంద్రీకరించాడు!-

పస్టు తారీఖు జీతం అందుకోగానే - మాలతి, అన్న య్యకి ఎనభైరూపాయలు ఇవ్వబోయింది! రామం సిగ్గుతో చితికిపోయేడు! కానీ అంతకంటే మంచిమార్గం కనిపించలేదు తండ్రిదగ్గర్నుంచి తెప్పించుకునే కంటే .... ఇదే నయమను కున్నాడు!- అంతేకాకుండా కొన్ని నిర్ణయాలు చేసుకు న్నాడు .... సాయంకాలం ఎవరికైనా ట్యూషన్లు చెప్తే .... ఆ డబ్బుతో - తన పాతబాకీలు తీర్చుకోవచ్చునని .... తన రూమ్ మేట్స్‌కి తెలియకుండా ఆపనిసాగదనీ తెలిసి - ఓ చిన్న అబద్ధం ఆడేడు!—

"ఒరేయ్!- మాసిస్టర్ ఇక్కడ....'ఫలానా' వారింట్లో వుంటోందిరా! వాళ్లు మా ఫ్రెండ్స్ నన్నుకూడా అక్కడికే వచ్చేయమంటున్నారు! మాసిస్టర్ బి. య్యేకి వెడుతోంది ఈ సంవత్సరం. కొంచం నేనుదగ్గరవుండి కోచింగ్ ఇవ్వాలి.... అందుచేత...."—

"ఆల్ రైట్! మమ్మల్ని వదలిపెట్టా నంటావ్! సరే ఏంచేస్తాం ? వెళ్లు .... పిలువున్నప్పుడల్లా వస్తూండు. ఎంతైనా 'వనండ్ ఆఫ్ ఇయర్' కలిసి కాపురంచేసేం! మన పాతఅను భవాలు చెరిపేసుకోకు!"- అని వీడ్కోలు పలికేరు!-

ఆరోజే పెట్టె బెడ్డింగ్ పట్టుకుని మాలతి దగ్గరకి వచ్చేసేడు-

కాంతారావుగారి అమ్మాయితోపాటు మరొక ఇద్దరు టెన్ క్లాసు పిల్లలకి ట్యూషన్లు కూడా మొదలు పెట్టేడు-

తీరికగ ఓరోజు తండ్రికి ఉత్తరం రాసేడు-

'ఛాందసాలు .... వెర్రి ఆచారాలు పెట్టుకున్నంత కాలం .... మనిషి ఒక పరిధిలోనే వుండిపోయి-గానుగెద్దులా జీవించాలి!- ఆ చట్రం నుంచి ఇవతలపడి ప్రపంచాన్ని చూడగల్గితే -జీవితం ఎంత ఆనందమయమో తెలుస్తుంది!- మాలతి ఉద్యోగస్థురాలై సంపాదిస్తున్నందుకు నేను గర్వించడమే కాదు - నా బాధ్యత -ధర్మం తెలుసుకున్నాను - అదీ దానిసారాంశం!-

పావు తక్కువ పది గంటలకి-మాలతి బస్సుస్టాండ్ లో నిల్చుంది! - ఆఫీసుటైం అయిపోతోందన్న తొందర్లో - 'ఎలాగా?' అనుకుంటు గాభరాపడుతు తనచుట్టూ వాళ్ళని-పరికించి చూసింది! ఎదురుగా హోటల్లోనుంచి - ఒకతను కంగారుగ బయటికి వస్తూ కనిపించేడు!-

'అతను అతనే శేఖర్!'-

తప్పిపోయిన పెళ్ళికొడుకు!-

తెల్లని ప్యాంటు టకప్ తో - జిప్ బాగ్ - చిరుచెమటలు కర్చీఫ్ తో తుడుచుకుంటు గబగబా రోడ్డుక్రాస్ చేసి వచ్చి క్యూలో నించున్నాడు। అతనూ చూచేడు - క్షణం కళ్ళు పెద్దవిచేసి చూసి-మరుక్షణంలో పలకరింపుగ నవ్వేడు.

మాలతికి ఒళ్ళు మండిపోయింది!-

సాచిపెట్టి లెంపకాయ కొట్టాలనుకుంది! చెవి మెలిక తిప్పి వదలాలనుకుంది! నెత్తిమీద గట్టిగ మొట్టాలనుకుంటె !

ఏంచేయలేక - పెదవులు కొరుక్కుంటూ - బస్సురాగానే హడావిడిగ ఎక్కేసింది!-

నారాయణ కూడా స్టేజిరాగానే అతను దిగిపోయేడు-దిగుతూ మాలతివైపు చూసేడు- 'ఛ బుద్దిలేకపోతే సరి!- కట్నం చాల్లేదని - పెళ్ళిమానేసిన పెద్దమనిషి!- ఏ ధనవంతురాలికో అమ్ముడుపోయి - ఇంకా నవ్వుతాడేం?!- నాకింకా పెళ్లికాలేదనీ పలకరిస్తున్నాడా?!- అసలు తనకి కూడా కాలేదేమో?!- అయినా అతనితో నాకేమిటి?'- అనుకుంది స్టేజి రాగానేదిగి ఆఫీసులోకి వెళ్ళిపోయింది!-

ఫ్యాక్టరీ అంతా రకరకాల మిషన్లతో- చప్పుళ్ళతో- వర్కర్సుతో .... చాలా హడావిడిగ వుంది!- వాటితో సంబంధం లేకుండా మాలతి - ఆఫీసురూమ్‌లో టైపు మిషన్‌ముందు కూర్చుంది!-

అర్జెంటు కాయితాలు టైప్ చెయ్యడం .... ఆఫీసరు చెప్పిన లెటర్సు టైపు చెయ్యడం - లంచవరులో కాంతా రావుగారితో కలిసి భోజనం చెయ్యడం - మళ్లీ అవసరమనుకున్న కాగితాలు చూడ్డం - మాలతి ఆఫీసులో చేసే పనులు!- కాంతా రావుగారు-ఫ్యాక్టరీలో అసిస్టెంట్ ఇంజనీరు! మాలతీవాళ్ళ కులంకాదు!- అయినా ఎంతో ఆప్యాయంగ- తాను తెప్పించుకున్న క్యారియరులోనుంచి - ఏ స్వీటో - బిరియానియో - ఆమెప్లేట్లో పెట్టి - 'తినమ్మా - మరేం ఫర్వాలేదు - వేధవకులం మనష్యులమధ్య, మనసులమధ్య ఇనపగోడలు కట్టుంది!- చూడు నువ్వూ నేనూ ఎదురెదురుగా కూర్చున్నా - మీభోజనం వేరు మాభోజనం వేరు అంటే-

మనమధ్య దూరంఎంత పెరిగి పోతుందో?- నాకిలాంటివి నచ్చవమ్మా!- మా ఫ్యాక్టరీలో వర్కర్సు అంతా ఒకేకులం అనుకుంటాను!- చూడమ్మా మన ఫ్యాక్టరీలో తయారయే గ్లాసుసుద్ద, సిలికాన్ .... తెల్లఇసుక, కార్బన్‌తో కదా? జీవంలేని పదార్థాలన్నీ కలిసి - జీవంతో కలకల లాడే సామాన్లు తయారవుతాయిగదా?!- మరి జీవంగల మనం- అర్థం లేకుండా ఈ కులాలు మతాలు అని .... వేర్లుపడి .... జీవంలేనట్లు బతుకుతున్నాం!- అందరం ఒకే మట్టితో తయారయాం! పంచభూతాలు, అందరికీ సమానమే!- అవయవ నిర్మాణం అంతాఒకటే! మరెందుకమ్మా ఈభేధం?!- అని కాంతారావుగారు అంటే - మాలతికి ఆక్షణంలో - ఆయన క్యారియర్‌లో చేయిపెట్టి తినేయాలన్నంతఊపు కల్గుతుంది!-

నిజమే! ఏమిటీ మూఢాచారాలు ! అని తిట్టుకుంటుంది!- కాంతారావుగారు ఏకులమైతేనేం? ఆయనభార్య రోజూ ఉదయమే .... స్నానంచేసి పూజాఆదీ చేసుకుని చక్కగ నీటుగ చేస్తుందివంట!- అసలు ఆచారం అంటే - పరిశుభ్రత అనేకదా?- దానిని వీళ్ళంతా పెడర్థాలతో - నానాగోలగ తయారు చేస్తున్నారు! భవానీ అక్కయ్య అత్తగారు ....ఎప్పుడూ నీళ్లుగారుతూ....వంటిల్లంతా రొచ్చు బురదచేసి - పాదాలన్నీ పగులుబారేటట్టుచేసి .... మడి కంది పప్పు - మైలకందిపప్పు - మధ్యరకం కందిపప్పు అనీ అన్ని గూళ్ళల్లో - డబ్బాలేనింపి - మనిషి వంటింట్లో నుంచుంటే బట్టలు దగ్గరకి తీసుకుని నిలబడాలేతప్ప - ఫ్రీగ తిరగడానికి కూడా వీల్లేదంటుంది! పెరట్లో తుడిచే చీపురు .... వీధి

తుడిచే చీపురు కలవగూడదు.!- మనిషికి మనిషి తగల కూడదు!- ఏమిటో పిచ్చి!- తమఊళ్ళో శాస్త్రిల్లుగారు .... రోడ్డుమీద నడుస్తూవుంటే - రోడ్డుచివర శూద్రుడెవడైనా కనిపిస్తే .... అమాంతం ఎదురుగవున్న ఇళ్ళల్లోకో - అరుగులమీదకో - ఎక్కేసి - ముక్కుకి ఉత్తరీయం అడ్డుపెట్టుకునేవారు ....పాపం పక్షవాతం వచ్చి రెండుఏళ్ళు మంచంలో వుంటే - ఇంట్లోవాళ్లు చేయలేక నానాఅవస్థపడి విసుగొచ్చి .... మనిషినిపెట్టేరు!- ఆమనిషి లోగడ శాస్త్రిల్లుగారిచేత నిరసింపబడిన వ్యక్తే!!- అప్పుడు పనికి వచ్చాడు వాడు!

ఇవ్వన్నీ ఎంత అజ్ఞానమోకదా?— అనుకునేది మాలతి!-

షైపు మిషన్ముందు కూర్చుందన్న మాటేగానీ .... ఇవాళ మాలతి మనసునిండా శేఖర్ ఆలోచనలే!- ఎంత వద్దనుకున్న .... ఒకనాటి పెళ్ళిచూపుల్లో బాగున్నాడనుకుంది గదా?- కానీ - అతని కుసంస్కారం ఒళ్లు మండుతోంది!-

అన్యమనస్కంగానే - సాయంత్రం ఆఫీసు నుంచి బయటపడి బస్సుస్టాపు చేరింది. నారాయణ గుడాలో పిచ్చిగ అతనికోసం చూసింది. ఉహూ అతను కనిపించలేదు. వారంరోజుల తరువాత ఒకనాడు మళ్ళీ బస్సులోనే కనిపించి చిరునవ్వు నవ్వి -

మాలతి దిగేచోటే దిగేడు.- అప్పుడు మాలతి ఇంటికి వెళుతోంది!-

నాలుగు అడుగులు వేసేసరికి 'చూడండీ-' అని పిల్చేడు--

ఆగిచూసింది!

"నేను గుర్తున్నానా?"- అని శేఖర్ నవ్వుతూ అడిగే సరికి - పీకలవరకు కోపంవచ్చి-

"ఏమోనండి -గుర్తు లేదు"- అంది "అయినా రోజూ ఎంతోమందిని చూస్తుంటానుగదా!"-

అతను కొద్దిగఖిన్నుడై .... "నన్నురోజూ చూసివుండరు!- రెండేళ్ళక్రితం మీ ఇంటికి వచ్చాను. మానాన్న .... మా మయ్యకూడా వచ్చారు. నాపేరు శేఖర్। గుర్తువచ్చిందా?-" అన్నాడు - ఆమె ఏం చెపుతుందో అన్న ఆత్రుతతో చూస్తూ ...

"ఓహో! అతనా మీరు? మరే గుర్తువచ్చింది!- అప్పుడు మీ నాన్నగారు ఏదో ఉత్తరం రాసేరులకదా? మాఅబ్బాయి ఖరీదు ఇన్నివేలు అనీ?-" అని ఆగి "అవునూ ఇంతకీ మీరు పన్నెండు వేలవారో .... ఎనిమిదివేలవారో, పదివేలవారో గుర్తు రావడంలేదు .... మీరు ఆనాడు ఏ రేటు మీద వున్నారూ? ఇప్పుడు ఏ రేటుకు అమ్ముడు పోయేరు?-" నవ్వుతున్నా .... గుచ్చినట్లున్న ఆ ప్రశ్నకి - అతని ముఖం చిన్నబోయి - క్షణం తర్వాత తేరుకుని - "నేను ఆనాడు.... ఈనాడు .... ఒకేరేటుమీద వున్నానండీ!- నాచాటుగ జరిగిన వ్యవహారాలకి నేను బాధ్యుణ్ణా?!- అయినా జరగవలసిన

అన్యాయం జరిగిపోయింది గనుక .... ఇప్పుడు నేను శిక్షమాత్రమే అనుభవిస్తున్నాను!"- అన్నాడు.

మాలతి అతని ముఖంచూసి - ఇంకేం మాట్లాడలేక- "పోనీలెండి ఇప్పుడెందుకు అవన్నీ రోడ్డుమీద నిలబడి ఇలా మాట్లాడుకుంటే బాగుండదుకూడా - వెళ్తాను"- అంటూ అడుగు ముందుకు వేసింది!-

"మాలతిగారూ -" అతని పిలుపువిని ఆశ్చర్యంగ చూసింది!

"ప్లీజ్! ఒక్క విషయం చెప్పి వెళ్ళండి. మీకు మా రేజి కాలేదుకదూ?"- ఆమె మెడవంక అనుమానంగ చూసేడు ....

మాలతి కోపంగచూసి- "అవలేదు .... అవదు! మీలాంటి బడుద్దాయిలున్నంత వరకు -నాకేకాదు నాలాంటి అమ్మాయిలందరికీ అవదు! వస్తా .... నాకుచాలా పనివుంది! ఆఖరొకమాట .... ఆనాడు మీరొక ప్రశ్న వేశారు .... అవకాశంవస్తే ఉద్యోగం చేస్తారాఅని - అవసరం అయితే చేస్తానని నేనుఅంటే....అవసరం వున్నప్పుడు అవకాశం రావాద్దా అన్నారు!- మీ పుణ్యంవల్ల .... ఈనాడు నాకు అవసరం.... అవకాశం.... రెండూ వచ్చాయి....టైపిష్టు ఉద్యోగంవచ్చింది!- బతకటం అంటే ఏమిటో తెల్సింది!- అదంతా మీవళ్లే జరిగింది గనుక-చాలా థాంక్స్! వస్తా...." గబగబా ముందుకు నడవబోయింది!-

"ఆగండాగండి!- చిన్నమాట ! మీసంగతి అంతా మీరుచెప్పారు. నేనుకూడా చెప్పవద్దా?- అనాడు మానా

నాన్నకి .... ఆ అమ్మాయినాకునచ్చిందనీ-ముహూర్తాలుపెట్టించమని మాత్రమే నేనుచెప్పాను. కానీ మానాన్న రాసిన ఉత్తరం సంగతి నాకు తెలియదు, మీనాన్నగారు జవాబు రాసేటంతవరకు - మీరు నమ్మరని నాకు తెలుసు!- కానీ ఒక్కటిమాత్రం నమ్మండి! నేనింతవరకు మ్యారేజి చేసుకోలేదు!- ఒకవిధంగ ఆరోజు మానాన్నగారితో యుద్ధంచేసి ఇంటినుంచి బయటికి వచ్చేసేను. ఇక్కడ మా పెద్దక్క గారింట్లో వుంటున్నాను .... మీకివన్నీ ఎందుకు చెప్తున్నానంటే - మళ్ళీ మీరు నాకిలా కనిపించేరు గనుక.... నా మనస్సులోమాట చెప్పాలనిపించి చెప్పేను!- క్షమించండి. మిమ్మల్ని అనవసరంగ బాధించేనేమో?!- ఎప్పుడైనా - మీకు రావాలనిపిస్తే .... విద్యానగర్ వైపు వచ్చి .... మిష్టర్ 'కరుణేంద్ర' అన్నబోర్డు చూసి రావచ్చును. ఎదురుగా పెద్ద 'ఈరానీ' హోటల్ వుంటుంది....! నమస్తే వెళుతున్నాను!'' అనేసి శేఖర్ వెనక్కి తిరిగి చరచరా వెళ్ళిపోయేడు!-

మాలతి చిన్నగ నిట్టూర్చి- ముందుకు కదిలింది 'అతను పెళ్ళిచేసుకోలేదా?-' అని ఇల్లుచేరేలోగా నాలుగు ఐదు సార్లు అనుకుంది!-

ఆరోజు రామం రాగానే- "అన్నయ్యా నీకో విచిత్రం చెప్పనా?" అని ఆవిషయం అంతా చెప్పింది. రామం ఆశ్చర్యంగ విని- ఆతర్వాత "అంతేలే అలవ్యంగ మొల్కొడం, అంటే ఇదే?-" అని నవ్వేడు...

# 13

కాలచక్రం తిరుగుతూనే వుంది.

ఋతువులు మారుతున్నాయి! కాలం మారుతోంది! పాపలు పెద్దవాళ్ళవుతున్నారు. ఎండాకాలంలో మలమల మాడిపోయిన ప్రకృతి అంతా... వర్షాకాలం రాగానే... కలకలలాడుతూ... వికసించింది!—

భాస్కరానికి ఈ మధ్య మేధస్సు పనిచేయడం ప్రారంభించింది!- ప్రవేటుగ ఇంటర్మీడియట్ పూర్తి చేసేడు. ఇదువరకటిలా... తల్లిమాటకి తండ్రిమాటకి గొర్రెపొట్టెల్లా తలవూపడం మానేసి.... ఊపవచ్చు అన్న వాటికే ఊపి- వద్దనుకున్న వాటికి అడ్డం తిప్పుతున్నాడు...

చిన్నతమ్ముడు అగ్రికల్చర్ ప్యాసై ... పెళ్ళిచేసుకొని...పట్నంలో కాపురంఉండి-అక్కడనుండి-నలహాలన్నీ ఉత్తరాల్లో రాస్తూవుంటాడు!—అతనికి భార్యకి పల్లెటూరి వాతావరణం ఎలర్జీ' ట! అందుకని ... ఆవిడ పెళ్ళిలో మాత్రమే అత్తగార్ని చూసింది! మళ్ళీ అత్తింటి గడప తొక్కలేదు. 'మొగుడుఅగ్రికల్చర్ ప్యాసై శేబ స్త్రీలోఉద్యోగం చేయాలిగానీ .... ఇంత చదువూచదివి- ఆపల్లెటూళ్లో.... వ్యవసాయం చేయిస్తారా?' అంది- ఆపనులకి- 'బావగారు' మామగారు వున్నారనీ అంది!- ఆఖర్న మరొకమాట కూడ అంది- ప్రతి సంవత్సరం లెక్కలు అడిగి మన వాటా పంట డబ్బు తెమ్మని- దానితో మనం పట్నం కాపురంలో చిక్కులు పడాల్సిన అవసరం వుండదు—!

ఇవన్నీ వింటూ - చూస్తూ-భాస్కరం సహించలేక పోయాడు- అందుకే- మనిషిలా ప్రవర్తించటం మొదలు పెట్టేడు. వాళ్ళమ్మకి ఇదంతా చాలా విచిత్రంగా వుంది!- 'ఇదేమి చోద్యం?'- అనుకుంది.

ఒకటి రెండు సార్లు కొడుకుని మందలించబోతే పట్టించుకోలేదు భాస్కరం- తారాజువ్వలా లేవబోయింది, కానీ భాస్కరం బయటికి వెళ్ళిపోయేడు!- "అయ్యో అయ్యో చూశారా కామమ్మ వదినా! నాకొడుకుని నాక్కాకుండా చేసింది, ఇన్నాళ్ళు ఇలాగే వున్నాడా?- అయిన సంబంధము చేసుకుంటే ఇలాగే అనుభవించాలి! ఖర్మ-' అని పెరట్లోకి వెళ్ళి పక్కింటి కామాక్షమ్మతోటీ- వీదిలోకి వచ్చి ఎదురింటి మీనాక్షమ్మతోటీ చెప్పుకుని రాగాలాపనతీసింది!—

ఆవిడఇంట్లోకెళ్ళేక-అమ్మలక్కలుచేరి...."ఈ పదేళ్ళనుంచి ఈరాక్షసితో ఆభవానీతల్లి గనుక వేగింది! మరొకతైతే నుయ్యో గొయ్యో చూసుకునేది. మిగిలిన కోడళ్ళు ద్రోహం చేశారుగ నిర్వాకం!-" అని చెవులు కొరుక్కున్నారు.

మరొక రోజు బాబుకి తలదువ్వుతూ "బాబూ బాగా చదువుకోవాలిరా నాన్నా!" అని బుజ్జగిస్తూవుంటే- "ఛీ రా!? మగాడివి నువ్వెందుకురా ఆపనిచేయడం?— 'అదేం' చేస్తోంది?- మాకాలం నాడు ఇలా పెళ్ళాన్ని నెత్తి నెట్టుకోవడం ఎరుగుదుమా?" అని దండకం మొదలెట్టింది-

"ఊరుకోనమ్మా! ఆకాలం వేరు ఈ కాలం వేరు. అయినా భవాని ఆకాలం దానిలాగా చేసింది, ఇన్నాళ్ళూ!"

ఏమిటే? ఆ కాలందానిలా వుందా? పోనీలే ఈ కాలం పిల్లలా వుంచరా? రెండు జడలు వేసుకుని ఒళ్ళు కనిపించే చీరలు కట్టుకొని- వీధులన్నీ తిరగమనరా!"

"అవన్నీ ఈ కాలానికి చిహ్నాలు కావమ్మా! శాస్త్ర మనుసున్న మనిషిలా ....పిల్లలు భర్తా .... కబుర్లు.... సరదాలు .... బాగుంటుందని చేయడం .... వ్యక్తిగతమైన స్వాతంత్ర్యం అంటే అది! అదే నేటి కాలం తీరు!"-

"ఏమోనాయనా నాకేం తెలుస్తాయి?- నేను ఎప్పుడూ ఒకలాగే వున్నాను. స్వతంత్ర్యం- స్వేచ్ఛ నా ముఖానికెప్పుడు లేవు - ఇలా ఈ ఇంట్లో, 'కుడితిలో పడ్డ ఎలుకలాగ'- కొట్టుకోడమేగానీ- ఓముచ్చటచ్చట ఎరుగుదునా?"- అని దీర్ఘం తీసేసరికి- భాస్కరం నవ్వేడు----

"నీకేమమ్మా? నువ్వు కాపరానికి వచ్చేసరికి బామ్మ చచ్చిపోయింది; నువ్వు సర్వ స్వతంత్రంగ కాపురం చేసుకున్నావు! అత్తయ్యలు వచ్చినప్పుడు నాకు చెప్పేరులే; ఏది చెయ్యాలను కుంటే అదిచేసేవు!- ఇప్పటికి ఇంకా చేయించుకుంటున్నావు. ఎటొచ్చీ- భవానీకే వీలులేకుండా పోయింది! నీ మిగిలిన కోడళ్ళిద్దరూ హాయిగానేవున్నారు-" అనేసరికి "ఓరి నీ గుణాలు పాడుగాను? నా మీద మరదళ్ళ మీదా పడుస్తున్నావా? ఇవన్నీ నీకు అదే నేర్పిపెట్టిందిలే!"- అని చేతులు త్రిప్పటం మొదలెట్టేసరికి- "ఎందుకమ్మా? దాన్ని అనవసరంగ ఆడిపోసుకుంటావ్?- నేనే చిన్నపిల్లాడినా? అన్నీ చూస్తూనేవున్నాను. నాకళ్ళ ముందు పెరిగిన తమ్ముళ్ళ

ళ్ళు- నాకంటే ఎదిగి పోయేరు. భవానీ తర్వాత కాపరాల కి వచ్చిన తోడికోడళ్ళు దాని కంటే తెలివిమీరేరు!- నా పిల్లలు కూడా రేపు మాకంటే రెండాకులు ఎక్కువచదవాలనే నేనుకోరుకుంటున్నాను, ఎటొచ్చీ ఇప్పుడైనా మేము కాస్త మనుషుల్లా బ్రతకాలని కోరుకుంటున్నాం!"—

అని "భవానీ"- అని పిల్చేడు....

ఆ ఇంట్లో భాస్కరం- భార్యని పేరు పెట్టి పిల్చిన సందర్భం అదే మొదటిది!'

తల్లి నిలుగుడ్లు వేసిచూస్తోంది! ఆవిడికిదంతా ఇంద్రజాలంగా కనిపిస్తోంది!

పెరట్లో బియ్యం కడుగుతున్న భవాని ఆశ్చర్యంతో ఆపని అక్కడ వదిలేసి గబగబా వచ్చింది!—

"నువ్వు మీవాళ్ళింటికి వెళ్ళి చాలారోజులైనట్టుంది! ఓసారి పుట్టింటికి వెళ్ళిరాగూడదూ?- నేనూ మామయ్యతో కొన్ని విషయాలు మాట్లాడాలనుకుంటున్నాను!"

భవాని తెల్లబోయి .... "ఇప్పుడెందుకూ" అనేసరికి-

"ఆహా! ఏం నంగనాచివే? అన్నీ వాడికి నేర్పిపెట్టి ఏం ఎరగనట్టు మాట్లాడుతావా?" అని గర్జించింది.

"అమ్మా!" అంటూ తల్లి కంటే ఎక్కువగ అరిచి- "ఇందులో ఎవరి ప్రమేయంలేదు. నాభార్యని నేను అడుగుతున్నాను!-" అన్నాడు.

తల్లి గిర్రునతిరిగి వెళ్ళబోతూ మళ్ళీ వెనక్కివచ్చి- "ఒరేయి ! పెడబుద్ధులు పుట్టడం మంచిది కాదురా!- పశే

కానీయ్! నేనూ వెళతాను. దానిపుట్టిల్లు నాకూ పుట్టిల్లే!- నేను వెళ్ళి కూడా కొన్నేళ్ళు కావస్తోంది!-" అంది ఉక్రోషంగా.

భాస్కరానికి ఒక్కసారి నవ్వు ముంచుకు వచ్చింది-

'శుభకార్యాలనాడుగానీ - పండుగలప్పుడు గానీ- మామయ్య వచ్చి రమ్మని బ్రతిమాలినప్పుడు గానీ.....ఆఖరికి మనుమలు పుట్టి బారసాల వేడుకలకి పిల్చినప్పుడుగూడా - వెళ్ళక, తననీ వెళ్ళనీయక రాద్ధాంతాలు చేసింది. అలాంటి అమ్మకి ఈనాడు పుట్టింటిమీద గాలిమళ్ళిందా?-' అనుకున్నాడు.

"సరే అయితే బయలుదేరు. ముగ్గురం పిల్లలతో వెళుదాం!- అయితే నాన్నకి భోజనమో? ఎవరువండుతారూ?"- అన్నాడు నవ్వును ఆపుకుంటూనే.__

"ఏమిట్రా? నీ బోడి ప్రశ్నలు నువ్వూనూ? ఓ నాల్గురోజులు వండుకు తింటారులే!"

"అదేమిటమ్మా? ఇప్పుడు నేను భోజనం చేస్తోంటేనే- మగాడివి నువ్వు చేయడం ఏమిటి? అన్నావుగదా? మరినాన్న వంటెలా చేసుకుంటారంటున్నాను?"-

ఒక్కనిముషం మౌనంగ ఊరుకుని - "అయితే నేను రాను మీరు వెళ్ళండి!"- అన్నది, దొరికిపోయిన దోషిలాగ- అని ఇంట్లోకి వెళ్ళిపోయింది!

భవానీ భర్తవైపు చూసి - "ఏమండీ అత్తయ్యని మీరిలా ఏడిపించటం బాగాలేదు"- అంది బాధగా.

"ఉహూ! ఇంతకాలం నీమాటా? - అదంతా మర్చిపోయేవా? - అయినా మనమల్ని ఎత్తేక ఇంకాపుట్టిల్లా? మతిలేదూ? - ఇకమీదట నాప్లాన్లకి నువ్వడ్డురాకు పూరుకో! పెళ్ళి బట్టలపీసర్లు పూరుకెళదాం!" - స్థిరంగ అంటున్న భర్తని మరేమి అనలేక మౌనంగ లోపలికి వెళ్ళింది భవాని

రత్నమ్మగారు అనుకున్నది సాధించింది! —

ఆవిడ పనులకి, ఆలోచనలకి, ఎవరూ అడ్డువెళ్ళదల్చుకోలేదు! అందుకే, ఇంట్లోఅందరు ఆవిడ చెప్పిన వాటిని తు. చ. తప్పకుండా చేసేరు! —

గిరిజని 'బిజినెస్‌మాగ్నెట్'కి కాకపోయినా అంతకి ఏమాత్రం తీసిపోని - ఒకప్రయివేట్ ఫర్మ్ నడిపిస్తున్న ఒకాయన ముద్దులకొడుక్కి - పద్దెనిమిదివేలు కట్నం ఇతర లాంఛనాలతో - పెళ్ళి జరిపించింది! - అదిఇంకా గిరిజ అదృష్టం వలన తక్కువ కట్నంతో కుదిరిందనీ...మురిసిపోయింది!

డిన్నర్ పార్టీలు... తెలుసున్న వాళ్ళకి పేరు పేరునా స్వీట్లు .... అయినవాళ్ళకి, బట్టలు అన్నీ పంచిపెట్టి - గిరిజని అత్తారింటికి పంపేసరికి చేతులకున్న 'జిడ్డు' - వదిలిపోయింది! -

నగల్లో మూడోవంతు కరిగిపోయాయి - ఇల్లు అమ్మేసేరు - మరోక నెలరోజుల్లో స్వంతఇల్లు ఖాళీచేసి అద్దెకొంపలోకి మారాలి! - కాస్తోకూస్తోవున్న బాంక్ బాలెన్సు తుడుచుకుని పోయి - చెక్కుపుస్తకం పెంటకుప్పలో పడింది!

ఇన్ని జరిగినా నిర్విచారంగ - ఇంకా చెప్పాలంటే హాయిగా .... కుర్చీలో కూర్చుని - చుట్ట కాల్చుకుంటున్నారు....

నర్సింహాంగారు!- ఇక మీదట రత్నంగంతులు వేయడానికి - చిందులు తొక్కడానికీ వీలుకాదని ఆయనకి చాలా సంతోషంగవుంది!-

పెళ్ళివారంతా వెళ్ళిపోయాక-మిగిలివున్న కొద్దిపాటి చుట్టాలకి - ఆ మధ్యాహ్నం కాఫీ టిఫెన్ చేస్తోంది శ్రీదేవి.-

పెద్దల్లుడు ఇంజనీరుగారు .... తీరుబడిగ మామగారి పక్కనచేరి- "అయితే మామగారూ చిన్నమ్మాయి పెళ్ళికి చాలాఖర్చే చేసినట్టున్నారే? ఇల్లుకూడా లేకపోతే ఎక్కడుంటారూ?"- అన్నాడు

నర్సింహాంగారు నవ్వేరు - నవ్వి పైకిచూపించి - "వాడికే తెలియాలి-" అన్నారు.

"అదేమిటీ? ఇందులో మీ రెస్పాన్సు ఏమీ లేదా?-"

"లేదునాయనా! నువ్వెంతో నేనూఅంతే! కన్యాదాతగ పీటలమీద కూర్చున్నాను, అదొక్కటే నాగొప్ప!"

"ఆ! అంతాజోకు చేస్తున్నారు. మీకు తెలియకపోవడమేమిటీ?"- అల్లుడు నిజంగానే ఆశ్చర్యపోయాడు.

"నిజాన్ని ఎవరూ నమ్మలేరోయ్! అదిఅంతే!"

"అలాగా??!- కావచ్చుమరి.... దాదాపు పాతికవేలు ఖర్చు అయివుంటుందని నా అంచనా?- చిత్రమేమిటంటే - జయకూడా నాకు చెప్పదు. కానీ తనకి తెలిసే వుంటుంది!- చాలావరకు పెళ్ళి పెత్తనమంతా తనే చేసిందిగదా?- అంటున్నానరే"- నర్సింహాంగారు .... కుర్చీలో సరిగ్గా కూర్చొని.... "అమ్మాకూతుళ్ళొక్కటే బాబూ! పోసిలే దురద తీరిపో

ఖుంది! ఇంకమిగుళ్ళు ఏమీవుండవు - కాకపోతే తగుళ్ళే వుంటాయా అని భయంగవుంది!?"- అనినవ్వేరు.

ఇంతలో శ్రీదేవి .... వేడి వేడి పకోడీలు ... మంచి నీళ్ళ గ్లాసులు పట్టుకొచ్చి ఇచ్చింది!-

"ఏమండీ చెల్లాయిగారూ - మీ ఆడబడుచు పెళ్ళి ఖర్చు ఎంతైందో మీకుతెలుసా?" తమాషాగా అడిగేరు, ఇంజనీరుగారు, చేతిలోకి ప్లేటు తీసుకుంటు—

శ్రీదేవి నవ్వి- "అత్తయ్యగారి ఆస్థి యావత్తు ఎంతో అంత!- ఇకమీదట మామగారి స్వార్జితం .... మీ బావగారి స్వార్జితంలోనే మీకతిధి సత్కారాలు దొరుకుతాయి!- అన్నది.

"బాగాచెప్పావమ్మాయి"- అంటూ నర్సింహంగారు పకోడీనోట్లో వేసుకున్నారు.

"అంటే- గొప్పగవుంటాయా? లేకదిగజారుతాయా?" అన్నారు ఇంజనీరుగారు.

"ఆసంగతి మాపెద్ద వదినగార్ని అడగండి-నేనుచెప్తే అంతబాగుండదు!"- అనేసి వెళ్ళిపోయింది!—

అల్లుడు, మామ పకోడీలు తింటూ-శ్రీదేవి పొదుపరి తనాన్ని .... సంసారపక్షమైన .... పద్ధతుల్ని ముచ్చటించు కున్నారు. కాఫీలు అందించి వెళ్ళాక - మళ్ళీ మొదలెట్టేరు ఇంజనీరుగారు - "ఏమిటో మామగారూ ఎంతరాబడి వస్తున్నా ఆడవాళ్ళలో - 'ఆశ' - తీరకపోతే మొగవాడు

దిగజారి పోవాల్సిందే!- బొత్తిగజయకి కూడా అత్తగారిలా ఆర్భాటాలు .... హడావిళ్లు ఎక్కువ! పిల్లలు పెద్దవాళ్లు అవుతున్నా వాళ్ళకోసం ఏమీ వెనక వేయకపోతే - ఎలా గంటే - ఏ నెల కానెలే ఏవో కొంటుంది! సరిపెట్టుకునే తత్వం గాదు!- హోదాగా వుండాలంటుంది!- అటు చెల్లెళ్లు అమ్మ తమ్ముళ్ళూ లేరా?- వాళ్ళకి నామీద ఆశలుండవా?- అన్నీ ఏదీ అర్థంచేసుకోదు - ఒక్కోక్కప్పుడు విసుగుపుట్టి-వస్తరోక్క-బడిపంతులో అయితే బాగుండే దనిపిస్తుంది!"—

నర్సింహంగారు అల్లుణ్ణి జాలిగచూసేరు!- అంతకన్నా ఆయన చేయగల్గింది ఏమీ లేదు!- అందుచేత - అలాచూస్తున్న మామగార్ని రెట్టింపు సానుభూతితో అల్లుడు చూసేడు!- ఇద్దరి ద్దరే! రోలు-మద్దెల!!

o o o

కాలం ఎప్పటికీ ఒక్కతీరున వుండదుగదా? హెచ్చు తగ్గులు .... ఆటుపోటులు అతిసహజం!—

ఉన్నదంతా ఊడ్చుకు పోవడానికి మరొక రెండు మూడు నెలలు పట్టింది!- ఈలోపులో - పండగకి అల్లుడు రావడం .... అమ్మాయిని అత్తారింటికి పంపడం జరిగేయి!- ఇప్పుడిక రత్నమ్మగారు .... కోరలు తీసిన త్రాచుపాములా.... ఊరికే 'బుస్స' మంటుంది తప్ప దానిలో బలంలేదనీ - కరవలేదనీ అందరికీ తెలుసు!- చిన్నకొడుకు ఇంటర్‌లో రెండుసార్లు తప్పి - ఇకచదవలేక - ఉద్యోగం వొరక్క-ఇంట్లోనే కూర్చున్నాడు!—

నర్సింహంగారు పెన్షన్ తీసుకొచ్చి .... కోడలిచేతి కిస్తారు. కృష్ణ, శ్రీదేవికలిసి జాగ్రత్తగ ఇంటిఖర్చులు లిస్టు రాసి....ఆప్రకారమే తీసుకువచ్చి....మిగిలినడబ్బు బ్యాంక్ లో వేస్తున్నారు. - రత్నమ్మగారి తాళాలగుత్తి .... పాత ఇనుప సామాన్ల జాబితాలో పడింది!-

ఒకసారి కోడల్ని ఏదో అథారిటీ చెయ్యబోయింది! కృష్ణ కల్పించుకుని-

"అమ్మా నువ్వికి కృష్ణారామా! అంటూ కూర్చోరాదూ? ఎందుకు నీకింకా తాపత్రయం మనమరాలికి శాస్త్ర కాలక్షేపంగ కథలు కబుర్లు చెప్పు!" అన్నాడు-

రత్నమ్మగారికి- సీకలవరకు వచ్చింది కోపం! కానీ ఏంచేయగలదు?- ఇంతలో నర్సింహంగారు కల్పించుకుని - "చూడు రత్నం - మనంఇప్పుడున్న ఇల్లు అద్దెఇల్లు! నేను సర్వీసులో వుండగానే - నాకుమాటలు వచ్చునన్న సంగతి మర్చిపోయేను - నాబదులు కూడా నువ్వే మాట్లాడేదానివి!- తర్వాత రిటైర్ అయి అసలే మూగవాణ్ణైపోయాను!- ఇప్పుడునువ్వు రిటైర్ అయ్యావు! ఇకనైనా .... నీడ్యూటీలు మానేయి! - చార్జిషీటు ఇంకోళ్ళకిచ్చేయి!' - అన్నారు నవ్వుతూనే.—

భర్తని ఉరిమినట్టు చూస్తూ - "మూగతనం ఎప్పుడు పోయిందీ?" అనడిగింది వ్యాంగ్యంగా!-

"అదా? ఇదిగో మనం మొన్న ఇల్లుమారేంచూడూ.... అప్పుడు! ఎందుకంటే రెండు కారణాలున్నాయి!- మొదటిది-

ఇది మనస్వంతఇల్లు కాదుకనుక ఇంకనీ అధారటీ ఉండదని తెలిసింది! రెండవది - ఈఇంటి యజమాని-లోగడ నాక్రింద పనిచేసిన తాలూకా ఆఫీసు గుమాస్తాగా బ్రతికి - రిటైర్ అయ్యాక హాయిగ ఇల్లుకట్టుకుని - తన మాజీ ఆఫీసర్ గార్కి అద్దెకిస్తున్నప్పుడు - తెల్లబోతూవుంటే - నేను మూగతనం పోగొట్టుకుని - మాట్లాడేను, మళ్లీ ఆఫీసర్ ధోరణి గుర్తు కొచ్చింది! ఏకబిగిని గంటసేపు వాగేను! కాదు లెక్చర్ ఇచ్చేను! ఏమనో తెలుసా? డబ్బు జాగ్రత్తగ ఖర్చుపెట్టు కోడం - మానవుడు నేర్చుకునే విద్యల్లో మొట్టమొదటిదనీ-

ఇల్లాళ్ళు - గుట్టైనవాళ్ళుంటే - ఆమగవాడు - ఎంత తక్కువ జీతగాడైనా హాయిగ ఇలా ఇల్లుకట్టుకుని తన ఆఫీసర్ కే అద్దెకివ్వ వచ్చుననీ .... చాలాచాలా నా జీవితానుభవాలన్నీ చెప్పేసేలే!- అదుగో అప్పుడే నామూగతనం పోయింది! నువ్వు ఒకసారి అతని భార్య అంటే మనఇంటి యజమానురాలి దగ్గరకెళ్ళి - ఇదువరలో .... ఎప్పుడైనా ఆవిణ్ణేనువ్వు ఏమైనాతూలనాడి మాటాడితే- వెళ్ళి మామూలుగ పలకరించి - అవన్నీ జ్ఞాపకం పెట్టుకోవద్దని చెప్పు!- "ఆఖరిమాటలు రత్నమ్మని ఏడిపించడానికే అన్నారు!- రత్నమ్మ నిజంగానే మూగదానిలా కూర్చుంది! ఇంటి ముందుకు నవనవలాడుతూ వంకాయలబండి వచ్చింది! వీధి గదిలో కూర్చుని వాటివైపు ఆశచావని జీవిలా .... చంటిపిల్లలాగ చూసి ... "శ్రీదేవి వంకాయలు ఎంతబాగున్నాయో?"- అన్నది 'కొందామా'అని అడగలేక!

"మరే! ఎరువు బాగా వేసి పెంచినట్టున్నారు. చక్కగా నీలిరంగు తిరిగి బాగున్నాయి"- అనేసి మళ్ళీ వంటింట్లోకి వెళ్ళిపోయింది!- రత్నమ్మ నీరుగారి పోయింది! బండిదగ్గరకు వెళ్లి ఇంటిగలఆవిడ బేరంచేస్తోంది. రత్నమ్మవంటింటిగుమ్మం దగ్గరనుంచుని 'శ్రీదేవీ కూరలు కొనాలేమో మళ్ళీ బండి వెళ్లిపోతుంది అన్నది-

"అక్కర్లే ఇవాళ కొనక్కర్లేదు అత్తయ్యా! కంది పచ్చడిచేసి చారు పెడతాను. అప్పడాలో వడియాలో వేయించుకుంటే సరిపోతుంది!"- అనేసి మళ్ళీ అటుతిరిగి పోయింది.

రత్నమ్మనాలిక పిడచ గట్టుకుపోయి గిర్రున తిరిగి ముందుగదిలోకి వచ్చింది! మాచివివరి తూకంవేసిఇస్తున్నాడు, కూరలవాడు, ఇంటిగలావిడకి, చూడలేక కిటికీతలుపు చాటుకు తప్పుకుంది!-

ఆవిడకి గతంలో తను కొన్నకూరలు .... చెప్పుకునే గొప్పలు .... చూపించే దర్జాలు అన్నీ గుర్తుకువచ్చి .... ఇప్పటి నిస్సహాయస్థితితో పోల్చుకుని - కన్నీళ్ళు వత్తుకుంది!

శ్రీదేవి ఇంట్లో చాలా కండిషన్లు పెట్టింది!

అవసరమున్నప్పుడే ఫ్యాను వేసుకోవాలి! మంచి ప్రోగ్రాములైతేనే రేడియో పెట్టుకోవాలి!- మంచిగుడ్డలు ఇంట్లోనే ఉతుక్కుని ఇస్త్రీ చేసుకోవాలి .... వేళకాని వేళ ఎవరైనా వస్తే .... కాఫీలు ఫలహారాలు ఇవ్వక్కర్లేదు! కూరలు రెండు మూడు రోజుల కొకసారి మాత్రం కొనాలి

గానీ-రోజూ అక్క-క్షేమం!- సినిమా, నాటకో రెండు నాటకో!? రత్నమ్మగారు ఇష్టంవున్నా లేకపోయినా .... తప్పనిసరిగా తలవంచుకుని - పెట్టినది తినడం .... కూర్చోడం - అలవాటు చేసుకుంది!-

ఉన్నట్టుండి ఒకరోజు రెండోకూతురు ప్రమీలా పిల్లల్నేసుకుని దిగింది!

ఇంట్లో కాలుపెట్టూనే- "అయ్యో ఇదేంఇల్లే?- మావారి డిస్పెన్సరీ అంతలేదు అంది!- రత్నమ్మ ఏం మాట్లాడలేదు!-

నర్సింహంగారు నవ్వి- "ఇల్లు ఇరుకుంటే నయమని ఇది తీసుకున్నామమ్మా తమ్ముడు డాక్టర్ కాదుగదా? వాడికి ఆరోగ్యసూత్రాలు తెలియవు!" అన్నారు. ప్రమీల వింతగ చూసింది తండ్రిని ....

"అదేమిటి నాన్నా - మన చుట్టాలెవ్వరైనా వస్తే.... ఈఇంట్లో ఎలావుండగలరు?- ఈ ఆలోచన మీకేనచ్చిందా? లేకపోతే తమ్ముడు మరదలు చెప్పారా? ఆపిసి చెప్పాడా.... సినారిబుద్ధులే!...." కూతురు మాటలు పూర్తికాక ముందే

"చాల్లేమ్మా వూరుకో - నువ్వు మరదల్ని మాట అనే స్థానంలోలేవు! మీఅమ్మ చేసిందిగదా నిర్వాకం? ఇంక ఇంతకన్నా పెద్దింట్లో ఎలావుంటాం? అసలు గట్టిగ మాట్లాడకు- ఇంటివాళ్లు వింటే బాగుండదు! అతనెవరో తెలుసా? నేను తహసిల్దారీలో వుండగ - మా ఆఫీసులో నాక్రింద పని చేసిన గుమాస్తా ! చాలా మంచివాడుసుమా?- అందుకే తక్కువ అద్దెకి ఇల్లిచ్చాడు!. మాటిమాటికి నువ్వు ఇల్లు

చిన్నగా వుండటంటే - అతను ఏమైనా అనుకోగలడు!"- అన్నారు....

ప్రమీలకి నెత్తిన మొట్టినట్టైంది! 'రామ రామ' ఎంతఅసహ్యకం!- అనుకుంది! అప్పటికి ఫూరుకుని - మాసంగ స్నానానికి బయలుదేరింది!-

మధ్యాహ్నం తీరుబాటుగ కూర్చుని ... ఫ్యాన్ ఆన్ చేసి తండ్రితో కబుర్లు మొదలెట్టింది!- ఇంతలో శ్రీదేవి వచ్చి - "చూడండి వదినగారు ... ఈ కిటికీ వెనుక వేప చెట్టుంది!- ఎంతచల్లనిగాలి వేస్తుందనుకున్నారూ?- అన్నయ్య గారు ఎప్పుడూ చెప్పలేదూ? వేపచెట్టుగాలి ఎంతో ఆరోగ్యం! నెగడ ఫ్యాన్లు ... అంతా వేడి తప్ప గాలేమిటి ? పైగా కరెంటుదండుగ"- అని తీసేసింది ఫ్యాను.

ప్రమీల 'ర్రంయ్' మని లేచింది! "చూస్తున్నానువరుస ఏమిటమ్మా గోరణి?- ఆడబడుచు ఇంటికివస్తే నీకు గిట్టినట్టు లేదు!- మా అమ్మానాన్నా ఉన్నన్నాళ్ళువస్తాం. మాఇష్టం- నీపెత్తనం ఏమిటి?"-

నర్సింహంగారు గలగల నవ్వి - "మీ అమ్మానాన్నా దగ్గర ఎలావుంటావమ్మా? వాళ్ళేఇప్పుడు సీతమ్మడు మరదలి దగ్గర వున్నారు. అటువంటప్పుడు వాళ్ళపెత్తనం వుండక - మీ అమ్మదివుంటుందా?- ఆరోజులు పోయాయి! మీఅమ్మ ఇప్పుడు ప్యాక్టరీలో లేదు. రిటైర్ అయ్యింది!- ఉహూ రిటైర్ మెంట్ అంటే పెన్షన్ వస్తుంది - అదీలేదుగా - అన్నీ ఊడ్చుకు పోయాయిగదా?- అందుకని మీఅమ్మ సర్వీసు నుంచి డిస్మిస్ అయింది!- ఇంకెలా నీఇష్టం సాగించు

కుంటావు?- అయినా ఈ సంవత్సరంలో ఇదె నాల్గోసారి రావడం అనుకుంటాను కదూ!"- అంటుంటే తె ్రేనా ఇలా మాట్లాడేది - ఏదైనా 'టేప్ రికార్డ్ ఆన్ చేసేరా? అనుకుని - కళ్ళనీళ్ళ పర్యంతం అయ్యింది!-

సరేలెండినాన్నా - నేను పుట్టింటికి రావడం తప్పే! ఆ అలవాటు లేనివాళ్ళకి మరీతప్పు! మరదలమ్మగారు పుట్టింటికి వెళ్ళి ఏడాదిన్నర దాటిందేమో?- పాపం ఏం వెళుతుంది లెండి - వాళ్ళచెల్లెలు ఉద్యోగానికి పోయిందా? పెళ్ళికాని కూతుర్నే ఇంట్లో పోషించలేక పోతున్నారు" .... ప్రవిూలని మధ్యలోనే ఆపింది శ్రీదేవి—

"మరేనమ్మా!- పెళ్ళిచేసి అత్తారింటికి పంపితే - కొడుకులకి చిప్పలు దొప్పలు మిగులుతాయని - పెళ్ళి మానేసి - ఉద్యోగానికి వెళ్ళిందిఅది! దాన్ని చూసేనా బుద్ధి తెచ్చుకోవాలని నేనుకూడా వెళ్ళడం మానేసేను. నాఇంట్లో నాకేంలేదా?- నాఇల్లు వదులుకుని - పుట్టింటి మీాద ఎందుకు పడాలి?"-

"బాగాచెప్పావమ్మా శ్రీదేవి!- ఆడపిల్లలే పిల్లలనుకుని -ఇల్లంతా వాళ్ళకేపెడితే ....కొడుకులు కొడళ్ళమాటో?- విూామాలతి చిన్నపిల్లైనా .... పెద్దాళ్ళు చేయని మంచిపని చేస్తోందమ్మా"- అంటూ తండ్రి మరదల్ని మెచ్చుకునేసరికి- మూతిముడుచుకుని అక్కడనుంచి లేచి వెళ్ళిపోయింది——

ఎన్నో చెప్పుకుందామని .... వీలైతే ఏదైనా రాబట్టుకుందామని ప్రవిూల ముళ్ళమిాదవున్నట్లు వారం రోజులు గడిపి - ప్రయాణం కట్టింది!

పుట్టి బుద్దెరిగినప్పట్నుంచీ - ఇలా నోరుమూసుకుని పడివుండటం అనుభవంలోలేని తల్లీ కూతుళ్ళకి - యమబాధలావుంది!-

బొట్టుపెట్టి పసుపుకుంకుమ ఒక రవికలగుడ్డ పూలు పళ్ళు చేతిలోపెట్టింది శ్రీదేవి. ప్రమీలాలకిఆపెట్టడం చాలదు. రత్నమ్మ మాత్రం .... 'అదైనాపెట్టేరు - అదే పదివేలు'- అనుకుంది!- కూతురు చేతిలో పెట్టడానికి ఆమెదగ్గర ఏం మిగల్లేదు!——

తండ్రిమాత్రం కొన్ని హితవులు చెప్పేరు.- "చూడమ్మా- మీ ఆడబడుచుల్ని అత్తగార్ని బాగాచూసుకో!! అనవసరంగ రైలుఖర్చులు పెట్టుకుని వారంరోజులకోసం వచ్చావుగానీ - ఆడబ్బు మీఇంట్లో మరొక ఖర్చుకి పనికి వచ్చేది! దుబారాలు చేసి అల్లుణ్ని బాధించకు! అనకూడదు గానీ - శ్రీదేవి బహు మంచిపిల్ల! ఆ అమ్మాయి దగ్గర నేర్చుకోవలసినవి ఎన్నోవున్నాయి! ఈసారి నేర్చుకుందువుగానీ"!- ప్రమీల బెల్లం మొత్తిన రాయిలా .... ఊ, ఆ, అనకుండా బండెక్కింది!-

రత్నమ్మగారు .... ఇష్టంలేకపోయినా 'పురాణ పుస్తకాలు'- బూజుదులిపింది!- ఒక మంచిరోజుచూచి!!- ఇంటిగలావిడ, ఏదో మాట్లాడుదామని వచ్చి - 'సీతాదేవి వనవాసం' - చదువుకుంటున్న - మాజీ తహసిల్దార్ గారి భార్యని చూసి నిర్ఘాంతపోయి- వెనక్కి తిరిగి వెళ్ళిపోయింది.-

ఆ సమయంలో శ్రీదేవి, కృష్ణ బయటికి వెళ్ళడానికి తయారై పాపతో మామగార్ని షికారు వెళ్ళమని

చెప్పి .... మరిదిని .... ఇంటిపట్టునే వుంచమని - అత్తగార్కి- చెప్పడానికి వచ్చింది!-

రత్నమ్మగారు -'మంచిది వెళ్ళిరండమ్మా' అన్నట్టుగ! తలవూపి- పుస్తకంమీద దృష్టినిలిపే ప్రయత్నంలోపడింది-

“దేవి - చూసేవా? ఈ సంజెచీకట్లన్నీ రాత్రిలో కరిగి .... రేపుఉదయం వెలుగు రేఖలు ఎంతబాగా కనిపిస్తాయో?”- అన్నాడు దారిలో ....

“ఊఁ! నాకు తెల్సింది లెండి! మీరెందుకంటున్నారో?”- అని చిలిపిగనవ్వింది.

“కాదామరి - బ్యాంకులో అమ్మపేరు 'ఫ్రీ'- మన పేరుతో సంఖ్య పెరుగుతోంది! మరొక రెండేళ్ళల్లో - లోను తీసుకుని ఓచిన్నఇల్లు కట్టుకుందాం! తమ్ముడికి ఎక్కడైనా ఉద్యోగం వేయించాలి!- పాపని కాన్వెంటులో జాయిన్ చేయాలి! మనకి పాపైనా బాబైనా - తనేకదా? కొడుకులా చదివించి .... కూతుర్లా పెళ్ళిచేసి పంపాలి!—

“చాలు చాలు ఫుల్‌స్టాప్! అందరూ వింటున్నారు అని ఆపింది—

# 15

మే నెలాఖరు రోజులు! ఎండలు మండిపోతున్నాయి!

రామం వారం రోజులనుండి జ్వరంతో మంచంమీదే వుంటున్నాడు- ఎమ్. ఎ పరీక్షలకి రాత్రింపగళ్లు చదివి -

బాగానే రాసేనని తృప్తిపడ్డాడు. పెట్టెబెడ్డింగ్ సర్దుకుని పోదాం అనుకున్నాడుగానీ....మాలతి 'మరొకనెల వుండరా! నేనుకూడా రెండురోజులు సెలవుపెట్టి ఇంటికివస్తాను'- అంది 'సరే' అని వున్నాడు. ఇంతలో ఈజ్వరం ఒకటి తగిలింది!-

మాలతి ఆఫీసుకెళ్ళిపోతే - తను ఒక్కడు గదిలో వుండాల్సి వస్తుంది!- కానీ కాంతారావుగారి భార్య - పెద్ద కూతురు సుజన - స్వంత బంధువుల్లాగ సేవచేస్తున్నారు ... కాఫీకాచి ఇవ్వటం .... డబల్‌రొట్టె .... బత్తాయిరసం వేళ పట్టునఇస్తూ-ఆకబురు-ఈకబురు చెప్పి....ధైర్యం చెప్తున్నారు!-

రామానికి ఎంతో గౌరవంగవుంది, వాళ్ళమీద!- 'ఈ మహాపట్నంలో యమబిజీగవుండే మనుష్యుల యాంత్రికజీవితంలో - తోటి మనిషికి-అనారోగ్యస్థితిలో వున్నపుడు- సపర్యలు చేయడం .... ఎంతటి ఔదార్యం! సాయంత్రం వరకు మాలతి రాదుగదా?- అన్ని అవసరాలు వీళ్లుచూడ బట్టి - తను ఈమాత్రంగ మంచంలో నిలవగల్గేడు!- పాపం! సుజన ఎంత కష్టపడుతోంది! తనెవరు? నేనెవరూ?-

ఆనాడు మాలతి శేఖర్ గురించి చెప్పాక - తను వెళ్ళి పరిచయం చేసుకున్నాడు. చాలాసౌమ్యుడు!- మంచి ఆదర్శా లూవున్నాయి!- అయితేనే తండ్రిచేసిన మోసంవల్ల పాపం దోషిగ నిలబడ్డాడు!-

'మాలతిని చూసుకునేందుకు వచ్చేటప్పుడే - అతను కట్నం ఎంతిస్తే అంతే-అని తండ్రికి చెప్పాట్ట! తండ్రిఅప్పటికి

సరేఅని ....తీరా పిల్లనచ్చేక - బావమరిది మాటవిని - కట్నం ఎక్కువ కోరుతూ .... నాన్నకి ఉత్తరం రాసేట్ట! కానీ నాన్నగారు - ఇవ్వలేనని రాయగానే - అసలు సంగతి తెలిసి - శేఖర్‌కి కోపం వచ్చిందట ! తండ్రితో దెబ్బలాడుకుని .... ఇల్లువదిలి - అలిగి అక్కగారింట్లో కూర్చున్నాట్ట!- మాలతి మంచిపని చేసింది - సంబంధం నాకువద్దని ఉత్తరం రాయించింది. లేకపోతే మీనాన్నగారు ఎలాగో ఒకలాగ అప్పుచేసైనా .... పెళ్లిజరింపించేవారు. నాకు విషయం తెలియనీయకుండా మానాన్నగారు దాచిపెట్టేవారు. మామేనమామలాంటి 'శకునిమామ'- పేరు బయటికి వచ్చేదికాదు! ఇప్పుడన్నీ తెలియటంవలన .... నేను నిజంచెప్పి మీకోపం తీర్చాలి!- అంతవరకు మీ దృష్టిలో నేనుదోషినే!- 'అన్నాడు .... ఎంత స్నేహశీలి! ఈ కల్లాళ్ళనుంచి మంచి స్నేహితుడై పోయాడు!-

"ఏమిటి ఏదో ఆలోచిస్తున్నారూ?-" అని నవ్వుతూ సుజన కాఫీ తీసుకువచ్చింది.- రామం దుప్పటి సరిగా కప్పుకుని - "ఏంలేదు- మీగురించే అనవసరంగ నాగురించి శ్రమ తీసుకుంటున్నారు!"- అని కాస్త మోచేతుల మీదుగ లేచి వత్తిగిల్లి పడుకున్నాడు!-

"బాగుంది! అనవసరంగా ఎవరు శ్రమ తీసుకుంటారండీ? అవసరం గనుకే! మీకుజ్వరం వచ్చిందిగనుక!- మా ఇంట్లోవున్నారు గనుక .... మీ చెల్లెలుగారు ఆఫీసుకెళ్లుతున్నారుగనుక- మీరంటే మానాన్నగార్కి అభిమానంగనుక! మా చెల్లికి మేష్టర్ గనుక-"

"మంచివారే!- మనమంతా మనుష్యులం గనుక అన్నారు కాదు"-

"హాయింట్ నండో యే మర్చిపోయాను!"-

ఇద్దరూ నవ్వుకున్నారు!

"కాఫీతీసుకోండి చల్లారి పోతోంది" అంటూ స్టూలు దగ్గరకి జరిపింది.

రామం మొహమాట పడుతూనే గ్లాసుతీసుకునికొద్దిగ 'సిప్' చేసేడు!-

రామంగారూ - మీస్నేహితుడు శేఖరంగారు .... ఇదువరకు మాలతిని చూసుకున్నారటగా? మరెందుకు చేసుకోలేదూ?"- ఉన్నట్టుండి ఈప్రశ్న సుజన వేసేసరికి ఆమెవైపు చూసేడు. సుజన - మంచిదేహదారుఢ్యంతో చామనఛాయతో ....పద్దెనిమిదేళ్ళ యవ్వనంతో-పిటపిటలాడుతూ.... చక్కగవుంటుంది!- ఆర్థిక ఇబ్బందులులేని ఇంట్లో పుట్టింది గనుక .... బట్టలకి, తిండికి లోటులేదు!- ఎస్. ఎస్ ఎల్. సి ప్యాసై - చదువు మీదకన్న చిత్రకళమీద అభిరుచి వుండటంతో .... పెయింటింగ్ నేర్చుకుంది! చక్కని సాధనచేసింది ప్రతివస్తువు .... ప్రకృతి.... మనుష్యులు .... పశుపక్ష్యాదులు ఒకటేమిటి - అన్నీ ఆ అమ్మాయిదృష్టిలో నిలిచిపోతాయి!- ఇంతమంది చిత్రాలు గీస్తుందికదా? తన చిత్రం ఎందుకు గీసుకోకూడదూ?"- అనుకున్నాడు రామం .... సుజన చక్కదనం పరికించేక!

"ఏమిటలా చూస్తున్నారు? నేనడిగిందివినబడలేదా?"

“వినబడిందిలెండి - జవాబుకేముందీ? మామూలే! వాళ్లుకోరినంత మేము ఇవ్వలేకపోయాం! కాదు మాచెల్లెలు ఇవ్వవద్దన్నదీ:-”

“మరైతే మళ్ళీ మీస్నేహం ఎలా చేస్తున్నాడు?- మాలతిగారు ఎలా వూరుకున్నారు?”-

“దానికంతా అతను కారణం కాదుట! అతనికి తెలియకుండా వాళ్ళ మేనమామ - తండ్రీ జరిపేరు తంతు! నిజం తెలిసి అతనుకోపంవచ్చి తండ్రితో కొట్లాడి అక్కగారింట్లో వుంటున్నాట్ట!”-

“ఇంకానయం! హిమాచలాలు పోయి తపస్సు చేసుకున్నాడుగాదూ? ఏం లాభమండీ ఇలాచేస్తే?- యాదృచ్ఛికంగ మాలతిగారు కనిపించేరుగనుక- ఈ సంగతి చెప్పగల్గేరు లేకపోతే - ఈవిడెక్కడో వుండి ఆయనెక్కడో వుండి .... అసలుసంగతి మరుగునేవుండి - ఎందుకట ఆ ఆదర్శం!? ఎండిపోయి....ఏపాయ్యిలోనోపారేయడానికా? -నిజం తెలిసిన వెంటనే - అతను మీనాన్నగారి దగ్గరకివచ్చి - నాకేంవద్దు- మీ అమ్మాయిని చేసుకుంటానికి .... చెప్పకూడదూ?”|

“ఎలాగండీ?- మానాన్నగారు - మీరువేరే చూసుకోండి అని రాసేసేరుగదా? అదీగాక - తండ్రిని ఎదిరించి.... పెళ్లి చేసుకుంటానంటే - మానాన్నగారు మాత్రం వప్పుకుంటారా?- పెద్దలులేని పెళ్ళేమిటీ? మనకికొన్ని పద్ధతులున్నాయిగదా?”-

"బాగానేవుంది!– అటు తండ్రిని కాదని వచ్చినా .... పెళ్ళి చేయరు .... ఇటు కట్నం ఇయ్యలేరు!– పద్దతేమిటండీ? పాతచింతకాయ భావాలు!– ఈసనాతన ఆచారాలు పట్టుకున్నంతకాలం ఇంతే!– తెగించి యువతరం ముందుకు వచ్చినా .... సంఘానికి వెరిచి పెద్దాళ్ళు ముందుకు వచ్చేట్టులేరు!– అందుకే మరి ఇన్నేసి సమస్యలు .... చిక్కులు"–

"పోనీ మీరుచెప్పండి – మీ నాన్నగారు అలాచేయగలరా?" కప్పులో ఆఖరి గుక్కపీల్చి –స్టూల్ మీదపెట్టేడు!–

"సరేలెండి మానాన్నగారి సంగతి మీకు తెలియదు. ఎవరైనా చేసుకుంటానని రావాలేగాని – ఎగిరి గంతేసి వాళ్ళచేతులు కలిపేస్తారు!"– సుజన చేతులుచూసి చెప్పేసరికి, రామానికి నవ్వువచ్చి గట్టిగ నవ్వేడు!–

వత్తిగిలివుండి – అప్పుడే కాఫీతాగి–జ్వరంలో వుండటంచేత – ఆనవ్వుకు దగ్గుపొర అడ్డంవచ్చి – ఉక్కిరిబిక్కిరి అయ్యేడు ....

సుజన కంగారుగ చూసింది! రామం వెల్లకితలా పడుకుని దగ్గుతూవుండే సరికి ఇకఆగలేక గభాల్న వెళ్ళి గుండెల మీద రాసింది!– కానీ రామానికి దగ్గుఆగక వాంతిఅయింది!– సుజన బట్టలమీద, .... రామం – దుప్పటిమీద .... పడింది గబగబా గ్లాసులోనీళ్ళు తాగించి– గుండెలునిమిరి – దుప్పటి తీసేసి – మరొక దుప్పటి కప్పి– "పాపం అనవసరంగ మీకు నవ్వు తెప్పించి"–

"వూరుకోండి ; సుజనా ! ఏదిఅవసరం? మీరునాకు కాఫీఇచ్చి కబుర్లు చెప్పారుగానీ – నన్నిలానవ్వి బట్టలు పాడు

యేలా శాంతి చేసుకోమన్నారా?- మీకు నేనే క్షమాపణ చెప్పుకోవాలి!- నామూలంగా మీకు బట్టలు పాడయాయి! ఆ చీరవిప్పి ఇంకోటి కట్టుకుని - అది ఇక్కడ పడేయండి - సాయంత్రం మాలతి వచ్చాక శుభ్రంచేసి ఇస్తుంది!''- అన్నాడు ఆమెవైపు చూడటానికి సిగ్గుపడుతు-

''చూశారా? ఎంతైనా మేము పరాయి వాళ్ళనే గదా?- మీ చెల్లెలైతే ఏంఫర్వాలేదన్నమాట?- చాలెండి- చీర ఉతికించి ఇస్తానంటారుగానీ .... కొత్తచీర కొనిపెట్టాననలేదు!'' అని నవ్వుతూ కుచ్చెళ్లు జాగ్రత్తగా పట్టుకుని వెళ్ళబోతూవుంటే—

''మీకభ్యంతరం లేకపోతే తప్పకుండా''- అన్నాడు ఆమెవైపుచూసి—

''వెనక్కి తిరిగి - అభ్యంతరం లేదుగానీ - అది మీ మాలతి సంపాదన కాకూడదు''- అనేసి వెళ్ళిపోయింది!—

రామం చిత్రంగా ఫీలయ్యాడు!-

అసిస్టెంట్ ఇంజనీరు కూతురు - తమకులం కాదు, గోత్రంకాదు .... ఎందుకింత చేరువవుతోంది?- కుటుంబంలో అందరు మంచి మనసున్నవాళ్ళే - కానీ సుజనలో ఇంకేదో దాగివుందా?- లేకపోతే ఇంత మనసువిప్పి మాట్లాడదు! తను వచ్చినప్పట్నుంచీ గ్రహించలేదుకానీ-ఆమె ప్రతిచర్యలో.... తనకేదో తెలియచేస్తోంది!!- ఎలావుంటుంది దీని పర్యవసానం?- నేను జాగ్రత్తగా వుండకపోతే కష్టమేమో?- దేన్నైనా మొగ్గలో తుంచటం మంచిది! జ్వరం తగ్గగానే

వెళ్ళిపోవాలి! మాలతి వస్తానంది కనుక - ఆగేను కానీ - నేనుఇక్కడ ఎందుకు దండగ?- ఉద్యోగమా సద్యోగమా? చెల్లెలు సంపాదన తింటూ కూర్చుంటే సిగ్గుచేటు!- ఇప్పుడు సుజన ఏమంది? మాలతి సంపాదనలో కొనకూడదట! నిజమే ప్రజెంటేషన్ అంటే తన ప్రయోజకత్వంతో కొనాలి గానీ .... మరొకరి డబ్బుతో కొంటే .... సుజన లాంటివాళ్లు తీసుకుంటారా? ఆమె అన్నందుకైనా .... నేను తొందరగ ఉద్యోగం, ప్రయత్నం మొదలెట్టాలి!—

చిందర వందరైన ఆలోచనలతో .... రాముం మెల్లగ కళ్ళు మూసుకున్నాడు.

ఆరోజు మాలతి ఇంటికి రాగానే - "ఎలావుంది అన్నయ్యా?"- అని అడిగింది, మంచంమీద కూచుని - రామం 'బాగానేవుందని' .... ఉదయం జరిగిన సంగతిచెప్పి మూలపడేసిన దుప్పటి చూపించేడు!- మాలతి నొచ్చుకుని.... "అవిడకి నేను క్షమాపణ చెప్పుకుంటాలే"- అంది- "చెప్పు! ఆ తర్వాత ఆవిడ తిట్లేభరించు" అంటూనవ్వేడు.

"తిట్టే తిట్టిందిలే .... చెప్పడం నాధర్మం!"—

లేచి సబ్బుతీసుకుని పంపుదగ్గరకి వెళ్లుతూ....దుప్పటి తీసుకుంది!—

పంపుదగ్గర దుప్పటి పడేసి .... సుజనవాళ్ళ గదిప్రక్క్గ నిలబడి .... "సుజనగారూ" అనిపిల్చింది!- ఆ సమయంలో సుజన ఏదో స్వరూపానికి స్కెచ్ గీసుకుంటోంది!-

"ఎవరూ పిల్చేగా మాలతిగారూ"- అనివచ్చి - "ఆ మర్చేపోయేను. ఉదయం మీఅన్నయ్యగారు చూ

సీరాః బొత్తిగ మర్యాద తెలియదు. కాస్త చెయ్యిపెట్టి ఆపుకోరుటండీ?- కావాలని వాంతిచేసుకుని ...నాచీరమీద పడ్డాక....మూ చెల్లి ఉతుకుతుందిలెండి. అని ఓ పెద్ద ఓదార్పు! ఛ ఏంమనిషండీ మీ అన్నయ్య?- అంది సీరియస్‌గ——

నిర్ఘాంతపోయి తేరుకుంది!- "కావాలని వాంతిచేసుకుంటారండీ? మీరు అపార్థం చేసుకుంటున్నారు. అన్నయ్యకి నిజంగానే వాంతి వచ్చింది!- అయినా మేమంత అమర్యాదస్తులంకాదండీ?! చిన్నబుచ్చుకుంటున్నా - కోపంకూడా వస్తూనేవుంది.

"నమ్మమంటారు!- మీరు చెప్తున్నారు గనుక నమ్మాలా?"

"నమ్మకపోతే నేనేం చేయలేనండి"- అంటున్న మాలతిని చూచి నవ్వుతూ "ఏంచేయలేకపోతే ఎలాగండీ? క్షమాపణలు కోరుకోరూ?- నేనుచాలా శ్రమపడ్డానని - నాఉదారతని మెచ్చుకుని .... మీ అన్నయ్య తరఫునమన్నించమని వేడుకోరూ?!"- అని కొంచెం కంఠం తగ్గించి - "మీరు అందుకోసం కాదూవచ్చింది?"- అనేసరికి - మాలతి తెల్లబోయి - ఫక్కున నవ్వింది!

"మిమ్మల్ని ఓడించటం కష్టం సుమండీ?" అన్నది.

"లేకపోతే ఏమిటి మాలతిగారూ - ఆఫీసునుంచి వచ్చారోలేదో మీ అన్నయ్య మాటవిని ఏదోసంజాయిషీ ఇవ్వాలనుకున్నారు!- అందుకే - మీరు చెప్పనవసరంలేకుండా స్పష్టంచేసేను!- ప్రతిసారీ ఇలా 'సారీ'లు, చెప్ప

కండి - అవునూ ఇంతకీ మందుమూడు డోసులు తాగేరా మీ అన్నయ్య! ఆసంగతి కనుక్కోండి. ఈ రాత్రి తగ్గకపోతే- మందు మార్చాలన్నారు నాన్నగారు! రాత్రి డాక్టర్ గార్ని తీసుకొస్తారు!—

“మందు తాగేసినట్టున్నాడు చూస్తానులెండి!- ఏదో చిత్రం వేసుకుంటున్నట్టున్నారు. వెళ్ళండి”- అంది మాలతి తనూ పంపుదగ్గరకు వెళ్ళబోతూ - ఇంతలో సుజన వాళ్ళ అమ్మగారు వచ్చి- “ఏమమ్మా అన్నయ్యగారికి కాస్త పళ్ళరసమో గ్లూకోజో ఇచ్చేవా? మీ అమ్మగారుంటే ఎంత ఆరాట పడతారో....? ముందాపని చూడమ్మా!- ఈ రాత్రికి నువ్వేమి వంట ప్రయత్నం చేసుకోకు!- నేను చపాతీ కూర చేస్తున్నాను తిందువు! ఏమ్మా హోటల్లో తినరా? వాడు స్వచ్ఛమైన బ్రాహ్మడా? నేనూ శుభ్రంగానే చేస్తాలే!”- అన్నారు నవ్వుతూ.

“పాపం వాళ్ళకులం మనం చెడగొడ్తున్నామమ్మా!” అంది సుజన ఉడికింపుగ.

“మీరే అంటున్నారన్నీ - నేనెప్పుడు అనలేదు”- మాలతి మాట తిప్పగానే సుజన వాళ్ళమ్మగారు, సుజన నవ్వుకున్నారు.

o o o

జ్వరంతగ్గి పథ్యం తినేసరికి మనోకనాక పట్టింది రామానికి!—

ఈవారంలో సుజన మరింత .... చాలాదగ్గరగా ... వచ్చేసింది!- రామానికి చాలా క్లిష్ట పరిస్థితి ఎదురైంది!- తన ఫ్రెండ్స్‌తో కలిసి .... ఏ ఆడపిల్లనో, ఏడిపించటం అల్లరి చేయటం .... గోలచేయటం .... నేర్చుకున్నాడు గానీ.... మన సిచ్చేసి, మళ్ళీ వాళ్ళ మనసు పుచ్చుకోటం....నేర్చుకోలేదు!- ఇది ఎవరికి వారే నేర్చుకునే విద్య! తను ఆలోచనలో వుండగానే - ఆమనస్సు జారిపోయింది! ఇప్పుడేం చేయాలో తోచటంలేదు!- నాన్నగార్కి- ఎలాచెప్పాలి. అమ్మ ఒప్పు కుంటుందా? తనవాళ్ళకీ - వీళ్ళకి అసలు ఎక్కడా పొత్తు కలవదే?- సుజనా ఎంతపని చేసేవు? నన్ను అనవసరంగ నీవైపు లాక్కుపోతున్నావు! నేను చేయూత ఇవ్వలేని అస మర్థుణ్ణి!- నన్ను మర్చిపో .... మర్చిపో .... అనుకున్నాడు.

కానీ నోరువిప్పి చెప్పలేక పోయాడు —

ఇంటికి వెళ్ళే ప్రయత్నంలో .... బట్టలు సర్దుకుంటుం డంగా .... మాలతి దొడ్లో ఆరేసిన తువ్వాలు తేవాలని .... బయటికి వెళ్ళింది!- సుజన గదిలోకివచ్చి—

"ఊరికెళుతున్నారు గానీ-"నేనడిగింది మర్చిపోరుగ?"- అని చీరవైపు చూపింది! ఇంతలో చెల్లెలు మేష్టారికి ఫల హారం ప్లేటు తీసుకురావడంతో సుజన వెళ్ళిపోయింది!-

"ఎందుకమ్మా ఇవన్నీ?"-అన్నా వినకుండా... కాజాలు అక్కడపెట్టి ఫర్వాలేదు తీసుకోండి మేష్టారు"- అని ఆపిల్ల వెళ్ళిపోయింది!

'రామానికి సుజన కోరిక తీయగ .... గిలిగింతలు విని పించింది - కానీ దానికోసం ముందు సంపాదన మార్గం

చూడాలిగదా?'- అన్నీ సర్దేసుకుని -మాలతి తెచ్చిన టవల్ బ్యాగ్‌లో పెట్టమని -ప్లేటు అందుకుని కాజాలు రెండు తీసుకుని మిగిలినవి చెల్లెలికిచ్చేసేడు!-

నాంపల్లి స్టేషన్‌కి శేఖర్ వచ్చాడు ! మాలతి వస్తానంటే రామం వద్దన్నాడు -'రాత్రిమళ్ళీ నువ్వు ఒక్క-దానివి రావాలి - అదీగాక, నువ్వేమో ఎవరూ తోడులేకుండా.... ఉద్యోగం కోసం వచ్చానేవేం? నన్ను ఇంటికి పంపించడానికి తోడువస్తావా? ఇన్నల్ట్! రాకు హాయిగ గదిలో బజ్జో!'- అన్నాడు - స్టేషన్‌లో -ట్రైన్‌కి ఇంకా ఆలస్యం వుందిగదా అని ఫ్రెండ్స్ ఇద్దరు కాఫీతీసుకుని -వక్క-పొడి నములుతూ.... పచార్లు చేస్తున్నారు!

ఎదురుగ పాన్‌షాపులో మాగజైన్స్ తోరణాల్లాగ వేళ్ళాడుతున్నాయి! రిక్షాల్లో .... ఆటోల్లో ... టాక్సీల్లో.... కంగారుగ....హడావిడిపడుతు ప్రయాణికులు దిగుతున్నారు. ఒకావిడ బండెడు సామాన్లతో ఆయాసపడుతు, ఆగి"ట్రైన్ ఎంతలేటండీ?"- అని అడిగింది- "లేటులేదు. ఇంకావచ్చే సమయం కాలేదు అర్ధగంటవుంది!"- అని చెప్పాడు శేఖర్!

ట్రైన్ లేటుకాదంటే నమ్మలేనట్టుచూసి ... "అబ్బ ఏంజోకు వేసేరండీ? లేటుకాదుకానీ అర్ధగంట ఆలస్యం వుందని చెప్తున్నారా?" అని మళ్ళీ హడావిడిగ ఆసామాన్లన్నీ పట్టించుకుని వెళ్ళింది.

రామం, శేఖర్ ముఖాలు చూసుకుని నవ్వుకున్నారు!- "నిజాన్ని నమ్మలేని స్థితికివచ్చారు మనవాళ్ళు."- అన్నాడు రామం.

"నిజమే!- మీకెంత అక్కర్యో నా విషయంలో నమ్మలేదు! కట్నం తీసుకునే విషయంలోనే కోపం వచ్చిందా లేక ఎవర్నైనా ప్రేమించేవా?- అని అడిగింది!"- రామానికి సుజన చెప్పినసంగతి గుర్తువచ్చింది - "మీరు ఏమనుకోక పోతే ఒకమాట అడుగుతాను"-

"తప్పకుండా అడగండి"

"అహా! ఏం లేదు....మీరు మీనాన్నగార్ని ఎదిరించి- ఇక్కడికి వచ్చేకంటే - మానాన్నగార్ని అడిగి, - మ్యారేజ్ చేసుకోవలసింది!- అలా ఎందుకు చేసుకోలేదూ?"- శేఖరం నవ్వి - "నా ఉద్యోగంమాట మర్చిపోయేరు నాకు జాబు పర్మినెంటు కాకముందే ఎలాచేసుకోనూ?- ఇప్పుడుఅయింది! కనుక ఆ సంగతి ఇప్పుడు చెప్పాలనే అనుకుంటున్నాను. నా అదృష్టం అనండి - మరేమైనా అనండి-మీ చెల్లెలి కూడా ఇంతవరకు మ్యారేజ్ కాకపోడం -తను ఇక్కడికే ఉద్యోగానికి రావడం- అంతా చిత్రంగా జరిగింది!- నాకు ఆనాడే నచ్చిందిగనుక ఇక తన కిష్టమైతే నయాపైసా కూడా అక్కర్లేకుండా .... చేసుకోవాలని నా ఉద్దేశ్యం! ఇంటికి వెళ్ళి మీనాన్నగార్కి చెప్పి సెటిల్ చేయండి!- అప్పుడు ఈ 'అండీ'లు 'గుండీ'లు మానేసి- బావా అని పిల్చుకుందాం!"- అన్నాడు. రామం సంతోషంగ శేఖర్ భుజంపైన చేయివేసి... అలాగే! మానాన్నగారు ఒప్పుకోక పోయినా నేను చేయిస్తా మీపెళ్ళి!"- అన్నాడు...

ప్రయాణీకుల తొందర ఎక్కువనగానే .... ఇద్దరు, మెల్లగ ప్లాటుఫారం మధ్యకివచ్చి ట్రైన్‌కోసం చూస్తూ నుంచున్నారు...

రైలు కదిలేముందు "భయపడకు బావా మా చెల్లి నీదే!" అన్న రామం మాటలకి శేఖరం సంతోషంగ చేయి నొక్కి వదిలేసేడు!

○ ○ ○

జానకమ్మగారు కొసరి కొసరి తినిపిస్తూవుంటే - రామం తినలేక - "అబ్బ ఏమిటమ్మా - నీకెంత అభిమానం వున్నా - నాకెంతజ్వరం వచ్చి తగ్గినా .... ఇంతలా పెడ్తే తినగలనా?" - అన్నాడు మంచినీళ్ళగ్లాసు అందుకుని——

"వెర్రినాయనా ఎంత పెట్టేనురా?" -

నారాయణరావుగారు .... భార్యవైపు చూసి ... "ఎప్పుడో జ్వరంవచ్చి తగ్గితే - ఇప్పుడెందుకే ఇంతబాధ?" - అని "ఒరేరామం - మీఅమ్మకేది చెప్పినా కష్టమేరా? - ఆమధ్య మాలతి హైద్రాబాదు వెళతానన్నప్పుడు .... ఎంత గొడవచేసిందో? - ఇప్పుడు ప్రకాశం బి. య్యేలో చేరాలా! - మళ్ళీ మొదలెట్టుంది!" - అంటుంటే - "సరేలెండి - ఏతల్లైనా అంతే! అక్కడికి మీరు బాధపడనట్టు నామీదే చెప్తారేం?" నెయ్యిగిన్నె పట్టుకుని వెళ్ళిపోయింది! -

రామం నవ్వి - "పోనీలేమ్మా - మీరిద్దరూ అంత ప్రేమాభిమానాలు చూపడం మాఅదృష్టం కాదా?" - అన్నాడు -

అన్నాడే కానీ - మనసులో మాత్రం - ఇలాంటితల్లి తండ్రులతో స్వతంత్రించి పెళ్ళిచేసుకోతం ఎంతకష్టం? - తట్టుకోగలరా? - అసలు ఎలాచెప్పాలి? -.... కానీ శేఖర తనుఇప్పుడు స్వతంత్రించి చేసుకోడూ? - అయితే మాలతి కులమింటి పిల్లేగదా? - నేను మరొక కులం పిల్లను చేసు కుంటానంటే - వీళ్ళు సహించగలరా? ఈ ప్రేమాభిమా నాలు .... ఆదరణలు .... అప్పుడేమవుతాయి? - అనుకుంటు కలిపినముద్దే మళ్లీ కలుపుతూ కూర్చున్నాడు.

"ఈమధ్య మరొక విశేషం ఏమిటో తెలుసా? భవానీ - అతనుపిల్లలు వచ్చివెళ్ళారు. శ్రీదేవి మునపట్లా పెంకితనంగలేదు. వాళ్ళ ఆడబడచు పెళ్ళికి అంతా ఊడ్చుకు పోతే - ఇప్పుడు అద్దెకింట్లో - అంతా దీనిపెత్తనంతో నడు స్తోందిట సంసారం! - సరే మాలతి ఉద్యోగం చేస్తోందికదా? - రెండుమూడేళ్ళలో ఎన్నిమార్పులో-" అని నారాయణ రావుగారు అన్నారు.

"ఏమిటి పెద్దబావ అక్కయ్యని పిల్లల్నితీసుకుని వచ్చాడా? అబ్బా ఎంతవింతో - ఏమూలో ప్రళయం వస్తుందేమో?"-

ప్రకాశం అన్నగారి మాటలకి నవ్వి - "ఇంకావిను ప్రవేటుగ పరీక్షలకి చదువుతున్నాట్ట! ఇప్పుడు వ్యవసాయం తను చేయకుండా తండ్రికే అప్పచెప్పి - ఏచిన్న ఉద్యోగ మైనా వెలిపోతాను. ఆఊర్లోమాత్రం వుండను -అన్నాడు"-

"నిజమే?! అబ్బో అబ్బో ఎంత గొప్పవాళ్ళు? - బావలో ఇంతధైర్యం శక్తి సామర్థ్యాలు వున్నాయా? -

చిన్నప్పుడు ఒకసారి కోరికపుట్టి ప్యాంటు కుట్టించుకున్నాట్ట!- వాళ్ళనాన్న అంతెత్తునలేచి -జులాయివెధవా నీకు పొడుగు లాగులు ఎందుకురా- అని కత్తిపీటపెట్టి మధ్యకి రెండు ముక్కలుచేసి - చిన్నలాగులు రెండు చేయించాట్ట!- మరి ఇప్పుడు వాళ్ళనాన్న తన్ని గదిలోపడేసి గొళ్ళెం పెట్టలేదూ? అసలు మనింటికి రావడానికి ముందు ఎన్నాళ్ళనుంచీ ఇంట్లో యుద్ధం జరిగిందో?"- పులుసుగిన్ని తీసుకునివచ్చిన జానికమ్మ- "అయ్యో అన్నం తినకుండా అలా వుండిపోయేవేమిటి నాయనా ముందుతిని మాట్లాడుకోండి" - అని వడ్డించింది. "సరేలే"అని తింటూ - "ఏమంటారు" నాన్నా అన్నాడు-

జానికమ్మగారే అందుకుంది- "ఏంకాలేదట! అసలు బావ మునపట్లాలేడు. అక్కయ్య చెప్పింది! వాళ్ళ తమ్ముళ్లు మరదళ్ళు ఎలావున్నారో చూసేక .... ఇతనిలోనూ మార్పు వచ్చిందిట! వాళ్ళమ్మ చూపించే భేదాలు - వాళ్ళనాన్న చూసే తేడాలు గమనించేక, తన తెలివి తక్కువతనం తెలిసి వచ్చిందిట!- వాళ్ళమ్మని నాన్నని కాస్త ఎదిరించటం నేర్చుకున్నాట్ట! అక్కయ్య చెప్తుంటే నేను నమ్మలేక పోయాను గానీ - బావ స్వయంగా నాతోఅన్నాక నమ్మేను!"-

"ఏమనీ? తనలోకొత్త తెలివి పుట్టుకొచ్చిందన్నాడా?"

నారాయణరావు గబగబా అందుకుని- "కాదులే - మా అమ్మకి సన్నసన్నగ చీవాట్లుపెట్టేడు ఈమడీ ఆచారం చాదస్తం తగ్గించుకో అత్తయ్యా! చేస్తున్నకొలదీ ఇంకా అజ్ఞానంలో కూరుకు పోతామేగానీ - బయటికి రావడం వుండదు, మాతమ్ముళ్ళు మరదళ్ళు ఏం చేయకపోయినా వూరు

కుంటుంది మాఅమ్మ - అదే భవాని వచ్చిన విషయం వది లేసినా తాడిఎత్తున లేస్తుంది! నాన్నా అంతే!... అయితే ఆచారం అంటే కొందరికే పరిమితమా? చదువుసంస్కారాలు నేర్చి ఉద్యోగాలు చేసుకునేవాళ్ళకి అక్కర్లేదన్నమాట! ఆపని నేనుకూడా చేస్తే .... వాళ్ళలాగే నేనూ సుఖపడ వచ్చుగదా?- అంటే వీలునిబట్టి ఆచారం-వీళ్ళనిబట్టి నాటకం- అన్నమాట!- అనవసరంగ ఈరూల్సుని పట్టుకుని పాకులాడితే ఏంఒరిగింది?- అందుకనీ ఇవన్నీ అర్థంలేని పనికిమాలిన కట్టుడులు!- నువ్వు చక్కగ ఏ ఉతికి ఆరేసిన చీరో కట్టుకుని వంటచేయి!- నేను ఇకమీదట భవానీచేత అలాగే చేయి స్తాను'.... అంటూ అమ్మయ్యో ఓ పెద్ద లెక్చర్ ఇచ్చేడు - మాఅమ్మప్పుడు ఎంత పొంగిపోయిందో తెలుసా?- అంతకు ముందు నేనెన్నిసార్లు చెప్పినా వినలేదుగదా! ఇప్పుడు అల్లుడువచ్చి చెప్తే .... అందులోనూ-చాంగసుడైన అల్లుడు చెప్తె ఇక అది వేదమేఅనుకో - చాలావరకు మడీతడీ తగ్గించే సింది!"- అంటూ "పొయ్యిపులుసు గరిట అలా పట్టుకుని ఉండిపోయేవేమిటే?"- అనినవ్వేరు-

రామానికి చాలా ఆశ్చర్యంవేసినా ....'కాలం ఎంత గొప్పదో'- అనుకుని - గబగబా అన్నంతినేసి - "మజ్జిగ తేమ్మా నేనింకో మంచివార్త చెప్తాను"- అన్నాడు. భోజనం ముగించి లేచేలోపులో - శేఖర్ సంగతిచెప్పి ... ఇంక ముహూర్తాలు పెట్టుకుంటారో గుళ్ళోపెళ్ళి చేస్తారో ఆలో చించుకోండి!"- అనిలేచాడు.

జానకమ్మగారితోపాటు నారాయణరావుగారూ ... ప్రకాశం కూడా ఆనందంతో ఉక్కిరి బిక్కిరి అయి పోయారు.

# 16

సాయం సంధ్యవేళ - పిల్లలంతా గోలగోలగ ఆడుకుంటున్నారు, వీధిలో ....

కంకరరోడ్డుమీద మట్టిఅంతా ఎగిరిపోయి ... రాళ్ళు పైకితేలి సూదుల్లా గుచ్చుకుంటున్నాయి!- మున్సిపాలిటీ వాళ్ళు రోడ్డుబాగుకోసం పోసిన, కంకరకుప్పంతా ... రాత్రిపూట... చాటుగ ఇళ్ళల్లోకి చేరి బావులదగ్గర కాలవలదగ్గర కొత్తరూపాలు సంతరించుకుంటోంది!- మిగిలివున్న రాళ్ళు పిల్లల ఆటలకి - కోపాలొస్తే కొట్టుకోటానికీ ఉపయోగపడుతున్నాయి!-

ఇళ్ళల్లో చెత్తాచెదారం...ఊడ్చి ఇంటిముందు చెత్తకుండీదగ్గరపోస్తే - కుక్కలు కోళ్ళు కెక్కరించి - వీధంతా పరిచేయి!- కాస్త కుండీదగ్గరగా వెళ్ళి అందులో పడేటట్టు పొయ్యాలంటే ... దారిలో ఏంతొక్కుతామో అని ... నాల్గుగజాల ఇవతలనుంచీ ... విసిరేస్తే ... అది గురికుదిరినప్పుడు - సరిగ్గా అందులోపడేది - లేకపోతే కాస్త అటు ఇటుగ రెండు గజాలదూరంలో పడేది. గాలివిసురుకి అది కొట్టుకొచ్చి రోడ్డుమీద అందరితోపాటు ఆడుకునేది ... ఇంతకీ ఏమిటీ? ఎంగిలి విస్తరాకు!!

వీధంతా రాళ్ళు ... చెత్త ... విస్తరాకులు బంతులాటలాడినా ... పట్టించుకోరు, ఆవీధివారు. తమ ఇంటి ముందుమాత్రం ఓబారెడుమేర తుడిచి అలుకుజల్లుకుని ముగ్గులేసుకుంటారు!- అవతల ఇంటికి, ఇవతల ఇంటికి -మధ్య తుడిచిపోసిన మట్టికుప్పలే సరిహద్దులు!-

అటువంటి దివ్యమైన ప్రదేశం పిల్లల ఆటలస్థలం!

తొక్కుడు బిళ్ళ... చెమ్మాచెక్కా- పుక్కుగిల్లులు ఆడుకుంటున్న పిల్లల్లో-విశాల బాబాయ్ పిల్లలు ...పక్కింటి సుబ్బమ్మత్త పిల్లలు వున్నారు. ఆటల్లోవదో తేడాలువచ్చి ఒకర్నొకరు - మొట్టికాయలిచ్చుకుని, గిచ్చుకున్నారు. అదీ చాలక ఒకతోపు తోసుకున్నారు. ఆ తోపులాటలో సుబ్బమ్మత్త పిల్ల రోడ్డుమీదపడి -కంకరరాయి ముఖానికి గుచ్చుకుని - రక్తంకారింది!——

ఇంకేముంది - కొంపలంటుకుందుకు బోలెడంత వీలు కుదిరింది!- అసలు ఈమధ్య - ఆఇంటికీ ఈఇంటికీ - కొంత చెడింది! తోడికోడళ్ళు ఇద్దరూ వేర్లు పడటంతో - ఆవిడ మీద - ఈవిడకి - ఈవిడమీద ఆవిడకీ సాడీలు చెప్పుకునే- 'వార్తాపత్రిక'ల్లాంటి అమ్మలక్కలకి - ఆఇద్దరు తోడికోడళ్ళతో అడపా తడపా మాటలు పడాల్సివచ్చేది ఓసారి సుబ్బమ్మత్తకి పెద్దతోడికోడలతో పేచీవచ్చింది. మరోకసారి చిన్నావిడతోటీ వచ్చింది! అందుచేత ఇప్పుడు - ఇద్దరూ విరోధులే -సమయంకోసం కాచుకున్న సుబ్బమ్మత్తకి -పిల్లకి దెబ్బతగిలిన బాధకంటే ఎక్కువబాధ తనకొచ్చింది!- ఇంకో అవకాశం - ఆ రెండోఆవిడకి ఒంట్లోబాగులేదు!

పగతీర్చుకోవచ్చు! "రంయ్'మని ఇంట్లోంచి దూసుకుని వచ్చింది, పిల్ల ఏడుపు వినగానే—

"గంపెడు పిల్లల్నికని ఊరుమీద వదలగానేసరా? పెంచటం చాతకావద్దూ? అమ్మో ఎంతలా దెబ్బతగిలిందో? ముఖం చిల్లడిపోయింది నాకూతుర్కో ...ఇంక నాకేందారో? లక్ష్మిగారూ ఇలారండి - ఏమండోయ్ నాగమణిగారూ చూడండి! అయ్యోనాపిల్లని చంపేసేరండోయ్!"- అంటూ గావుకేకలు వేసి నల్లుగ వచ్చి చూసేదాకాఆ కారుతున్నరక్తం తుడవకుండా... ముఖమంతా వులిమి .... అంతావచ్చారని నిర్ధారణ చేసుకున్నాక.... "అమ్మయ్యో ముఖం కనిపించటం లేదర్రా? పిల్లముఖంఅంతా చిల్లడిపోయింది!"- అంటూ బోరున ఏడ్చింది.

ఆ నాగమణిగారు....పరాంకుశం గారిభార్య! డాక్టర్ ప్రభాకరం .... ఇంట్లో అవసరమయ్యే కొన్ని ప్రథమచికిత్స పరికరాలు .... పెట్టడంచేత .... ఆవిడ వెంటనే ఆరక్తం పాత గుడ్డతో తుడుచి .... మళ్ళీ తడిగుడ్డతో అద్ది .... గాయం తగి లినచోట ఐడిన్ వేసి దూది అంటించి .... కట్టుకట్టింది. ఐడిన్ మంటకి పిల్ల మొర్రోమనేసరికి సుబ్బమ్మ త్తనోరు తారస్థాయి చేరింది!—

"విధవపిల్లలు తిన్నదిఅరగక ఊరువాళ్ళందర్ని ఇలా ఉసురు పెట్టుకుంటున్నారు- పాపం ఆ విశాల దేవత! తెగ చాకిరీలు చేసి....ఆఖర్ని దానిజీవితం వీళ్ళకోసం తగలేసుకుంది. ఆపిల్ల ఆస్తి కాజేసి తెగమెక్కుతున్నారు!- ఎన్నడైనా ఆపిల్ల పేరుమీద 'తద్దినం' పెట్టేరా? దానిఉసురు తగలకుండా

పోదు! దానిఆత్మ మీా ఇంటిచుట్టూ తిరుగుతూనే వుంటుంది!- అందుకే ఆచిన్నావిడికి రోగం పట్టుకుంది! ఊరికే పోతాయా రోగాలు?- అందరి ఉసురు తగలకపోతుందా? కనీపించే ఇల్లు .... పిల్లాపాపా వున్నకొంప అనిశాల పేరుమీాద .... పట్టెడన్నం ఎవరికైనా పెట్టేరా? బలవంతంగా ప్రాణంతీసుకుందిపాపం! చూస్తూవుండండి - మీాఇల్లు సర్వనాశనం చేసి తీర్తుంది!"- అని అరుస్తూనేవుంది!—

బాబాయిలిద్దరు వరండాలోనుంచి ఏక కంఠంతో అందుకున్నారు!—

మధ్య సావిట్లోనుంచి పెరటిగోడ దాకా - అడ్డుగోడలు .... తడికెలు .... కట్టుకుని ముఖాలు కనిపించకుండా బతుకుతున్న అన్నదమ్ములిద్దరు .... ఎవరైనా తమఆస్తి వ్యవహారాల్లో కలగచేసుకుంటే - ఒక్కటైపోయి ఏకమత్యంగా తగూలాడగలరు!- మరి ఇద్దరూ తింటున్నారుగదా ఆస్తి!!-

"ఇదిగో ఏమమ్మోయి సుబ్బమ్మా! నోరు కాస్త సంభాళించుకో .... మరీ స్వేచ్ఛగ పోతున్నావేం! పిల్లముండకి దెబ్బతగిలిందని- 'తుంటికికొట్టే పళ్ళు రాలేయి' అన్నట్టుగ- ఆగోడవలోనుంచి ఆస్తిగొడవల్లోకి పోతావేం? అసలు విశాల చచ్చిందని ఎవరన్నారు? అది ఎక్కడో బతికే వుంటుంది! ఎవడితో పోయిందో? దానికి దానిఇల్లు వాకిలి అక్కర్లేక.... అయినవాళ్ళని మమ్మల్నందర్నీ ఒదులుకుని పోయింది!-

ఆస్తికావలసివస్తే అదే అడుగుతుంది! వద్దనుకుంది గనుకే లేచిపోయింది! చిన్నప్పట్నుంచీ పెంచి పెద్దచేశాం గనుక - మేం అనుభవించడానికి హక్కుంది! మధ్య నీకెం

దుముదుగ్ధ!? కందకిలేని దురద కత్తిపీటకా? పాపం నీకెవరి ఆస్థిపాస్థులు కలవడానికి వీలులేకుండా పోయింది కాబోలు అందుకని మామీద ఏడ్చి పోతున్నావా?"-

"మరే? నాకిదేపని?- ఎవరిమీద ఏడుద్దామూ అని .... కాని పక్కింటివాళ్ళేగదా అని మీ మీద ఏడుస్తున్నాను - ఇంతకాలం పురుళ్లు పుణ్యాలు అన్నీ అష్టమైన గాడిదపనులు చేసేను! ఇప్పుడు రెండేళ్ళనుంచి కాన్పులు వెనకట్టేయి గనుక- నా అవసరం తీరింది - ఎంతమాట పడితే అంతమాట విసురుతున్నారా? ఆస్థులు కలుపుకుని కులుకే బుద్ధులు మీకున్నాయిగానీ మాకులేవు! చిన్నప్పట్నుండి దాని సంరక్షణామీరు చేసేరా? ఏమీ? దానితండ్రి పొలంమీదపండేపంట మీకు తీసుకోలేదూ?- మొగుడు చచ్చాడని చెప్పి ఒకమంచి గుడ్డ కూడా కొనివ్వలేదు పాపం! వంటలక్కపని - మంత్రసాని పని - పనిమనిషిపని .... చాకలిపని.... అన్నీ చేసింది!- పట్టెడు కూడుపెట్టేరు దానికి!- ఆఖర్న చావమని వెళ్ళగొట్టేరు!- ఇప్పుడేమో ఊరుమీదపడి అందర్ని చావగొడ్తున్నారు. అమ్మయ్యో! నాపిల్ల లేచినవేళ మంచిది గనుకగానీ కన్ను చిల్లడిపోయేది!- వెధవపిల్లలు .... పెంటకుప్పలమీదవీళ్ళే.... పెరళ్ళలోనూవీళ్ళే - రోట్లమీద- అరుగులమీదా ఎక్కడా వీళ్ళే! సైజులవారీగా .... 'ఎద్దులా ఎదిగిన మగపిల్లల దగ్గర్నుంచి - చింపిరిజుట్టుతో తిరిగే రెండేళ్ళ గుంటముండ" వరకు .... పిల్లలే! ఛీ కోడిపిల్లల్లాగ అందరి ఇళ్ళల్లోపడి తిరగటం!- రావేపిల్లా వాళ్ళతో ఆడుకోవద్ద చెప్పలేదూ" అంటూ పిల్లని ఒక్కగుంజుగుంజి దగ్గరకి తీసుకుంది!—

అంతవరకు - కేవలం వింటున్న పెద్దతోడికోడలు - రంగంలోకి దిగింది-

"నీగుణాలు అలావడవబట్టే పుట్టినవాళ్ళంతా చచ్చి- ఇద్దరుపిల్లలే మిగిలేరు!-ఇంకా ఎందుకు నీబుద్ధి మానుకోవ్వూ? పరులు పచ్చగావుంటే ఓర్వలేవు ... మాపిల్లల్ని చూస్తే నీకళ్ళలో నిప్పులు పోసుకుంటున్నావు!"- ఆడవాళ్లు రంగంలోదిగేక మగాళ్ళు తప్పుకున్నారు- నువ్వంటే నువ్వని ... ఏనాటి గొడవలో ఎత్తుకుని .... సిగపట్లగోత్రంలా నిరూపించుకుని-'అసలు విశాలని ఏమందో పెట్టి చంపి రాత్రికి రాత్రే పారేసేరో పాతిపెట్టారో'- అంది సుబ్బమ్మ - 'నువ్వే ఎవరితోటో దాన్ని లేపి పంపించేసేవ్'- అన్నారు తోడికోడళ్లు

ఈవేడుక చూడటానికి - జనం అంతా గుంపులు గూడి - అరుగులమీద - వరండాల్లో - రోడ్డుకు అడ్డంగ దడికట్టేరు!--

దెబ్బతిన్న పిల్లకి - దెబ్బ తగిలించిన పిల్ల -తనదగ్గర వున్న పిప్పరమెంట్ బిళ్ళ ఇచ్చింది!- చెట్టాపట్టా లేసుకుని - తల్లుల యుద్ధం అందరితో పాటు చూస్తున్నారు! అంతా ముగిసి ఎవరిళ్ళకి వాళ్లు వెళ్లేసరికి భోజనాలవేళైంది!-

ఆసమయంలో మరొక విచిత్రం జరిగింది!

బాగా గడ్డాలు మీసాలు .... వుండి పొడుగ్గావున్న 'అంగరఖా' వేసుకున్న ఒకసాధువు - విశాలా వాళ్ల ఇంటికి వచ్చాడు!

"ఇప్పుడేం లేదు ఫో!-" అనికసిరి తలుపు వేసుకో బోయిన చిన్నఅతన్ని -"ఒరే నేనురా తమ్ముడా!"- అన్నాడాయాభై ఏళ్ల ముసలిసన్యాసి!-

గొంతుపిసికి నట్టైంది, చిన్నతమ్ముడికి - అమ్మబాబోయ్ ఎక్కడినుంచి వూడిపడ్డాడురా బాబూ? అనుకుని "ఒరే చిన్నన్నయ్యా మన పెద్దన్నయ్య వచ్చాడురా?" అని గోడ పక్కనుంచి గోలపెట్టేడు - చిన్నన్నయ్య అన్నానికి కూర్చోబోతున్న వాడల్లా షాక్ తగిలినట్టు వెనక్కిపడిపోయి- లేచి బయటికి వచ్చాడు-

అప్పటికే విశాల తండ్రి చిన్నతమ్ముడి వాటాలోకి వచ్చి...."వేర్లుపడ్డారేమిట్రా! గోడలన్నీ పెట్టేరు?- అమ్మ బాగుందా? వెళ్ళిపోయిందా?- నావిశాలతల్లి ఏదీ? ఇలా పిలవండి!"- అన్నీ ఏకబిగిని అడుగుతూవుంటే- పెద్దతమ్ముడు వచ్చి - "సరేలేగానీ-నువ్వు నిజంగా మా అన్నయ్యవే? ఎప్పుడో పన్నెండేళ్ళనాడు వెళ్ళిపోయిన మా అన్నయ్య అసలు ఉన్నాడో లేడో తెలియదు! ఇంట్లో ఎన్నెన్ని దుర్ఘటనలు జరిగినా .... ఇద్దరం ఇలా మేం నానాతిప్పలుపడి - సంసారంలోపడి కొట్టుకుంటున్నాం! ఏనాడూ మావైపు తొంగిచూడని అన్నయ్య ఈనాడు వస్తాడా? నమ్మమనే ఈ మాట?"- చిన్నితమ్ముడివైపు చూస్తూ అన్నాడు - చిన్నన్న తెలివితేటలకు మురిసిపోతూ -"నిజమేరా ? ఏమో నేనురా తమ్ముడూ అన్నాడు"- అంటూ అనుమానంగా సన్యాసివైపుచూసేడు.

"ఓరి మీ అఘాయిత్యం కూల! నేను మీ అన్నని కాదనా మీ అనుమానం ? నాతల్లి విశాలని పిలవండి -అదే నా తండ్రిని గుర్తుపట్టుందో లేదో?"- అనినవ్వుతు దగ్గేడు. అలా అప్పటికి రెండు మూడుసార్లు దగ్గడం - వాళ్ళు గమనించేరు.

"సరేలే! నీ విశాల, తండ్రిని గుర్తుపట్టలేనంత దూరం వెళ్ళి - అప్పుడే నాల్గేళ్ళుదాటింది?"

"ఆః అయ్యో నాతల్లీ - ముసలితల్లిని చూడలేనను కున్నానుగానీ .... నాచిట్టితల్లినీ చూడలేక పోతానను కోలేదు!- నా ఆఖరురోజులు నీదగ్గర గడపాలనుకుని వచ్చా నమ్మా!"- అనిఒళ్ళంతా కదిలిపోయేలా కుళ్ళికుళ్ళి ఏడుస్తూ వుంటే - ఇంట్లో అందరూ - అక్కడికి వచ్చేసేరు!-

"చాల్లేవయ్యా! ఎన్నడో గతించినదానికి ఇప్పుడేడ వటమేమిటి?- ఇంతకీ నువ్వు మా అన్నయ్యవేనని ఎలా నమ్మాలం?"- అని పెద్దతమ్ముడు అడిగేసరికి వంతపాడిసట్టు చిన్నతమ్ముడుకూడా .... నిజమే ఎలాగమరి?"- అన్నాడు.

సన్యాసి కళ్లు తుడుచుకుని - అలవాటైన వేదాంతపు నవ్వు నవ్వి - "పోనీలేరా నావిశాలతల్లి పోయాక .... ఇక నేనుండాల్సినపని .... మీరు నమ్మాల్సిన పనీలేదు - వస్తా నమ్మా మరదలా ....ఏదీ చిన్నమరదలు? పిళ్ళంతాపిల్లలా?- ఈ సన్యాసి పెద్దనాన్న మీకేంతేలేదా?"- అని మెల్లగ వెనక్కి తిరిగేడు!-

"మనబావగారే నమ్మా!"- అని రహస్యంగా గొణి గింది పెద్దావిడ!- "ఉష్!-" అని వారించేడుభర్త!- ఆత ర్వాత ఆచీకటో కలిసి వెళ్ళిపోయిన సన్యాసి తిన్నగా నారా యణరావు గారింటికి వెళ్లేడు!-

"ఎవరూ?"- అని తేరిపారచూసేరు నారాయణ రావుగారు, చీకట్లో ఎవరో చెక్కగేటు తీసుకుని వస్తుంటే-

"మాధవకబళం తల్లీ. జానకమ్మా! సన్యాసిని. పర దేశిని!!"- అన్నాడు గేటుదాటి లోపలకివచ్చి నిలబడి-

"ఆ! నాపేరు నీకెలా తెల్సు?" అంటూ ఆవిడ వరం డాలో లైటునొక్కి పరీక్షగ చూసింది!

"తెల్సుతల్లీ -అన్నపూర్ణమ్మలు, జానకమ్మలు ఒకళ్ళు చెప్పకుండానే తెలుస్తారమ్మా"!

"చిన్నప్పుడు విశాల తల్లినిఎత్తుకుని ఆడించి భోజనం పెట్టిన తల్లిజానకమ్మగాక మరెవరూ?"- అని నవ్వేడు-

"ఆ! ఆ! అన్నయ్యా మీరా?!- ఎన్నాళ్ళికి కనిపిం చేరూ?" అంటూ జానకమ్మ మెట్లుదిగింది!- నారాయణ రావుగారు గబగబా ఆ సన్యాసి దగ్గరకి వెళ్ళి "బావారండి!" అని వరండాలోకి తీసుకొచ్చి కుర్చీలో కూర్చోబెట్టేరు!-

జానకమ్మ హడావిడిగ ఇంట్లోకెళ్ళింది!

"వీడు పెద్దాడు రామం....వాడు చిన్నాడు ప్రకాశం వీళ్ళిద్దరి మధ్యలో అమ్మాయి మాలతి- అదిప్పుడు హైద్రా బాదులో ఉద్యోగం చేస్తోంది! పెళ్ళిచేసుకోలేదు. శ్రీదేవి

అత్తారింట్లోవుంది!- భవానికి ఇద్దరుపిల్లలు .... ఇప్పుడు సుఖపడుతోంది!- ఏవేవో చెప్పుకుపోతున్నారు, నారాయణరావుగారు -జానకమ్మ గ్లాసునిండా మజ్జిగతెచ్చి- "తాగండి అన్నయ్యా -విశాల మనకన్యాయం చేసింది!"- కళ్ళనిండా నీళ్ళు నిండుకొస్తుంటే గద్గదస్వరంతో అన్నది.

తలపంకించి - "విన్నానమ్మా - నేను ఎవరికోసం ఇంతదూరం వచ్చానో ... వాళ్ళునాకన్నా ముందే ఈభవ బంధాలు తెంచుకుని వెళ్ళిపోయేరని విన్నానమ్మా!- సన్యసించి - ఈసంసార తాపత్రయాలకి దూరంగ వుండాలనుకుని వెళ్లేను!- ప్రపంచాన్ని చూసేను!- అనాధులు.... ఆర్తులు.... కుంటి, గుడ్డి, మూగ, అనేకరకాల వికలాంగులు .... కుష్టు రోగులు ....వృద్ధులు .... ఎందరో కనిపించేరు!- కళ్ళుమూసుకుని జపంచేసుకున్నప్పుడల్లా .... వాళ్ళంతా కనిపించేవారు! ఎంతవెర్రివాణ్ణి!- ఎక్కడోవున్న దేవుణ్ణి .... ఆదేవుణ్ణిచూడాలని తపస్సు చేసుకునే నేను ఎంతవెర్రివాణ్ణి! అనుకున్నాను వీళ్ళందరి సేవలో ఆమాధవుడు ....ఆ ఈశుడు....కనిపించడా?- ఈసత్యం తెలుసుకునేందుకు ఇంతకాలం పట్టిందమ్మా!- అయితే - నాఆరోగ్యం దెబ్బతిన్నది! ఏదితిన్నా కడుపులో మంట!- అరగదు!- నొప్పి!- ఇంకెంతకాలమో లేదని తెల్సు! ఈ ఆఖరి క్షణాల్లో నావిశాలతల్లి దగ్గరవుందామని - దాన్ని ఏడ్పించిన ఉసురే-ఈమంటనిపించి వచ్చాను - కానీ నాసహోదరులు .... నేను వాళ్ళన్ననికాదని అనుమానించేరు! పిచ్చివాళ్ళు! వాళ్ళభయం వాళ్ళది!- ఆస్తి అడుగుతానేమో

అని! కానీ నాతల్లేపోయాక ఇకనాకెందుకమ్మా ఆ ఆస్థి! పిల్లలున్నారు వాళ్ళనే అనుభవించనీయ్!"-

మజ్జిగగ్లాసు అందుకుని-"ఈరోజు మీఇంటి అతిధ్యం ఋణంవుంది కాబోలు ... అందుకే అంతదూరంనుండి వచ్చాను .... నాస్వగృహం అనుకున్నచోట ....కనీసం మంచి నీళ్ళుకూడా వాళ్లివ్వలేదు!- అని తృప్తిగ తాగేడు.

జానకమ్మ ఆశ్చర్యంగచూసి-"ఎంతదారుణం?"-అంది

రామం ఉడుకునెత్తురు పొంగి-"దారుణం అని వూరు కుంటారామ్మా ? వాళ్ళన్నీ అలాచేయబట్టే .... విశాలచచ్చి పోయింది. అసలుచచ్చిపోయిందా? లేదా? ఎవరికీ తెలియదు! ఇప్పుడు స్వంత అన్నగారువస్తే కాదని పొమ్మంటారా?- లేదమ్మా రేపు మనందరంవెళ్లి నల్గురిలో తన్ని వదిలి పెట్టాలి!"- అన్నాడు వూగిపోతూ.

సన్యాసి నవ్వి "ఎందుకునాయనా ఏంచేసుకోనూ? అయితే విశాల చచ్చిపోలేదా? నాలాగే ఎక్కడికో పోయిందా? పోనీలే ఎక్కడో ఒకచోట సుఖపడితే అంతే చాలు ! కానీ మగవాణ్ణి నేనిలాతిరిగినా ఫర్వాలేకపోయింది కానీ ఆడపిల్లకి రక్షణ ఏదీబాబూ? వెర్రితల్లి ఏమైపోయిందో? ఆనాడు ఆస్థిరాసి మీ ఇంట్లోనైనా వుంచేనుగానూ! ఛీ! ఏమనుకోడానికి ఏంలేదు! పోనీయండి .... నేనుమాత్రం ఇంకెంత?"-

"అలా అనకండి బావా! ఏమిటసలు జబ్బు -డాక్టరకి చూపిద్దాం!"-

"ప్చ! ఎందుకు శ్రమ! అశాశ్వతమైన ఈ దేహంకోసం నేను ప్రాకులాడను"-

"నిజమే! కానీ మీరు ఇప్పుడు వచ్చినట్టే .... మళ్ళీ ఎప్పుడైనా విశాల బ్రతికేవుండివస్తే"- అన్నాడు రామం....

"పిచ్చివాడా! ఆ యుర్ధాయం కోరుకుంటే వస్తుందా? ఎన్నాళ్ళు ప్రాప్తమో అంతకాలం ఈభూమిమీద నిలవాలి"..... "అదిసరికాదు! 'అకాలమృత్యుహరణం!' అని ఎందుకంటారు?- మన పెద్దలుచెప్పే శాస్త్రాలన్నిటిలో - మంచిచెడు .... వెలుగు .... నీడ .... అన్నీ పక్క-పక్కనే వుంటాయి! మానవ ప్రయత్నంచేసి .... ఫలితం వదిలేయాలి! మీ బ్రతుకు మీకోసమేకాదు .... ఇందాక మీరన్నట్టుగ.... ప్రజాసేవకి వినియోగించండి! ఒకవిధంగ మీరింతకాలం చేసింది .... చీకటిదారిలో నడవటమే!- ఇప్పుడే వెలుగు చూడండి!- మీఆరోగ్యాన్ని చక్కదిద్దుకుని .... దేశసేవ చేయండి!"- రామం ఉద్రేకంతో చెప్తుంటే .... నారాయణ రావుగారు విస్తుబోయేరు. ఒకనాటి రామం జులాయిగా తిరుగుతే - ఈనాటి రామం కర్తవ్య నిర్వహణం బోధ చేస్తున్నాడు——

సన్యాసి కళ్ళల్లో ఓకొత్త కాంతి తళుక్కుమంది!

జానకమ్మగారు లోపలికి వెళ్ళి అందరికీ భోజనాలకి సిద్ధపరచింది!

అందరు సహపంక్తిని భోజనంచేస్తుంటే - రామానికి- ఫర్వాలేదు అమ్మానాన్నా మారిపోతున్నారు!- లేకపోతే

దేశాలుపట్టి తిరిగిన సన్యాసికి ప్రాయశ్చిత్తం లేకుండా .... ఇంట్లో సరసన భోజనంపెట్టడం-ఎంతమార్పు అనుకున్నాడు!-

మర్నాడే డాక్టర్ గార్కి చూపించి పరీక్షచేయిం చాలని తీర్మానించేరు—

# 17

వానలు బాగా పడుతున్నాయి! ఎండపొడ పడటమే తక్కువైంది! పెరడంతా బందబందగా .... వీధివాకిలి నీళ్ళ మడుగులతో వుంటున్నాయి!-

ఊళ్ళో అక్కడక్కడ 'కలరా' లక్షణాలు కనబడు తున్నాయి!- హెల్త్ డిపార్ట్‌మెంట్ వాళ్లు -'వాక్సినేషన్స్'- ఇంజక్షన్లు ఇస్తున్నారు .... కానీ మూఢత్వం పేరుకుపోయిన సనాతనపరులు - 'దానివల్ల ఏమవుతుందీ?' అనుకుని వాళ్ళు వచ్చేసరికి ఇళ్ళ తలుపులు వేసుకుని -తప్పించుకుంటున్నారు.

పైడమ్మ - నయాపైసంత బొట్టుతో ....పచ్చనిరవికె- ఎర్రని చీరకట్టుకుని - నడినెత్తిన కొప్పుపెట్టుకుని - చాటలో బియ్యం .... గవ్వలదండ .... వేపమండలు....రాతిగొరవ్మ.... చారెడు కుంకంతో -"అమ్మగోరూ-" అనివచ్చింది. దాని నోట్లో వేపాకు నానుతోంది!—

భవానీ ఇంట్లో కూరతరుగుతోంది. అత్తగారుమెల్లగా వీధులోకెళ్లి పైడమ్మనుచూసి...."వస్తానుండు"- అసలోపలికి వచ్చింది. పక్క గదిలో - బయటికి వెళ్ళడానికి తయారవు తున్న .... భాస్కరం "ఎవరమ్మా వచ్చిందీ?"- అన్నాడు

మామూలుగానే - అయితే తల్లి మాత్రం తడబడినట్లు ....
"అబ్బే ఎవరూ లేర్రా!" అని తప్పించుకోబోయింది!——

అంతకు రెండురోజులముందే - ఇంజక్షన్లు ఇవ్వడానికి వస్తే .... నేను మడికట్టుకున్నాను. మీరంతా తీసుకోండి అంది!- భాస్కరం కోపం చేసి ఇప్పించబోతే - ఒట్టేసుకుని తీసుకోను - వెధవ అడ్డమైన బట్టలతో వాళ్ళునన్ను ముట్టుకుంటే - నేనిప్పుడు స్నానం చెయ్యాలి! కట్టెలసలే పచ్చిగా వున్నాయి!' అని హఠం వేసుకుని వంటింట్లోనుంచి గాలేదు....

ఇప్పుడు 'అమ్మవారికి బియ్యం' ఇవ్వడానికి సిద్ధపడుతోందని కొడుకు తననితిడతాడని భయపడింది-ఎన్నాళ్లగానో ఈ ఆచారం సాగుతోంది! ఆవిడ కాపరానికి వచ్చిన కొత్తలో .... కోడిపిల్లలకి, మేకపోతులకి కూడా డబ్బిచ్చేవారు! క్రమంగా అది తగ్గి - కేవలం బియ్యం .... కల్లుకి డబ్బులు ఇస్తున్నారు ఇప్పుడు! ఇదంతా మూఢాచారాలని .... అందులో అసలు అర్థమే లేదని కొడుకు ఉపన్యాసం ఇస్తాడని .... ఆవిడ గ్రహించి ....అలా ?ంకింది! కానీ భాస్కరం బయటికివచ్చి చూడనేచూసేడు.——

"అయితే పెదమ్మా! నీవు చెప్తే అమ్మవారు వింటుందన్నమాట! రోజుకెన్నిసార్లు పూజ చేస్తావే నువ్వు?- మాకు, ఊళ్ళోవాళ్ళందరి రోగాలకి, నువ్వు పూజచేసి రాకుండా చేస్తావా?- ఈబియ్యం అమ్మవారికి వండి తిని పిస్తావా? కల్లుకుండలు తాగిస్తావా? .... అప్పుడు అమ్మవారు శాంతించి .... ఊళ్ళోకలరాలు .... రోగాలు రాకుండా కాపాడుతుందన్నమాట!"——

"ఏమండోయ్ అబ్బాయిగోరూ! ఇసిత్రంగ మాటాడు తున్నారే? ఎప్పుడూ నేనేప నెగదండీ?- అమ్మోర్ని నేవనిఇలా గిలా మాటాడేయకండి!- మీరంతా గుళ్ళల్లోకెళ్ళి పూజలు చేసి టెంకాయలు కొట్టారుగందా బాబూ.... ఆ రాతిదేవుడు మీ పూజలకి మెచ్చి....ఏవరాలిత్తాడు బాబూ?- "చేతులు తిప్పుతూ అడుగుతున్న పైడమ్మని .... ఒక్క క్షణం విస్తుబో తూ చూసి - "మా బాగా అడిగేవ్ పైడీ! ఈ ప్రశ్న నువ్వు ఎప్పుడో అడగల్సింది!- చెప్తావిను. గుడికి గోపురాలకి వెళ్ళేది - వరాలు కోరడానికి - మొక్కులు చెల్లించడానికి కాదు!- మనస్సు ప్రశాంతంగ వుండాలనీ - కనీసం - ఈ సంసార తాపత్రయాలనుంచి కొంచంసేపైనా నిర్మలంగ - పవిత్రంగ ఆభగవంతుణ్ణి స్మరించుకుందామని వెళ్ళుతారు- పూలు పళ్ళు .... కొబ్బరికాయలు ....ఇస్తారు నిజమేగానీ.... మనస్సే ప్రధానమనీ .... కేవలం భక్తి చాలని తెలుసుకోలేక పోతున్నారు. గనుక ఆ మనస్సు, భక్తి, ఇవ్వగల్గేస్థితికి వచ్చే దాక - అలా ఏదో ఒకటి ఇస్తున్నారు!- అంతేగాని ...ప్రతి రోగానికి ఓ పేరు పెట్టి అది దేవతని .... దానికేవో పూజలు చేసి -ఆరోగ్యం తగ్గాలనుకోడం ఎంత వెర్రి?? మన శరీరంలో కల్గేమార్పువల్ల .... తేడాలవల్ల.... రోగాలువస్తాయి! అప్పుడు ఆమార్పుకు సరిఐనవైద్యం చేసుకోవాలిగానీ - ఆదేవతే తగ్గిస్తుందనుకోవాలా?- పడిశభారం పట్టి తలనొప్పిగవుంటే- శొంఠికొమ్ము అరగదీసి వేసుకుంటావా లేకపోతే - ఆరోగం- పేరు 'మరియమ్మ' అని దానికి ధూపంవేసి కోడిపిల్లనివ్వాలనీ అనుకుంటావా?- ఆదీగాక రోగాలు వచ్చినప్పుడే - ఈపూ

జలు చేస్తావుగదా?- మరి గుడికిఅలా కాదుకదా వెళ్ళేది!- ఆగుడిలోవుండేది, పరమాత్మ!- అంటే మనలోవుండే ప్రాణం అన్నమాట ! మరినువ్వు చెప్పేదేవతలు, మనశరీరానికి వచ్చే జబ్బులు- అర్థమైందా?"- అన్నాడు - అంతకన్నా దాని కర్థమయే భాషలో చెప్పలేక ....ఎప్పటినుంచో వ్రేళ్ళుతన్ని పాతుకుపోయిన అజ్ఞానం తొలిగించలేక .... ఆగేడు——

"ఏటండీ ఇయ్యాలమీారు కాదంటే పోతుందా ఈ ఆచారం! మాకులపోళ్లు నేనుగనుక బియ్యం తేకపోతే తంతా రండీ .... ఏడాదికోపాలైనా మాకువచ్చే ఆదాయం వదులుకోమంటారేటండీ?"- అని గొంతుపెంచే సరికి పెళ్లున నవ్వాడు-

"ఆ అలాచెప్తే ఎందుకివ్వరూ?- ఇదిగో ఈరూపాయ తీసుకుపో మళ్ళీ అమ్మవచ్చిందంటే - డబ్బెందుకు అని గోల పెడ్తుంది!"- అంటూ జేబులోనుంచి రూపాయనోటు తీసి అందించాడు - "బాబులు సల్లగుండాల - ఏటోనండి మాకవన్నీ తెలుత్తాయేటండీ?- మాపెద్దలు ఎట్టాచెప్తే అట్టా ఇనుకోడమే! వత్తామరి దండాలండీ"- రూపాయినోటు బొడ్డో దోపుకుని వెళ్ళిపోయింది!-

దానివైపుచూస్తూ-మీాపెద్దలు చెప్పినట్టు మీారు.... మాపెద్దలు చెప్పినట్టుమేము వినాలి!- అందుకే ఇలా వున్నాం!- అనుకుని ఇంట్లోకి నడిచేడు——

బియ్యం డబ్బాలో మళ్ళీ బియ్యం పోసేస్తున్న తల్లిని చూసి- "ఏమ్మా బియ్యం ఇద్దామనుకుని - అది వెళ్ళిపోయిందిగదా అని మానేసేవా?" అనడిగేడు--

"చాల్లేరా మహానేర్చేవు! నీకీగుణాలు ఈమధ్యే పుట్టుకొచ్చాయి! ఇదువరకు ఇలా నేవున్నావా?"

"నిజమే! ఇప్పటికైనా నిజాలు తెల్సుకున్నాను. ఇంతకుముందు ఆజీవితం అంతా అజ్ఞానమే!-

"ఉహూ! ఇప్పుడువిజ్ఞానవంతుడవయ్యావు! పెద్దల్ని.... సాంప్రదాయాలనీ, ఆచారాలనీ ఎదిరించి గొప్పవాడివవుతున్నావు!- అని నిష్ఠూరమాడింది!

"అయితే తమ్ముళ్ళూ అంతేగదా?"

"అదుగో ఏమన్నాఅంటే వాళ్ళని తీసుకొస్తావు".

"కాదుమరీ? వాళ్లు ఏంచేసినా వూరుకున్నదానివి- నేనుచేస్తే సహించలేవేం? ఇవ్వన్నీ - వాళ్ళదగ్గర ఎందుకు చెప్పవ్?"

"వాళ్లు వినరు! ఉద్యోగస్తులు!"

"నేనూ వినదల్చుకోలేదు .... ఉద్యోగం చేస్తాను!"

"అఘోరించు! నాదారికడ్డురాకు!"-అంది కోపంగా...

"అదెలాగ? నేనుండేది ఇక్కడే! ఉద్యోగం చేసేది ఇక్కడే"-

"ఏమిట్రా నీవితండవాదం? ఇక్కడేవుండి -అనాచారప్పనులన్నీ చేసి-సంప్రదాయాలన్నీ మంటగల్పుతానంటావ్? చెయ్యరా చెయ్యి యాదవుల కడుపున మొసలం పుట్టిందనుకుంటాను-...."అంటూ నిస్సహాయంగా కూర్చుండిపోయింది.

భవానీ మౌనంగ వంట ప్రయత్నంలో పడింది!-

భాస్కరం తీరుబడిగ తల్లిపక్కన కూర్చుని మొదలెట్టేడు!-

"అమ్మా! చూడూ - తెలియని వాళ్ళకి చెప్ప వచ్చును. తెలిసినవాళ్ళకి చెప్పవచ్చును. తెలిసీ తెలియని వాళ్ళకి చెప్పడం మహాకష్టం! ఇప్పుడా పైడమ్మకేదీ తెలియదు! చెప్పగానే 'పోసీలెండి' అని నేనిచ్చింది తీసుకుని వెళ్ళిపోయింది! కానీ మనం తెలిసీ తెలియనట్టులెక్క! ఎందుకంటే - మనది కులంలో గొప్పనుకుంటాం! నిత్యం ఇంట్లో పూజ పునస్కారాలుచేస్తాం!- మళ్ళీ ... పైడమ్మలాంటి వాళ్ళకి పూజచేసి రమ్మని బియ్యాలు పైసలు ఇస్తాం! ఏమ్మా పైడమ్మకంటే మనం తక్కువా? మనమేఎందుకు చేయగూడదూ? మన గుడ్డలు చాకలాడు ఉతికితే పవిత్రం! మళ్ళీవాణ్ణి మనం తగలగూడదు!- పొలంలో ఊడ్పులు .... నూర్పిళ్ళు .... కోతలు .... నాట్లు - అన్నీకూలీలు చేస్తారు. అవన్నీ పవిత్రమే.... మళ్ళీ వాళ్ళని తగలగూడదు! జీవాత్మని మనం పరమాత్మ అని నమ్ముతాంకదా? అందరిలో వుండేది జీవాత్మేకదా?-మరి ఎందుకమ్మా ఈభేదం?- గుళ్ళో కొబ్బరికాయ ఎందుకు కొడుతాం? పైపీచులాంటి అజ్ఞానాన్ని ఛేదించుకుని - పెంకులాంటి భవబంధాలు పగలగొట్టుకుని - నీళ్ళలాంటి ఆత్మవస్తువుని - తెలుసుకున్నామని - ఆ వస్తువుని భగవంతునికి నివేదనచేస్తారు! నిజంగా ఆత్మార్పణ చేసుకునే మహానుభావులకు.... కొబ్బరికాయలతో, గుళ్ళతో పనిలేదు!- ప్రతినిత్యం మనం సంకల్పం చేసుకునేపూజలో .... మనం చేస్తున్నపని భగవంతుడికి చెప్పుకోడం అన్నమాట!-

వ్రతాలు, నోములు, దానాలు పుణ్యంకోసంచేసే ప్రతిచర్యా- మళ్ళీ జన్మకి పునాదులు వేసుకోడం!- అందుకే మహాత్ములు ... పుణ్యం కోసం చేయరు! భగవంతుని పేరిట ఫలితాన్ని వదలేస్తారు! ఆత్మశుద్ధి ముఖ్యంగానీ - అనవసర హైరాన .... పడటం .... కడిగిందే కడగటం మనుష్యుల్ని మొట్టుకోకపోవటం .... గాలి, ధూళి అనుకునీ .... అమ్మవార్లనుకుని పూజలుచేయటం .... ఎంత హాస్యాస్పదం?- నువ్వు మొన్న ఇంజక్షన్ తీసుకోమంటే వినలేదు...ఆమందు శరీరంలోకి వెళ్ళి - బయటనుంచి రాబోయే జబ్బును శరీరంలో ప్రవేశించేసరికి అణిచిపారేస్తుంది! ఇలా ప్రత్యక్షంగా వైద్యం చేయించు కుంటూవుగానీ .... ఎక్కడో పైడమ్మ లాంటివారు అమ్మవారికి పూజచేస్తే రోగంరాకుండా పోతుందా?- ఏమిటమ్మా ఈపిచ్చి?!"- అని నిధానంగ బోధపరిచేసరికి - "ఆవిడకాస్త మెత్తబడి .... ఏమోరా? అవన్నీ ఏం తెలుస్తాయి? మొదట్నుంచీ చేస్తున్న పనులు మానలేక చేస్తున్నాం" అంది-

"అదిమన మానసిక బలహీనతమ్మా! ఆత్మస్థైర్యం వుంటే - అలాంటి భయాలుండవు!"

"నిజమేమరి! ఒక్కసారి పుట్టుకురాదుగ!" - అని లేచింది-భాస్కరం తృప్తిగనిట్టూర్చి బయటికి వెళ్ళిపోయాడు.

o o o

ఒకొక్కమెట్టే ఎక్కివస్తున్నప్పుడు - చుట్టుపక్కల ప్రదేశాలన్నీ చూడగల్గుతున్నప్పుడు కల్గేఅనుభూతి లాంటిదే భాస్కరం - తల్లికీ తండ్రికీ కలుగచేస్తున్నాడు!-

వాళ్లిప్పుడు కొడుక్కి భయపడుతున్నారు. ఇదువరకటిలా ఆచారవ్యవహారాలు సాగనియ్యటంలేదు. అప్పుడప్పుడు హోటల్‌నుంచి టిఫిన్లుతెస్తే భవానీ పిల్లలతోపాటు తల్లికూడా తింటోంది!

మధ్యాహ్నంపూట కాఫీ ఫలహారాలకి ఒస్తులున్న 'స్టౌ' కొన్నాడు—

'ఎంత సుఖంగావుందో'? అనుకుంది తల్లి —'మా కాలంలో ఇలాంటి సౌఖ్యాలెరుగక అంతలేసి కష్టాలు పడ్డాం' అనుకుంది—

తండ్రికూడా సంధ్యావందనం జపం త్వరగా ముగించుకుని కాఫీకోసం ఎదురుచూస్తున్నాడు - అందరితోపాటు ఆయనకి సుఖంలోవున్న తృప్తి తెలిసివచ్చింది!-

కాళ్ళుపగిలి నొప్పులుపుడుతున్నాయని తల్లిఅనుకుంటే ఆకుచెప్పులు కొనుక్కుని వచ్చాడు .... పళ్ళు నొప్పులంటే టూత్ పేస్టు కొన్నాడు!- బాత్ రూమ్‌లో - టూత్ పేస్టులు .... బ్రష్‌లు ... సబ్బులు ... చేరేయి!-

ఊరికి కరెంటువస్తే .... తమ ఇంట్లోనూ పెట్టించుకున్నారు. అంట్లకి, బట్టలకీ - గొడ్లదగ్గర చాకిరీకి పనిమనిషిని పెట్టుకున్నారు. - ఇదువరలోలాగ కందిపప్పు మినపప్పులు - వాళ్ళే బాగుచేసుకోకుండా... మనిషినిపెట్టి చేయించుకుంటున్నారు. అత్తాకోడలు కలిసి బయటికి వస్తువులు తెచ్చుకుందుకు వెళ్ళివస్తున్నారు.

సుఖపడుతున్న కొలది, ముసలమ్మకి పట్టింపులు తగ్గిపోయాయి!

'ఎన్నడూ మాఊరికి రామ్మా అని ఉత్తరం రాయని చిన్నకొడుకులు ... కోడళ్ళకంటే - అనుక్షణం తమని కని పెట్టుకునివుండే పెద్దకొడుకు కోడలు .... ఉత్తములుగా - కనిపించేరు' - ఆముసలి దంపతులకి - ఇందు, బాబు పెద్ద వాళ్ళవుతున్నారుగదా? ఇంక కొడుకు చెప్పినట్టు మనం వినాల్సిందే' అనుకుని సమాధానపడ్డారు.

ఆనెలలోనే ఆఊళ్ళో పెట్టిన 'స్టోర్సు'లో మేనేజర్‌గ, భాస్కరాన్ని ఎన్నుకుని - ఉద్యోగం ఇచ్చారు!-

# 18

ధవళకాంతులు వెదజల్లుతు .... తెల్లనివస్త్రాలు, అంత కన్న తెల్లని నిర్మలమైన మనస్సులు - ఎంతటిబాధనైనా మరిపింప చేయగల చిరునవ్వులు ... టకటక బూట్లుచప్పుడు అవుతుంటే ... మిషన్‌లాగ చకచక పనులుచేస్తూ -మానవ లోకానికి సేవచేసి సేదతీర్చే దేవదూతలా-అన్నట్లున్నారు.... ఆనర్సులు!—

ఆసుపత్రి వాతావరణంలో వున్న మొక్కలకి మాలి అప్పుడే నీళ్ళుపోసి వెళ్ళాడు-ఉదయిస్తున్న సూర్యకిరణాలలో-ఆపువ్వులమీద పడిన నీటిబిందువులు ముత్యాలు జల్లినట్టు మెరుస్తున్నాయి!--

ఎక్కడో వున్నట్టు .... తేలిపోతున్నట్టు .... కళ్ళువిప్పి విడనట్టు ... కత్తెరచప్పుళ్లు అడుగుల సవ్వడి - మెల్లగా మాటలు - అంతా మత్తుగవుంది!-

ఆసుపత్రి అంటేనే అదోకలోకం!- రోగులు ... మందుల వాసన .... నర్సులతో సందడి, డాక్టర్ల పిలుపులు .... అంతా అదోక లోకంలావుంటుంది!

శక్తిని మేధను ఉపయోగించి ... రోగిని కాపాడాలని .... విశ్వప్రయత్నం చేస్తారు. నెగ్గినప్పుడు - వాళ్ళ విజయోత్సవం ఎంతటిదో - ఓడినప్పుడు అంతటి తలవంపుని భరిస్తారు. పైజడ్జిలాంటి భగవంతుడు తీర్పు చెప్తే ....వాదించలేని వకీల్లాగ రోగిని వదిలేస్తారు!--

"ఆ! మెలకువ వస్తోంది జాగ్రత్త నేను వేడుతున్నాను"- అంటూ నర్సుసుశీల స్క్రీన్ పక్కకి తప్పిస్తూ డాక్టర్ ప్రభాకరంతో చెప్పింది!-

కళ్ళువిప్పుకుని - చూసేడు.

"ఎలావుందండీ? ఆపరేషన్ సక్సెస్!- ఇంకమీకేం భయంలేదు!"- డాక్టర్ సంతోషంగ చెప్తుంటే - ఆయనగ నవ్వేడు. - "అసలు భయమెందుకు నాయనా?- నేనుదేనికీ భయపడను -ఎలావచ్చానో అలా వెళ్ళిపోదామనుకున్నాను. ఆ నారాయణరావుగారు - పరాంకుశంగారు .... పట్టుబట్టి - నువ్విక్కడ వున్నావని తీసుకుని వచ్చారు!- నాకిప్పుడు బాగు పడినా పడకపోయినా ఏం ఫర్వా లేదు నాయనా!- నా విశాలే లేకపోయాక నాఫర్వా లెందుకు?"-

"సరేలెండి మీారెక్కువ మాట్లాడకండి! రెష్టుతీసు కోండి!"- డాక్టర్ అక్కడ్నుంచి మెల్లగ పక్కగదిలోకి వెళ్ళిపోయాడు!--

ఫ్లాస్కులో కాఫీ కప్పులోపోసుకుని - కిటికీ కర్టెన్ పక్కకిజరిపి ఒక్కొక్క చుక్కే- స్లిప్ చేస్తు ఆలోచిస్తున్నాడు.... ప్రభాకరం ....కిటికీ అద్దబద్దీల్లోనుంచి క్రోటన్స్ అందంగా ఊపి స్తున్నాయి!- వారం రోజుల క్రితం - నారాయణరావు గారు ... తనతండ్రీ, విశాలతండ్రిని తీసుకుని - ఇంటికి వచ్చారు ... ఇన్నాళ్ళకి మళ్ళీ ఇంటికి తిరిగివచ్చిన విశాల తండ్రి ఏదో జబ్బుతో బాధపడుతున్నాడనీ ... అయినా విశాల లేకపోయాక .... ఇకఏమైనా ఫర్వాలేదనీ.... అంటే.... వీళ్ళుమెల్లగ నచ్చచెప్పి తీసుకువచ్చారట!- తనుపరీక్ష చేసేడు...లోపల అల్సర్ ఏర్పడింది - ఆపరేషన్ చేసి బాగుచేయాల్సి వచ్చింది - రెండురోజులు ముందుగానే ఆసుపత్రిలో జాయిన్ చేసి ... తను అన్నిరకాల పరీక్షలు చేసేడు!- విశాలతో చెప్తే ... తనుఇంకా కొన్నాళ్ళు అజ్ఞా తంగవుండాలి .... లేకపోతే .... వాళ్ళేమనుకున్నారో తెలు సుకోలేం! - కనీసం ఈ ఆపరేషన్ సక్సెస్ అయ్యేదాకా నైనా నాపేరూ, నన్నూ, బయటికి తీసుకురావద్దని చెప్పింది!- ఆగడువు తీరింది! ఇకవిశాలని అలా తెరచాటున ఉంచాల్సిన పనిలేదు. ఆతండ్రీ కూతుళ్ళని కలపటం ... నల్లురికి విశాల బ్రతికివుందని తెలియచేయటం నాధర్మం! ఈ రహస్యం ఇంకానాలో దాచుకోటంకష్టం! కాఫీకప్పు కిటికీ లోపెట్టి ... దూరంగ నర్సులునిల్చుని మాట్లాడుకుంటున్న

వైవుదృష్టి నిలిపేడు!- ఎంతచలాకీగ కనిపిస్తోంది విశాల!- ఈవారం రోజులనుండీ - ప్రపంచాన్ని జయించినంత ధీమా గర్వం ... కనిపిస్తున్నాయి ఆమెలో!- ఒకప్పుడు ఎక్కడా లేని దైన్యమంతా ఆమె ముఖంలో గూడుకట్టుకున్నట్టుండి- నిరాశానిస్పృహాలతో వీగిపోయి ... ఆఖరికి ఆత్మహత్యకి కూడా సిద్ధమైంది!- ఆనాడు దైవవశాత్తు తనకంట పడింది గనుక - విశాల జీవితం ఈనాడు పరిపూర్ణతని సంతరించు కుంది!- లేకపోతే? ఒక మహత్తరమైన చేయి - మంచి మనసు - ఓర్మిగల మనిషి - ఈరోగులకి, అనాథలకి, వికలాం గులకి, కరువయ్యేది! విశాల అందరిలాగ్గాగ 'షార్ట్‌కట్' ముగించుకోవాలనుకోదు!- అందులోనే లీనమై .... చేస్తుంది! ఆమె-జీవితధ్యేయమే ఆవృత్తి! స్వతహాగా చిన్నప్పట్నుంచీ పనిపాటలు నేర్చిన మనిషి - జాలి, కరుణగల మనస్సుగలది కనుకనే ... నర్సుగా నిలబడగల్గింది! ఆసుపత్రిలో అందరికీ- 'సిస్టర్ సుశీల' అంటే ఎంతఇష్టమో ... అభిమానమో?!- ఇంతమంచి వ్యక్తిని - ఇంకా దాచిపెట్టి వుంచటం - మంచి పనికాదు. వాళ్ళ నాన్నకి శాస్త్రకులాసాగావున్నాక-అందర్ని పిలిచి చెప్పాలి 'అనుకున్నాడు'!,

# 19

అప్పుడే స్నానం చేసి బట్టలు వేసుకుని కూర్చున్నాడు నారాయణరావుగారు. మాలతి కాఫీచేసి గ్లాసుల్లో పోసి తనొకటి తీసుకుని తండ్రికొకటి అందించింది..

"అయితే-ఇప్పుడు ఆయన ఎక్కడుంటారు నాన్నా"- అని అడిగింది మాలతి, విశాలతండ్రిని గురించి. "అదేనమ్మా నా ఆలోచనకూడా! ప్రస్తుతం కొన్నాళ్లు డాక్టర్ ప్రభాకరం ఇంట్లోనే వుంచాలి. తరువాత మరి....ఆయన తమ్ముళ్ళతో ఆస్తి పంచమని అడుగుతాడో .... ఏదైనా వ్యాపకం కల్పించుకుని బ్రతుకుతాడో తెలియదు!"-

"చాలా విచిత్రంగ వుంది కదా నాన్నా ?"-

"ఏమిటి ?"

"అదేనాన్నా-విశాల బ్రతికినంత కాలం తండ్రి రాలేదు! ఇప్పుడు విశాల లేదు!"

"అంతేనమ్మా! - చూడరాదూ? నీకు సంబంధం చూసినప్పుడు....వాళ్ళేమో కట్నం ఎక్కువ ఇవ్వమన్నారు.... మనం వదులుకుని ఉద్యోగం చేసుకుంటుంటే .... ఇప్పుడేమో ఆ అబ్బాయి - అసలు ఏమీ అక్కర్లేకుండా చేసుకుంటానంటున్నాడు-. అన్నయ్య నాకంతా చెప్పాడమ్మా!- నేను ఆ అబ్బాయిని కలుసుకుని ఆ సంగతేమిటో కనుక్కుందామనుకుంటున్నాను. ఏమంటావమ్మా?!- అని నారాయణరావు గారు అడిగేసరికి - ఆశపిల్లైయిపోయి -సిగ్గుపడి - "తొందరపడకండి నాన్నా-మీరు వచ్చినట్టు తెలిస్తే బహుశా అతనే వచ్చి అడగవచ్చును!"-అంది!

"దాన్ని ఎలా తెలియడం ?"-

"నేను ఇవాళ విద్యానగర్ వాళ్లక్క గారింటికి వెళ్తాను. అన్నయ్య ప్యాసైనాడు గదా! ఆ వార్త చెప్పివస్తాను. సుజన కూడా వస్తుందిలెండి!– "అంటూ కాఫీగ్లాసు కిటికీలో పెట్టి లేవబోతున్నంతలో.... సుజన ఒక ప్లేటులో – రెండు దోసెలు చట్నీ పెట్టి తెచ్చింది – ఆ వెనుకే శాంతారావుగారు .... వస్తూ ... "నమస్కారం నారాయణరావుగారూ!– మీరు నన్ను క్షమించి–ఆటిఫిన్ తినేయండి! నాకు మనుష్యులందరూ ఒక్కలాగే కనిపిస్తారండీ!– రంగు కళ్ళజోళ్లు పెట్టుకుని చూడ లేనండి!– అందుకే మా మిసెస్ చెప్తున్నా వినిపించుకోలేదు! మీకు ఆచారమని తినరనీ .... చెప్పింది – 'అదేమి పాపం చేసేమూ?–మైసూర్ శాండిల్ సోప్తో చక్కగ స్నానం చేస్తాం! శుభ్రంగ ఉతికిన బట్టలు కట్టుకుంటాం! ఇల్లూ వాకిళ్ళూ రోజూ నాల్గు సార్లయినా తుడుపిస్తాను!– ఇంక ఆచారం లేకపోవడం అంటే ఏమిటి?– వారికి వున్నట్టే అన్ని అవయవాలు మనకీ వున్నాయి!– రోగాలున్న వాళ్ళమూ కాదు! తినే పాత్రలన్నీ విమ్మ్ పౌడి వేసి తోమిస్తాముగదా? మరింకే? అయనెందుకు తినరు మనింట్లో"–అంటే 'మీరు తినిపించండి చూస్తానూ' అంది! రామరామ ఇంతబతుకూ బతికి ఆడదాని చేతిలో ఓడిపోవటమండీ?– మనం ఏ జాతి వాళ్ళం! అదిగో అమ్మాయి లిద్దరూ మరొక జాతి!– మను ష్యుల్లో ఈ రెండు జాతులే గదండీ వున్నవి?– మరెందుకు ఈ తేడాలు?– అందుకనీ కమాన్ తినేయండి – అమ్మా సుజనా ... వెళ్ళి కాఫీకూడా పట్టుకునివచ్చేయి!"– అంటూ

గాలి పూసుకువచ్చినంత వేగంగ మాట్లాడేసి మంచంమీద-నారాయణరావుగారు పక్కనే కూర్చున్నారు. "అమ్మా మాలతీ ! నీకిప్పుడు పెట్టటంలేదమ్మా మళ్ళీ భోజనంచెయ్యి వసీ .... అంటుంటే- అబ్బే నేనిప్పుడు తినలేను" అంటె సుజన ప్లేటు నారాయణరావుగారికి- అందించబోయింది!

ఆయన ఇరకాటంలోపడి 'ఎలాతినాలా?'- అన్నట్టుగ ఒక్క-క్షణం సంశయించేరు!- అది కనిపెట్టిన కాంతారావుగారు, "ఆహా అయిందీ!?" అని అందుకున్నారు

"నేనే ఓడిపోయానన్నమాట!- మనమధ్య తేడాలున్నాయన్నమాట!- అవునుగదా మనుష్యులంగదూ? సృష్టిలో అన్ని జీవరాసులకన్నా పైమెట్టుమీద వున్నాం కనుక, ఇలా ఒకళ్ళకీ మరొకళ్ళకీ మధ్య దూరాలు పెంచుకోవలసిందే!- పశువులు, పక్షులు, పురుగులు .... చీమలు అబ్బ ఎంతహాయుండీ వాటికి!- ఏ బాధా లేదు. ఒక్కచోట తింటాయి, ఒక్కచోట తాగుతాయి .... ఒక్క చోట పడుకుంటాయి!- వాటిని చూసికూడా మనం నేర్చుకోలేం!-భూమ్మీద ప్రవహించే నీరంతా ఒక్కటే!- కానీ అది ఇళ్ళల్లోకి వచ్చేసరికి దానికీ 'కులం' వస్తుంది! చిన్నప్పటిపాఠం మర్చిపోతాం! .... నీటికిరంగురుచి వాసనలేమీ అన్ని, - ఏ పాత్రలోపోస్తే ఆరూపమే వస్తుందనీ, మర్చిపోయి - ఏకులమింటికి వెడితే ఆకులమే వస్తుందని పాఠంమార్చుకోవాలి!-అలాగే పొలాల్లో పండినధాన్యం....ఏకులంనీటితో వండితే.... ఆకులమింటి కూడే అవుతుందనీ - అనుకోవాలి! అయితే

ఆ కూడుతిన్న రక్తానికీ ఆకులమే వస్తుందిగదా? అయితే - బ్లడ్ బాంకులో....రకరకాల రక్తాలు వేరు వేరుగపెట్టి ఏకులం వాళ్ళకి ఆకులపు రక్తమే ఎక్కించాలేమో?"... ఇంకా అలా సాగిపోతూనేవున్న కాంతారావుగారి ధోరణికి బుర్ర గందరగోళం అయి - నారాయణరావుగారు గభాల్న సుజనచేతిలో ప్లేటు అందుకుని చట్నీ అద్దుకుని-ఓముక్క- తుంచుకుని నోట్లో వేసుకున్నారు!—

మాలతి సుజన - నవ్వుకున్నారు!—

"కాంతారావుగారూ - చట్నీ చాలా బాగుంది!- అన్నట్టు మీరక్తం మారక్తం ఒకటేసుమండీ!- జీవాలు, కూడా ఒకటేసుండొచ్చు!- కానీ .... ఒకటిగమనించండి - లేతకొమ్మ తుంచినట్టు - ఊడలు దిగిన మర్రిచెట్టు తుంచ గలరా?- ఈఆచారాలు, సాంప్రదాయాలూ....ఎన్నో వందల సంవత్సరాలనుంచీ మనపెద్దలు మనలో నిలిపారు! తరతరాల నుంచీ దిగుమతి అవుతున్న - ఈవ్యాపారం ఒక్క-సారి ఆపేయాలంటే - ఎంతకష్టమో మీరు ఆలోచించడంలేదు!- 'అ. ఆ' లు ఎన్నిసార్లు దిద్దుతే పిల్లలకి వస్తాయి?- అలాగే నరనరాల్లో .... అణువణువులో జీర్ణించుకుపోయిన - ఈ పద్ధతులు .... శాస్త్రాలూ .... బుద్ధులు - ఒక్క- ఉపన్యాసంతో పోతాయా? కొంతకాలం ఆగాలి!"- ప్లేట్లో టిఫిను పూర్తి చేస్తూనే చెప్పారు.

"వెరీగుడ్! వెరీగుడ్! ఎంతచక్కగా చెప్పారూ?- 'ఆ అమ్మా సుజనా .... క్విక్! వెళ్లు కాఫీ తీసుకురా....అలాగే

అమ్మతో చెప్పు .... నేనే గెల్చేనని!- ఆ నారాయణరావు గారూ .... మీరింతబాగా మాట్లాడుతారని నాకు తెలియదు సుమండీ! కంగ్రాట్యులేషన్! నాకు మంచి ఫ్రెండ్ దొరికేరు!-" అన్నారు సంతోషంగ కాంతారావుగారు. మాలతి కూడా తండ్రి చర్యలకి కొంత ఆశ్చర్యబోయింది! ఆయనంత తొందరగా 'రియాక్టు' అవుతారనుకోలేదు!-

సుజన గబగబా లోపలికి వెళ్లింది! ప్లేటు కిందపెట్టి మంచినీళ్లు తాగి——

"కాంతారావుగారూ? నేను అసలు మొదట్నుంచీ- ఈ పద్ధతులకి కొంచం విరుద్ధమేనండీ! మా పెద్దమ్మాయిని మాఅక్కగారి కొడుక్కే ఇచ్చాం! వాళ్ళది ఎంతచాదస్తపు కుటుంబమో? అమ్మాయి పడే బాధలుచూసి .... నాలో ఉద్రేకం పొంగేది! కానీ ఇదిగో ఆడాళ్లువున్నారే ....ఎప్పటికప్పుడే నన్నుచల్లబర్చటం .... నాకు చెప్పకుండా ఆగొడవలన్నీ రహస్యంగ చెప్పుకోడం .... ఏమన్నాఅంటే - నాకు కోపంఎక్కువనీ తొందరమనిషిననీ .... కాపురం చెడగొడతానేమోఅని భయపడీ .... మొత్తానికి నాలో - అభ్యుదయ భావాలంటారే-వాటిని అణగతొక్కి పారేసేరు!- నేనెప్పుడు మా ఆవిడ్ని తడిగుడ్డలు కట్టుకోవద్దని కొప్పడుతూనే వుండేవాణ్ణి! ఊహూవినేదా? సరే ఇప్పుడు మాపెద్దల్లుడే మారిపోయి .... వాళ్ళింట్లో అన్నిపద్ధతులు మార్చిపారేసేట్ట! అదుగో ఆ అల్లుడు చెప్తే కొన్నిపనులు ఇప్పుడు మా ఆవిడ మానేసింది!- ఇదిగో మా మాలతి నేటితరానికి ప్రతీక. ఇక

నుంచీ వానిపిల్లలకి అభ్యుదయభావాలు త్వరగా అలవడు తాయి! అసలు పుట్టుకతోనేవస్తాయి!"- అనేసరికి మాలతి సిగ్గుపడి బట్టలుతీసుకుని బయటికి వెళ్ళిపోతూ అనుకుంది. నాన్నని నిజంగా ఈనాడే తెల్సుకున్నానని సుజన కాఫీకప్పు పట్టుకొచ్చి ఇచ్చింది!- అందుకున్నాక వెళ్ళిపోయింది.

"నిజం నారాయణరావుగారూ!- మనం చెయ్యాలనుకున్నా .... ఆడవాళ్లు పట్టునడలక పోవడంచేత .... కొన్ని విషయాల్లో మనం నిస్సహాయంగానే నిల్చిపోవాల్సివస్తోంది!- అందుకే నేను నాపిల్లలవిషయంలో వాళ్ళకి పూర్తిస్వేచ్ఛ ఇచ్చేసేను - వాళ్ళకిష్టమైన వరుణ్ణి వాళ్ళే ఎన్నుకుని .... నాకు చెప్తే .... అబ్బాయి గుణాలు .... జాబు .... మంచిగనుక తెలిస్తే .... వెంటనే మారేజ్ చేసేస్తాను!"- అన్నారు.

"నిజమేలెండి ! లేకపోతే వాళ్ళే చేసుకునివస్తే ... మనపెద్దరికానికే ఇన్సల్ట్!" అన్నారు. "బాగా చెప్పారు. వస్తామరి ఫ్యాక్టరీటైమ్ అవుతోంది మళ్ళీ సాయంత్రం కలుసుకుందాం!"- అనిలేచారు కాంతారావుగారు.

"ఆ! ఆ! వెళ్ళిరండి అమ్మాయి వెళ్ళాక .... నేను కూడా అలా బయటికి వెళ్ళివస్తాను...."-

వరండాలో నిల్చున్న సుజన .... నారాయణరావుగారు - 'మ్యారేజి విషయంలో పిల్లల్ని సపోర్టుచేయుటం' - విన్నాక - రామాన్ని తలుచుకుని తీయగనవ్వుకుంది! ఆనాటి సాయంత్రం మబ్బులుపట్టి ఆకాశం....అందంగవుంది. మాలతీ ఆఫీసునుంచి వచ్చి-కాళ్ళు చేతులు కడుక్కుని....విద్యానగర్ వెళ్ళడానికి తయారైంది!——

ఆనాటి చీర....నీలిరంగు బ్రాసో చీరతీసుకుని కట్టుకుంది! తనకిష్టమైన చీర .... ఇష్టమైనచోటకి .... ఇష్టమైన వాతావరణం .... అన్నీ మాలతికి కల్సివచ్చాయి!- సుజన తయారై వచ్చింది!- చేతులో మూరెడు.... నీలాంబరాల మాలవుంది! "అరె సరిగ్గా మాచ్ అయ్యిందే మీ చీర?"- అని ఆశ్చర్యపోయింది సుజన - అన్నీ శుభసూచకం సూచించాయి!-

నూట ముప్ఫైఆరు నెంబర్ బస్సుకూడా వెంటనే దొరికింది! విద్యానగర్ లోదిగి 'కరుణేంద్ర' అన్నబోర్డు చూసి అటు నడిచారు.... గేటు తీసుకుని వెళ్ళేటప్పటికి - వరండాలో కాలుపెట్టేరు కుర్చీలో కూర్చుని మేగజైన్ తిరగవేస్తున్న శేఖర్ తలతిప్పిచూసేడు!-

"మీరా?!!- రండి రండి....ఉండండి రెండుకుర్చీలు తెస్తాను" .... హడావిడిగ రెండుకుర్చీలు తెచ్చివేసి కూర్చోమని లోపలికి వెళ్ళి అక్కగార్ని తీసుకునివచ్చాడు. ఆవిడ రాగానే ఇద్దరూ నమస్కారంపెట్టి కూర్చున్నారు. మాలతివైపుచూస్తూ—

"నువ్వు మాలతివి గదమ్మా - నేను నీకన్నా చాలా పెద్దదాన్ని గనుక ఏకవచన ప్రయోగం చేస్తున్నాను ఏమనుకోకు!" - అందినవ్వుతూ .... తమ్ముడు ఖాళీచేసిన కుర్చీలో కూర్చుంటు!- శేఖర్ ఆడవాళ్ళదగ్గర కుర్చోలేక లోపలికి వెళ్ళాడు.

"అర్కే ఏమనుకోను! అసలు మన్నింపు అనవసరం!"- అందిమాలతి, గోడకున్న సీనరీచూస్తూ .... ఆవిడచూపులు

మాలతిపైనే వున్నాయి!- కొంచం సేపు ఆఫీసువిషయాలు.... ఆతర్వాత సినీమాలు .... మార్కెట్ ధరలు పైనసాగింది సంభాషణ. ఆవిడబొద్దుగ .... ఎర్రగ....చూడగానే గౌరవం కల్గేట్టువుంది! లేచి లోపలికి వెళ్ళింది, శేఖర్ బయటికివచ్చి- “మీఅన్నయ్యగారు”....అనేంతలో ప్యాసైపోయారండీ - అది చెప్దామనే వచ్చాను”- అన్నది మాలతి!-

“ఓహో చెప్పరేం మరి? కంగ్రాట్యులేషన్స్. ఎప్పుడు వస్తారు?”- అన్నాడు సంతోషంగ.

“మధ్యలో మాలతిగారికి- ఎందుకండీ శుభాకాంక్షలు?- అసలు విషయం వేరేవుంది - వాళ్ళనాన్నగారు వచ్చారు .... మీరు ఆలస్యంచేయకండి!”- అన్నది సుజన, మాలతిని ఓరగచూస్తూ!- మాలతి చెంపలు కందినట్లు గమనించాడు శేఖర్!—

“అలాగా? ఏదైనాపనిమీదా? ఎన్నాళ్ళువుంటారు?”-

జరిగిన సంగతంతా చెప్పింది మాలతి. మొదటవచ్చి రెండురోజులుండి వెళ్ళారు.

“మళ్ళీ నిన్నవచ్చారు. ఆపరేషన్ సక్సెస్ అయింది. రేపు సాయంత్రం వెళతారు!”- అన్నది మాలతి -

ఇంతలో శేఖర్ అక్క కాఫీలు తెచ్చింది. తాగేక మరికాస్సేపు కూర్చుని - ఆటలనుండి తిరిగివచ్చిన వాళ్ళ పిల్లలని చూసి టాటాచెప్పి .... బస్సుస్టాండ్‌కి వచ్చేసరికి

చిన్నగ చినుకులు మొదలయ్యాయి! శేఖర్ గొడుగు తెస్తానంటే వారించేరు. సుజన కెవరో తెల్సినవాళ్ళు కనబడేసరికి అటుతిరిగి వాళ్ళతో మాట్లాడింది! ఆసమయంలో — మాలతి పక్కకితిరిగి — "మీఅక్కగారు నన్నెలా గుర్తుపట్టారు?" — చిన్నగ అడిగింది — శేఖర్ చిరునవ్వుతో — "మీ తొలిదర్శనాన్ని మాఅక్కకి ఇదువరకు వర్ణించిచెప్పాను. మళ్ళీమీరు అదే వేషంలో కనిపించేసరికి — ఇంట్లోకెళ్ళి 'నేనుచెప్పిన వేషంలోనే వచ్చారు చూసి పోల్చుకో'మన్నాను. ఆరూపం నామనస్సులో హత్తుకుపోయింది!" — అన్నాడు .... మాలతి కన్నులు సిగ్గుతో వాలిపోయాయి!

బస్సురాగానే వాళ్ళిద్దరు ఎక్కేరు. శేఖర్ వెనక్కి తిరిగేడు.

వర్షం పెద్దదయింది!

సుజన మాలతి దగ్గరగా కూర్చుని...."నేను మీపెళ్ళి రాయబారం జరిపేనుగదా? మరిమీరు నాకోసం ఏంచేయరా?" — అంది కళ్లు తమాషాగాతిప్పి!

"ఓయస్ ! తప్పకుండా చెప్పండి వరుడుఎవరో?" — అంటూ ఉత్సాహంగా చెప్తున్న మాలతినిచూసి — "బాధ పడరుకదా? భయపడరుకదా? — అసాధ్యం అనరుకదా?" అన్నది. మాలతి ఓక్షణం సుజనవైపుచూసి — "అయితే తెల్సిందిలెండి ! మాఅన్నయ్యే! — వాడికిష్టమైతే ఆపేది ఏముంది? అవశ్యం జరుగుతుంది!" — అంది. సుజన మాలతి

చేయి సున్నితంగ నొక్కి - "జరిగినా జరక్కపోయినా ....
మీ మంచిమనసు చాలు మాలతీ!" అంది!!——

# 20

ఉదయం ఏడుగంటల సమయం !

ఆసుపత్రి వాతావరణం అంతా కలకలాలతో ....
కొత్తవాళ్ళకి స్వాగతం పలుకుతూ.... పాతవాళ్ళకి వీడ్కోలు
చెప్తూ - సందడిగవుంది!——

డాక్టర్ ప్రభాకరం రాత్రంతా డ్యూటీ చేసి అలసటగ
తనరూమ్‌లో కుర్చీలో కూర్చున్నాడు. పరాంకుశంగారు....
నారాయణరావుగారు .... అతనికెదురుగ కూర్చుంటే -
స్పెషల్ వార్డులో విశాలతండ్రి మగత నిద్రలో వున్నాడు -
ప్రభాకరం తండ్రినిచూసి - "నాన్నా మీ అందరికీ
ఒక అపూర్వమైన విషయం చెప్పాలని - పిలిపించాను. మళ్ళీ
సాయంత్రం నారాయణరావుగారు ఊరికెళ్ళిపోతారుగా. నేను....
ఎమర్జెన్సీ కేసులు చూసుకోవాలి! - తీరుబడిగ మాట్లాడు
కునే అవకాశం వుండదని - ఇప్పుడే రమ్మన్నాను." - అని
ఒకనిముషం ఊరుకుని - ఆయన రాత్రంతా నిద్రపట్టక
తెల్లవారుఝామునే పడుకున్నాడు .... మెలకువ వచ్చాక -
ఆయన కూడా వినేలాగ చెప్తాను. అన్నాడు ఒకచేత్తో
క్రాపు సరిచేసుకుంటు——

"ఇంతకీ - నువ్వు చెప్పేది - ఆయన విషయమా? -
లేకపోతే ఇంకేదైనానా?" - సస్పెన్సు భరించలేనట్లు పరాం
కుశంగారు ఆ దోళనగా అడుగుతే - "బాధకల్గించేదా?
సంతోషవార్తా?" - అని నారాయణరావుగారు అడిగేరు...

ప్రభాకరం చిన్నగ నవ్వి- "అదిమీరే నిర్ణయించుకోవాలి!- అయినా తొందరెందుకు చెప్తాగదా?" - అన్నాడు .... మరొక పావుగంటదాకా ఏవేవో మాట్లాడుకున్నారు! ఇంతలో ఒకనర్సువచ్చి "ఆయన లేచారు డాక్టర్"- అనిచెప్పింది. - "యస్‌కమింగ్" అనిలేచి "రండి నాన్నా .... నారాయణరావుగారూ?"- అంటూ స్పెషల్ వార్డులోకి నడిచేడు-

నర్సు .... పేషంట్‌చేత ముఖం కడిగించి .... కాఫీ తాగించి .... వెళ్ళిపోయింది! నారాయణరావుగార్ని .... పరాంకుశంగార్ని చూస్తూ ...."మీరు నాకోసం చాలశ్రమ పడుతున్నారు - ప్రభాకరం కూడా ఎంతశ్రద్ధ చూపిస్తున్నాడో?- నిజమైన ఆప్తులుమీరే! అయినవాళ్ళందరూ .... వదిలేసేరు ... కన్నకూతురూ వెళ్లిపోయింది. ఇంకనాకెందుకు ఈబతుకు?"- అన్నాడు .... వెలిసిపోయిన చిరునవ్వుతో .... అతనికిప్పుడు గడ్డాలు మీసాలులేవు!- నీటుగ-శుభ్రంగ వున్నాడు ....

"సరే సరే! మళ్లీ మొదలెట్టేరు - అయితే ఒకసంగతి చెప్పండి -మీకూతురు ఒకవేళ ఎక్కడికీ పోలేదనుకోండి - అప్పుడు బతుకుమీద విరక్తి కల్గదుకదా?"- అని ప్రభాకరం ప్రశ్నించేడు——

"ఆసంగతే వేరు నాయనా! అంత అదృష్టమానాకు?-

"అయితే విశాలమీద మీకందరికీ - చాలా అభిమానం ... ఆపేక్ష వున్నాయన్నమాట?" తండ్రిని నారాయణరావుగార్ని ప్రశ్నించేడు!- "ఎందుకులేవు? ఆ అమ్మాయేగనుక బతికివుంటే - వున్నపళంగ వాళ్ళబాబాయిలమీద

కోర్టుసమన్ ఇప్పించి ఆస్తిపంచేస్తాను"! నారాయణ రావు గారన్నారు- ఇంతలో నర్సులు మూడుకుర్చీలు తెచ్చి వేసి వెళ్ళారు.

"దానివల్ల ఏంలాభం నారాయణ రావుగారూ? పాపం తనకి చిన్నప్పుడే హజ్బెండ్ పోయాడుగదా? మోడులా బతికి ఏంలాభం?-కూర్చోండి"-అంటూ తనూ కూర్చున్నాడు.

"ఆ అదేంపెళ్ళి రా? ఆ అమ్మాయిగనుక ఇష్టపడితే మరొకపెళ్ళి చేయాల్సిందే! లేకపోతే- చదువుకుని ఉద్యోగం చేసుకునేలాగ ఏర్పాటు చెయ్యొచ్చును"- అంటూ పరాంకుశంగారు -'కదండీ'- అన్నట్టుగ నారాయణ రావుగారివైపు చూసేడు. "తప్పకుండా"- అన్నారాయన !

ప్రభాకరం నవ్వేడు!—

"చూసేరా! ఈ మాటలన్నీ మీరు నాలుగైదు సంవత్సరాల ముందేగనుక అనుకుని-ఆ ప్రకారం చేసివుంటే- లేదా వాళ్ళనాన్నగారే గనుక తిరిగి వచ్చివుంటే - విశాల క్షేమంగ ఇంట్లోనేవుండేది!- కానీ మీరానాడు .... అంత ముందుకు రాలేదు! మీకు సంఘం అంటేభయం! సంప్రదాయాలంటే .... తలొంచుకుని చేసేవారు!- మనస్సు ఎదురు తిరుగుతున్నా .... దాని నోరునొక్కి ....మూర్ఖంగ .... ప్రవర్తించేరు!- మీకన్నా ముందున్న పెద్దలూ అంతే!- అందుకే ఎంతోమంది- అమాయకులు బలై పోయారు!- ఏకొద్దిమందో ముందుకువచ్చి .... సంఘసంస్కరణ చేయాలనుకున్నా - వాళ్ళని సాగనివ్వటంలేదు!- అందుకే - ఈ సంఘదురాచారాలన్నీ సంప్రదాయాల్ని ఎదిరించే ప్రయత్నం చాలాగ.... రహస్యంగ చేయాల్సివస్తోంది!- అందరి ఆమోదంవుంటే -

ఆ చాటుమాటు పనులు ఎందుకు జరుగుతాయి!-

"ఒక అమ్మాయి - ఇంట్లోనుంచి లేచిపోయినా ... ఆత్మహత్య చేసుకున్నా ఒక అబ్బాయి - తనకి నచ్చిన అమ్మాయిని .... రహస్యంగ పెళ్ళిచేసుకున్నా - ఈచర్యలకి పెద్దవాళ్ళే కారణభూతులు!- ఎన్నికోర్టులున్నా .... ఎంత న్యాయచట్టం ముందుకు వచ్చినా ... మానవుడి మనస్సు కన్నా మించిన .... సాక్ష్యం, తీర్పు లేవు!-

మెరుగు పడవలసిందీ - మేల్కొవలసిందీ - ఈ అంత రాత్మ!- మనం దాన్నిజోగొట్టి-అజ్ఞానంగ .... మూఢంగ.... పశువులకంటే హీనంగ - ఈకట్టుబాట్లు .... పనికిమాలిన ధర్మ పన్నాలు వల్లెవేసుకుంటున్నాం!- దానివల్ల తోటిమానవ ప్రపంచానికి దూరమై .... గిరిగీసుకుని బతుకుతున్నాం!- నిజానికి మనం పాటించే ఆచారాలన్నీ .... ఒక్కొక్కటే సూక్ష్మీకరించుకుంటు వెళితే .... కొసకేమీ కనిపించదు! శారీరకంగా - మానసికంగ - ఆధ్యాత్మికంగ - పాటించ వలసిన నియమాలు, నిష్ఠలు - వాటిఅర్థం తెలుసుకోకుండా- వెర్రిచాదస్తాలుగ మార్చుకుని .... ఎవరైనా చెప్పబోతే - తిరగబడి వాళ్ళని దూషిస్తున్నారు!

"అందుకే వాళ్లు మేల్కొనేవరకు - ఈ సదభిప్రాయాల్ని - చాటుగ కొనసాగించాల్సిందే"- అని ఆగి -వాళ్ళ నైపు సూటిగ చూస్తూ ... "నేనూఅపనే చేసేను - మీ రందరూ కోరుకునే విశాల సురక్షితంగవుంది!"- అన్నాడు-

"బాబూ నిజమే?!! విశాలతల్లిడి ఆనందాశ్చర్యాల్లతో ఉక్కిరి బిక్కిరవుతూవుంటే ప్రభాకరంలేచి - "అంత లాఎక్సైటెట్ అవకండి! నిజమే! మీ అమ్మాయి బతికేవుంది.

మీరు ఆమెకోసం - ఆరోగ్యం కాపాడుకోవాలి!"- అంటూ భుజం పట్టుకుని ఆప్యాయంగ నిమిరేడు-

"ఎక్కడ్రావుందీ?"- అని తండ్రి "ఏంచేస్తోంది?"- ఆని నారాయణరావుగారూ ఆత్రంగ అడుగుతూవుంటే - తాను ఆనాటిరాత్రి .... ఆత్మహత్యనుంచి కాపాడి తీసుకుని రావడం....కర్తవ్యం బోధచేసి-నర్సుట్రైనింగ్‌లో చేర్చడం- ఆమె దృఢసంకల్పంతో - అందులో - నెగ్గి ఇప్పుడు హెడ్ నర్సుగ అదేఆసుపత్రిలో పనిచేస్తూవుండడం - చెప్పి- ఇప్పుడు ఆమెపేరు సుశీల!- ఆనాటిరాత్రే ఆవిశాల చచ్చి పోయి - ఈకొత్త రూపంతో సుశీలగమారింది!- మరొక విషయం - ఈవారం రోజులనుండి - మీకు మందులు అప్ చూ సి-మీరు నిద్రపోతున్నప్పుడు-వచ్చి చూసి పోతూన్నది మీ కన్నకూతురే!"- అని చెప్పటం ఆపి వాళ్ళని చూసేడు

"ఎంతమంచివార్త చెప్పావ్ బాబూ?"- అంటూ పేమంటు ఆనందంతో కళ్ళ నీళ్లుగారుస్తుంటే - "నేనుగర్విస్తున్నారా!"- అని పరాంకుశంగారు గర్వంగనవ్వేరు-

"నీలాంటివాళ్లు- ఉండబట్టే ఇంకా మేము ఇలావున్నాం నాయనా?"- అనినారాయణరావు గారన్నారు.

"బాబోయ్! అన్ని పొగడ్తలు నాకే అంటగట్టకండి! నిజానికి ఇవన్నీ మీ విశాల-అంటే మా సుశీలకే చెందాలి! దీక్ష....కృషి....ధైర్యం అన్నీ ఆమెవి!"-అని కర్టెన్ తీసుకుని బయటికి వెళ్ళి "సిస్టర్-వెళ్ళి సుశీలగార్ని పిలుచుకురండి"- అన్నాడు....లోపలికివచ్చి-

"మీరింతకాలం నుండి ఎవరికోసం చూస్తున్నారో....ఆవిడ మీ కళ్ళ ముందరకు వస్తుంది చూడం

డంటూ నవ్వేడు”-మరి కాస్సేపటికి....టకటక బూట్లు చప్పుడు చేస్తూ... తెల్లని మల్లె రేకలాంటి చీర, రవిక .... నెత్తిని తెల్లని 'ఫాప్'-'ధర్మం నా శిరో ధార్యం'-అన్నట్టుగ పెట్టుకుని - చేతికి వాచీ....ముఖంలో ప్రశాంతతతో .... కర్టెన్ తొలగించుకుని - అచ్చంగ దేవదూతలా నిలబడింది, సుశీల!-

“అమ్మా విశాలా!!!” అని తండ్రి.

“ఎంత బాగున్నావమ్మా!? అని పరాంకుశంగారు....

“ఎన్నాళ్ళకు కనిపించేవ్ తల్లీ?!!”-అంట్ూ నారాయణ రావుగారు....కొద్ది తేడాలతో తమ ఆనందం వెలిబుచ్చారు!-

చేతులు జోడించి నమస్కారంచేసి- “నాన్నా .... ఆనాడు, ఈనాడు, నావేషధారణ, రూపం ఒకటే - కాని అర్థాలు వేరు - ఇప్పుడు నేను సుశీల!-సేవ నా ధర్మం! ఈ సేవకి విలువవుంది!- నా జీవితానికి అర్థంవుంది!- ఈస్థితికి నన్ను తీసుకుని వచ్చిన డాక్టర్ ప్రభాకరంగారు .... నాకు వృత్తి రీత్యాసే కాక...నిజంగానే సహోదరుల్లె .... నన్ను తన స్వంత సిస్టర్లా కాపాడేరు- నన్ను ఆశీర్వదించండి మీరంతా” అంది!- “బాప్ రే! నువ్వు మళ్ళీ పొగిడ్తే నేను బయటికి వెళ్ళిపోతానంటూ” వెళ్ళిపోయేడు!-

తండ్రి ఆప్యాయంగ హత్తుకుంటే - నారాయణ రావు గారు తల నిమిరేరు- పరాంకుశంగారు - మెచ్చుకున్నారు.

ఆ సమయంలో ఆసుపత్రి భవనపు పై భాగం అంతా సూర్యకిరణాలు పరచుకుని - తూర్పు రేఖలతో... కాంతి వంతమైంది!

ఆ వార్త విన్న మాలతి....ఆరోజు ఆఫీసుకి సెలవు పెట్టి-ఆసుపత్రికి హుటా హుటీ వచ్చేసింది.అంతదూరంలో,

ఆవరణలో, పూల మొక్కల దగ్గరనుంచున్న విశాలని పరిగెత్తుకుంటు వెళ్ళి చుట్టుకు పోయింది!- వాళ్లిద్దరి మధ్య మాటలే కరువయ్యాయి! అనిర్వచనీయానందంలో ... ఎంతోసేపలావుండి....నల్గురూ చూస్తున్నారని తెప్పరిల్లేరు!-

వారంగోజుల్లో-అటు భవానీ, శ్రీదేవికి, ఇటు విశాల పూరివారందరికీ సమాచారం తెలిసి....సంతోషాలు వెల్లి విరిసి .... ఆనక అంతా .... వాళ్ళ బాబయ్యల్ని దుమ్మెత్తి పోసేరు!

మరొక నెలకి మాలతి పెళ్లిలో పందిట్లో అంతా కలుసుకున్నారు! అప్పుడు మాలతి నారాయణరావుగారితో అన్నది-"నాన్నా ఈ విశాల....కాదు....కాదు....సుశీల నాన సునం నేర్చుకున్న దేమైనావుంటే....ఏదైనా ఒక ఆదర్శమైన పనిచేయడమే-మీరు అన్నయ్యకి - వాడు మెచ్చిన పిల్లని- ఏ అభ్యంతరాలు పెట్టకుండా .... చేసేయండి!"-

"ఓ అలాగే!" అనేసేరు.

—జానకమ్మ-'సరే' ననలేక మౌనంగ వూరుకుంది!- కానీ 'పిల్లేదని' అనలేదు.

రాము మనసు సుజన తలంపుతో పరవశించింది!!- పందిట్లో కలయచూసేడు—

భాస్కరం బావ...కృష్ణబావ....భవానీ....శ్రీదేవి.... రత్నమ్మగారు, నర్సింహంగారు....భాస్కరంతల్లి ... అంతా నిండుగ కనిపించేరు! అది మాలతిపెళ్లిలా కాక-లోకకల్యాణం కోసం అంతా వచ్చినట్టు - ఆనందమయంగా కనిపించింది.



కీ. శే. వల్లభనేని శ్రీరంగనాయకమ్మ
(వ్యవస్థాపకురాలు – ప్రజాప్రచురణలు)